# కథా రచన
# కొత్త కదలిక







సంకలనం

వేదగిరి రాంబాబు


శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్

1-8-481, II అంతస్థు, శ్రీ వెంకటేశ్వర స్వామి గుడి వీధి,

చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020.

ఫోన్ - 667 665

KADHA RACHANA - KOTTA KADALIKA

**Compiled by VEDAGIRI RAMBABU**

**First edition : April 1994**

**Price : Rs. 25/-**

*Sole Distributors in Andhra Pradesh*
*Please Send Your Orders to:*
VISALAANDHRA PUBLISHING HOUSE,
4-1-435, BANK STREET,
HYDERABAD-500 001

Cover Design : RAJIPA

For Copies :

**1. Navodaya Book House,**

Opp. Arya Samaj Mandir, Badichowdi, Hyderabad

**2. Visalandhra Book House all branches**

**3. Vedagiri Rambabu**

1-8-481, II Floor, Chikkadapally, Hyd.

**Printed at :**

GAYATRI ART PRINTERS,

5-9-33, Basheerbagh,

New M.L.A. Quarters Lane,

Hyderabad.

Phone : 230 210

# కృతజ్ఞతలు

*సదస్సులో పాల్గొనడానికి కాలు బాగుండకపోయినా కడప నుండి కలెక్టరుగా కాక సాహితీ బంధువుగా విచ్చేసిన ఆప్తులు కె.వి. రమణ గారి ఆత్మీయతను ఈ సదస్సు విశేషాల పుస్తక ప్రచురణ సమయంలో మరోసారి తలచుకోవడం నా కనీస కర్తవ్యంగా భావిస్తూ-*

కృతజ్ఞతలతో
వేదగిరి రాంబాబు.

# ముందుగా మీతో నేను

**పాఠకులు, కథాభిమానులు అందరికీ వందనాలు**

తెలుగు కథకి గ్రహణం పీడింది అని ఎవరో అన్నారు. దానికి దృష్టాంతంగా కొందరి కథా సంపుటాలూ, అవి అమ్ముడు పోయిన వైనం -తెలిపి; అంకెలు, అవార్డులూ పాఠకుల ముందు వుంచారు.

ఇది శుభ పరిణామమే కదా ? అయితే ఇదంతా వాపా, బలుపా అనే ప్రశ్న తరుముకు వచ్చింది.

'కథ బాగా వుందన్నా, బాగా లేదన్నా, పబ్లిషర్లు, పత్రికలు, పాఠకులు, రచయితలు-ఎవరెవరు ఎంతెంత కారణం అనేది ఆలోచనీయం అయింది. అసలు, తెలుగు కథ పరిస్థితి ఎలా వుంది? ఎందుకని అలా వుంది? ఈ ప్రశ్నల్లో నుంచీ చాలా అనుబంధ ప్రశ్నలూ వచ్చినై.

కథలో పుట్టకపోయినా కథలో పెరిగిన నాలో తెలుగు కథకి ఏమి చేయగలను అనే ఆలోచన రోజా రోజుకీ పెరగసాగింది. కాలేజీలో వున్నప్పటినుంచే కథలు రాస్తున్న నాకు ఆ తర్వాత కథలు రాస్తాడనే అర్హతతోనే ఉద్యోగం వచ్చింది. ఇంతవరకూ పెరిగాను. సాహిత్యమే నాజీవితం అయింది.

అందుకని తెలుగు కథా సాహిత్యంతో ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రమేయం వున్న నలుగురినీ ఒక చోటకు చేర్చి కొంత ఆలోచన చేయాలనే అభిప్రాయం కలిగింది. దానికొక ఆకారాన్నివ్వడానికి

ప్రముఖంగా సాధన సాహితీ ప్రవంతి సహకరించింది. 'రచన' మాసపత్రిక వేదికగా నేనున్నానంది. విహారి వంటి శ్రేయోభిలాషులు ప్రోత్సహించారు.

ఫలితం ఫిబ్రవరి 13న కథా 'రచన' సదస్సు జరిగింది. రచన కబుర్ల కార్యక్రమం జరిగింది. ప్రముఖ కథకులు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత శ్రీ మధురాంతకం రాజారాం గారికి సత్కారం జరిగింది. 4 కథా సంపుటాల ఆవిష్కరణ జరిగింది. ప్రముఖ రచయితలూ, సాహితీపరులూ, పాఠకులూ-తమ తమ అభిప్రాయాల్ని కలబోసుకున్నారు.

ఆ అభిప్రాయాలకి, వారి వారి ఆలోచనలకి ఆకృతి, ఈ కృతి. నేను చేసింది - సంకలనం.

ఆయా అభిప్రాయాల్లో విలువైన అంశాల్ని, ఆచరణీయమైన పథకాల్ని అమలు చేయడం కష్టంతో కూడుకున్నపనేమో గానీ, అసాధ్యమైన పని కాదు.

ఫిబ్రవరి సదస్సు - తెలుగు కథకు కదలిక తెచ్చింది. ఈ కదలిక కలగడానికి ఆ సదస్సు వార్తల్ని, నివేదికల్ని - విస్తృతంగా ప్రచురించి ప్రాచుర్యం కలిగించిన తెలుగు పత్రికాలోకం వారికి హృదయ పూర్వక ధన్యవాదాలు. సదస్సుకు రాని కథకులు కొందరు అడగగానే పోస్ట్ ద్వారా తమ అమూల్యాభిప్రాయాల్ని తెలియజేశారు. వాళ్ళందరికీ ధన్యవాదాలు.

కథ-నిత్య చైతన్య స్రోతస్విని కనుక, సదస్సు నిర్వహణతో ఒక సుదీర్ఘ యాత్రకి ఆరంభం మాత్రమే జరిగింది. ఈ ప్రస్థానంలో రెండవ మలుపు ఈ పుస్తక ప్రచురణ. ఈ సంకలనం కథా రచన గురించి సమగ్రంగా కాకపోయినా, సమ వీక్షణంగా-సాహితీపరుల

దర్శనానికి నిదర్శనంగా నిలుస్తుంది. ఏప్రిల్ 9న తెలుగు పత్రికలు రచనా ధోరణులు అన్న అంశంమీద, ప్రముఖంగా కథాపరంగా చర్చతో సదస్సు జరుగుతోంది. అందులో ఈ పుస్తకంతో పాటు రెండు కథా సంపుటాలు ఆవిష్కరింప బడుతున్నాయి.

మూడవ ప్రయత్నంగా-తెలుగుకథ తేజోరేఖలు విహారిగారి విశ్లేషణాత్మక గ్రంథాన్ని ప్రచురించాలనుకుంటున్నాము. అలాగే రాష్ట్రంలోని కొన్ని ప్రముఖ పట్టణాలలోను కథా సదస్సులు జరపాలనుకుంటున్నాము. లబ్ధ ప్రతిష్టులైన కథకుల కథా సంపుటాల ప్రచురణకి పథకం సిద్ధమౌతోంది ప్రముఖ, వర్ధమాన కథకులకు కథలతో సంపుటాల్ని ప్రచురింపబోతున్నాము ఇలా తెలుగు కథాభ్యుదయానికి మా వంతు కర్తవ్యాన్ని నిర్వహించ ప్రయత్నిస్తున్నామని వినయంగా విన్నవిస్తున్నాము.

ఈ కదలికని హర్షించి నాకు వెన్ను తడుతున్న ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు

**-వేదగిరి రాంబాబు.**

# భాషలో నవ్యతను సంతరించుకున్న తెలుగు కథ

వివేక్‌నగర్, ఫిబ్రవరి 13 (న్యూస్‌టుడే) ఈనాడు తెలుగు కథ వస్తువులో, శిల్పంలో, భాషలోనవ్యతను సంతరించుకుందనీ, యువకథా రచయితలు పలువురు ఉత్తమంగా కథా రచన చేస్తున్నారనీ కథారచనా సదస్సులో ప్రసంగించిన ప్రముఖ కథకులలో కొందురు పేర్కొన్నారు. ఇప్పుడు మంచి కథలు కరువయ్యాయనీ, కథారచనా ప్రమాణాలు పడిపోయాయని మరికొందరు వక్తలు అభిప్రాయపడ్డారు. సాధన సాహితీ ప్రవంతి, మాసపత్రిక 'రచన' నిర్వాహకుల ఆధ్వర్యంలో ఈ సదస్సు ఆదివారం మధ్యాహ్నం నగర కేంద్రగ్రంథాలయ భవనంలో జరిగింది. ఉత్సాహభరిత వాతావరణంలో వినూత్న పద్ధతిలో జరిగిన ఈ సదస్సుకు 'విహారి' సమన్వయకర్తగా వ్యవహరించి దానిని జయప్రదంగా నిర్వహించారు. తెలుగు కథా రచనకు, కథకులకు, కథా సాహిత్యం తీరుతెన్నులకు సంబంధించిన వివిధ అంశాలపై ఆయన కొన్ని కీలక ప్రశ్నలను సభలో ఆశీనులైవున్న తెలుగు కథా రచయితలలో కొందరిని పేరు పేరునా పిలిచి అడిగి వారి అభిప్రాయాలను రాబట్టారు. మారిన, మారుతోన్న పరిస్థితులకు అనుగుణంగా మార్పు చెందలేకనే వెనుకటి తరం కథకులు చాలామంది కథలు రాయటం మానారని ఈ కోవకు చెందిన ఓ కథా రచయిత అన్నారు. పత్రికల నిర్వహణలో పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రాబల్యం వహించటం వల్లనే వాటిలో ప్రచురితమవుతోన్న కథలు ప్రమాణాలు దిగజారాయని ఓ ప్రముఖ రచయిత అనగా ఈ అభిప్రాయాన్ని మరో ప్రసిద్ధ రచయిత ఖండించారు. ఈ పతనావస్థకు రచయితలు, పాఠకులే

కారణమవుతున్నారని ఆయన పేర్కొన్నారు. సద్విమర్శలు కవిత్వంపై వెలువడుతున్నట్లుగా కథలపై రావటం లేదనీ, వార్షిక సమీక్షలు చేసే విశిష్ట విమర్శకులు లేరని, ఇలాంటి విమర్శలను వార్షికంగా వెలవరించటానికి వ్యవస్థలను రూపొందించాలనీ ఓ వక్త వివరించారు. ప్రాంతీయ విభజనతో గుర్తింపు కోసం కథా సంపుటాలను వెలువరించే ధోరణిని వక్తలు గర్హించారు. స్త్రీవాద దృక్పథంతో మున్ముందు మంచి కథలు వస్తాయన్న ఆశాభావాన్ని ప్రకటించారు. కథాసంపుటాలను విరివిగా వెలువరించాలన్నారు. తెలుగులో హాస్య రచనలు ఎక్కువగా రావలసిన అవసరం వుందన్నారు. జాతీయస్థాయి ప్రాబల్యం ఎక్కువగా ఉండటం వల్ల అందరికీ తగిన గుర్తింపు రావటం లేదన్నారు. సదస్సులో కాళీపట్నం రామారావు, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, శీలా వీర్రాజు, వాకాటి పాండురంగారావు, అవసరాల రామకృష్ణారావు, మధురాంతకం రాజారాం, డి. వెంకట్రామయ్య, పాపినేని శివశంకర్, శ్రీ సుభా, రావులపాటి సీతారామారావు, వీరాజి, చంద్ర, శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి, శ్రీమతి ఓల్గా, భమిడిపాటి రామగోపాలం, యామినీ సరస్వతి, సదానంద శారద, బి.హెచ్. కృష్ణమూర్తి, తిరుమల రామచంద్ర, కప్పగంతుల మల్లికార్జునరావు, కవన శర్మ, వాసిరెడ్డి నవీన్, జీడిగుంట రామచంద్రమూర్తి, వి.వి.న మూర్తి, పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి, పోతుకూచి సాంబశివరావు, కేతు విశ్వనాథరెడ్డి, వై.వి.ఎస్.ఆర్.ఎస్.శాయి, తదితరులు మాట్లాడారు. తొలుత నరసింహాచార్య స్వాగతం చెప్పారు.

**(ఈనాడు ఫిబ్రవరి 14)**

# కథన కౌశలం ముఖ్యం

## కథా రచన సదస్సులో వక్తల అభిప్రాయం

హైదరాబాద్, ఫిబ్రవరి 13 టెలిన్యూస్ : కథల్ని పోషించి, సాహిత్యాన్ని పరిపుష్టం చేయవలసిన పత్రికల్లో కొన్ని అవాంఛనీయ ధోరణులు పొడచూపుతున్నాయని పలువురు రచయితలు అభిప్రాయపడ్డారు. కథా రచన తీరుతెన్నులు, సమీక్ష తదితర అంశాలపై సాధన సాహితీ ప్రవంతి, రచన మాసపత్రిక సంయుక్తంగా ఆదివారం సాయంత్రం హైదరాబాద్‌లోని నగర కేంద్ర గ్రంథాలయంలో 'కథా రచన సదస్సు' ఏర్పాటు చేశాయి. ఈ సదస్సులో పాల్గొన్న పలువురు రచయితలు తమతమ అభిప్రాయాలు తెలిపారు. సమన్వయకర్తగా వ్యవహరించిన 'విహారి', నేటి కథా విధానంలోని శైలి, శిల్పవస్తు పరిణామాలు, సమీక్షలు, ప్రాంతీయ కథలు, రాబోయే పరిణామాలపై రచయితల అభిప్రాయాలు కోరారు. పత్రికల్లో వ్యాపారపరంగా వచ్చిన మార్పులను శీలా వీర్రాజు ప్రస్తావించారు. రచయిత వాకాటి పాండురంగారావు ప్రసంగిస్తూ కథల ప్రమాణాలను ఎవరూ దిగజార్చలేరని పత్రికలు పతనం కాలేదని అంటూ పతనం రచయిత మనసులోంచే ఆరంభమయి పాఠకుల వరకూ వచ్చిందని అన్నారు. కథలకెన్నడూ అనారోగ్యం లేదని, యువతరం మంచి కథలు చాస్తున్నా కొందరి ప్రాబల్యంవల్ల మంచి కథలకు ప్రాచుర్యం లభించట్లేదని అభిప్రాయ పడ్డారు. కాలానుగుణంగా కథా వస్తువు, శైలి, శిల్పాల మార్పులు అనివార్యమని, నేటి స్పీడు యుగంలో చెప్పదలుచుకున్న విషయం సూక్ష్మంగా పాఠకుడిని హత్తుకునేలా చెప్పే నేర్పు కథకుడికి ముఖ్యమని వక్తలు

అభిప్రాయపడ్డారు. సీమ కథను ప్రస్తావిస్తూ భాష ఏదైనా భావమొక్కటేనని అన్నారు. అయితే రచనల్లో ప్రాంతీయతత్వాన్ని నిరసించారు. సదస్సులో స్త్రీవాద సాహిత్యం, వస్తు, శైలి, శిల్పరీతులలో మార్పులు, పత్రికలలో వచ్చిన కథా సంపుటాలకు ఆదరణ లభించి పాఠకులను చేరుతున్నాయి. జాతీయ స్థాయిలో తెలుగు కథకు తగిన గుర్తింపు లభిస్తున్నదా, తెలుగు కథకు విస్కృతమైన ప్రాచుర్యం, గుర్తింపు లభించాలంటే ఏం చెయ్యాలి మొదలైన విషయాలను సదస్సులో రచయితలు చర్చించారు. ఈ సదస్సులో కాళీపట్నం రామారావు, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, శీల వీర్రాజు, వాకాటి పాండురంగారావు, అవసరాల రామకృష్ణారావు, మధురాంతకం రాజారాం, డి. వెంకట్రామయ్య, పాసినేని శివశంకర్, శ్రీసుభ, రావులపాటి సీతారామారావు, వీరాజీ, చంద్ర, అబ్బూరి చాయాదేవి, ఓల్గా, భమిడిపాటి రామగోపాలం, యామినీ సరస్వతి, సదానంద శారద, భమిడిపాటి కృష్ణమూర్తి, తిరుమల రామచంద్ర, కవన శర్మ, ఎస్. పురుషోత్తమాచార్య, జగన్ రెడ్డి జ్వాలాముఖి, వాసిరెడ్డి నవీన్, జీడిగుంట రామచంద్రమూర్తి, వి.వి.న. మూర్తి, పతంజలి, పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి, పోతుకూచి సాంబశివరావు, కేతు విశ్వనాథరెడ్డిలు పాల్గొన్నారు. సభకు 'విహారి' సమన్వయ కర్తగా 'రచన' సాయి, 'సాధన' నరసింహాచార్యులు నిర్వాహకులుగా వ్యవహరించారు.

(ఉదయం ఫిబ్రవరి 14)

# సాధన, రచనల ఆధ్వర్యంలో కథల సంపుటాల ఆవిష్కరణ

హైదరాబాద్, ఫిబ్రవరి 13: సాధన సాహితీ స్రవంతి (హైదరాబాద్) రచనల ఆధ్వర్యంలో శ్రీ వేదగిరి రాంబాబు రచించిన, ఇతర రచయితల సహకారంతో రూపొందించిన నాలుగు కథా సంకలనాలు నగర కేంద్ర గ్రంథాలయంలో ఆదివారం సాయంత్రం ఆవిష్కరించబడ్డాయి. ఈ సందర్భంగా ఏర్పాటైన సభకు ప్రముఖ రచయిత కాళీపట్నం రామారావు అధ్యక్షత వహించగా, ముఖ్య అతిధిగా ప్రముఖ సాహితీ వేత్త కడప జిల్లా కలెక్టర్ శ్రీ కె.వి. రమణ హాజరయ్యారు. ఈ సభలో ఇటీవలే కేంద్ర సాహిత్య అకాడమి పురస్కారం పొందిన ప్రముఖ కథా రచయిత డాక్టర్ మధురాంతకం రాజారాం గారికి, శ్రీ కె.వి. రమణచే సత్కారం, అభినందన జరిగింది. తొలుత సాధన సాహితీ స్రవంతి అధ్యక్షులు శ్రీ నరసింహాచార్య స్వాగత వచనాలు పలకగా, కస్తూరి పుస్తకాన్ని శ్రీ వాకాటి పాండు రంగారావు, వయసు కథలు పుస్తకాన్ని శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు, విముక్తి పుస్తకం శ్రీ కె.వి. రమణ, ఈ కాలం కథలు శ్రీ భమిడిపాటి రామగోపాలం ఆవిష్కరించగా, శ్రీ విహారి, శ్రీ ఆదివిష్ణు, శ్రీ వీరాజీ, శ్రీ మధురాంతకం రాజారాంలు ఆ పుస్తకాలను వరుసగా అంకితం స్వీకరించారు. రచయిత వీరిని, రచయితను కె.వి. రమణ శాలువాలతో సత్కరించారు.

'రచన' మాస పత్రిక సంపాదకులు శ్రీ వై.వి.ఎస్.ఆర్.సాయి, కన్వీనర్లు శ్రీ కె. మాలతి, శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తి, సాధన సాహితీ స్రవంతి కార్యదర్శి శ్రీ అమరనాథ్ తదితరులు కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రీ వేదగిరి రాంబాబును శ్రీ రమణ ప్రత్యేకంగా సన్మానించారు.

**(కృష్ణాపత్రిక ఫిబ్రవరి 14)**

# ఇప్పటికీ రాయాలనే ఉంది -- కారా

(ఆంధ్రప్రభ విలేఖరి)

వివేక్‌నగర్, ఫిబ్రవరి 13: సాధన సాహితీ ప్రవంతి సంస్థ 'రచన' మాసపత్రికల సంయుక్త నిర్వహణలో ఆదివారం మధ్యాహ్నం అశోక్‌నగర్ నగర కేంద్ర గ్రంథాలయం ఆవరణలో కథా రచన సదస్సు జరిగింది.

ఈ నాటి ఈ కథారచన సదస్సుకు రచయిత శ్రీ విహారి సారథ్యం వహించి సుప్రసిద్ధ, వర్థమాన కథారచయితల సమక్షంలో సదస్సును ప్రారంభించారు.

సదస్సును ఉద్దేశిస్తూ 'ఒకప్పుడు ఎక్కువ సంఖ్యలో కథా రచన చేసిన కథకులు, ఇటీవల అంతగా కథలు రాయకపోవడానికి కారణాలు ఏమిటి? వారిలో మళ్లీ ప్రేరణ కలిగించడానికి ఏ విధమైన కృషి జరగాలి ?, అని ప్రశ్నించారు.

కథకుడు శ్రీ కాళీపట్నం రామారావు మాట్లాడుతూ వ్యక్తిగత కారణాలు, సాహిత్యం పట్ల నాకున్న అభిప్రాయ కారణాలు, సామాజిక కారణాల వల్ల తాను కథలు రాయడం మానేశానని అన్నారు. 92 లో తిరిగి కథలు రాశాను. 93 లో తిరిగి మానేశానని, ఇప్పటికీ రాయాలనే ఉందని ఆయన అన్నారు. శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాధరావు మాట్లాడుతూ కథారచనకు వార్థక్యం వచ్చిందని, వయస్సుకు కాదని అన్నారు. ఒకప్పుడు ఎక్కువగా రాయడం

నిజమే. తెలుగు స్వాతంత్ర్య పత్రికలో నిష్ణాతులైన వారి కథలు ఉండేవని, వాటి మధ్యలో తన కథ చూసుకోవడం కోరిక వల్ల రచన చేయడం ప్రారంభించానని ఆయన అన్నారు.

శ్రీ శీలా వీర్రాజు మాట్లాడుతూ సాధారణంగా మారుతున్న వ్యవస్థకు అనుగుణంగా పూర్వ రచయిత మారకపోవడం, ఇప్పటి కొత్తతరం అభిరుచులతో వేగాన్ని తట్టుకోలేకపోవడం, పత్రికల్లో వచ్చిన మార్పు, సిద్ధాంతపరంగా, వ్యాపారపరంగా మార్పు, ఇలా కథ స్వరూపం మారిపోయిందని అన్నారు. రాయాలని ఉన్నా, కథ ప్రచురితం కాకపోవడం వల్ల వ్యక్తిగతంగా రాయడం మానేశానని ఆయన అన్నారు.

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి మాట్లాడుతూ కథకు అనారోగ్యం లేదని, కథనిడివి కథ ప్రచురణకు అంతరాయం కాదని, కథ మంచిది అయితే సమాజంలో ఇమడలేను అనే మానసిక క్షోభ మూలంగా రచయిత రచన చెయ్యలేకపోవచ్చు అనీ, కాని పత్రికలది తప్పుకాదని ఆయన అన్నారు.

'కథా సాహిత్యం మనుగడకు ముఖ్యంగా ప్రశికలే ఆలంబనం కదా, అయితే పత్రికలు తమ బాధ్యతని సక్రమంగా నెరవేర్చడంలేదని, అనేక అవాంఛనీయ పరిస్థితులు నెలకొని వున్నాయని, అక్కడక్కడా కథల గురించి విమర్శ కనిపించినా మొదటి తరం, రెండో తరం కథకుల పేర్లు చెప్పి వదిలేయడం జరుగుతోంది. వర్తమాన తరంలోని కథకుల్లో చాలామంది గొప్ప కథలు రాస్తున్నారు. వీరిని గుర్తించడం లేదు ఎందువలన' అని ప్రశ్నించారు.

శ్రీ డి. వెంకట్రామయ్య మాట్లాడుతూ సెక్స్‌తో, క్రైమ్‌తో నిండుతున్న పత్రికలు ఈ రోజున చాలా వస్తున్నాయని చాలా

పత్రికలకు మంచి కథలు అవసరం లేదని అన్నారు. శ్రీ పాపినేని శివశంకర్ మాట్లాడుతూ చాలా కాలం క్రితం సాహిత్య విమర్శ అనేది కవిత్వ విమర్శకు పర్యాయపదం అయ్యింది. విమర్శ, సమీక్ష కథపై చాలా తక్కువగా వస్తోందని అన్నారు. దాన్ని ఆదరించడంలో పత్రికలు వెనుకబడ్డాయని, రకరకాల కథలను, కథలపై వచ్చే విమర్శలను పాఠకులు ఆదరించాలని కోరారు.

శ్రీ మధురాంతకం రాజారం మాట్లాడుతూ నేడు విశిష్ట విమర్శకులు లేరని, అందుచేత సిండికేట్‌లా ఏర్పడి మంచి కథలు బేరీజు వేస్తే బాగుంటుందని అన్నారు. శ్రీ శుభ మాట్లాడుతూ కవిత్వం మీద వస్తున్న విమర్శ కథలలో రావడం లేదని, మంచి కథలు వస్తూనే విమర్శ వస్తుందని అన్నారు.

'కళింగ కథలు, సీమ కథలు, తెలంగాణా కథలు అంటూ పత్రికల్లో విభజన జరుగుతోంది. ఈ పరిణామం వాంఛనీయమైనదేనా? అలాగే కథల్లో దళిత స్త్రీవాదం గురించి మీ అభిప్రాయం ప్రశ్నించారు.

శ్రీ రావులపాటి సీతారామారావు మాట్లాడుతూ తనకు ప్రాంతీయ భేదాలు కథలలో గోచరించవని, ప్రతి కథను చదువుతానని అన్నారు. రచయిత మంచి రచనలు చేయడానికి కృషి చేస్తాడనీ మంచి రచన, చెడ్డ రచన చెప్పవలసింది పాఠకులేనని ఆయన అన్నారు.

శ్రీ వీరాజీ మాట్లాడుతూ మంచి కథలు రాసేవారు ఉన్నారు. కథకు ప్రాంతీయ భేదం లేదని, మంచి కథ అన్నది ప్రతి తెలుగు పాఠకుడికి సంబంధించినదని ఆయన అన్నారు.

అబ్బూరి ఛాయాదేవి మాట్లాడుతూ ఓల్గా కథలలో స్త్రీ హృదయం ప్రతిబింబిస్తుందని అన్నారు. శ్రీమతి బీనాదేవి మాట్లాడుతూ కొడవటిగంటి, చలం స్త్రీల మీద కథలు రాశారని అన్నారు. అదే విధంగా రంగనాయకమ్మ కూడా స్త్రీవాదం రచనలు చేశారని అన్నారు. భవిష్యత్‌లో స్త్రీ వాదం కథలు ఎక్కువగా వస్తాయని ఆశ తనకు ఉందని ఆమె అన్నారు.

'కొందరు వ్యక్తులూ, కొన్ని సాహిత్య సంస్థలూ కొంతమంది ప్రచురణకర్తలూ కథా సంపుటాలు ప్రచురించడంతో కథకి మళ్లీ మంచి రోజులు వచ్చాయనే భావన వినవస్తోంది. ఈ పుస్తకాన్ని నిజంగా పాఠకులు కొని చదువుతున్నారా? ఈ ప్రయత్నాల్లోని సాధక బాధకాలు ఎలా వున్నాయి' అని ప్రశ్నించారు.

శ్రీ భమిడిపాటి రామగోపాలం మాట్లాడుతూ ఎవరి కథలు వారే పుస్తకాలుగా ప్రచురించుకుంటున్నారని అన్నారు. యామినీ సరస్వతి, శ్రీ సదానంద శారద, శ్రీ వాకాటి, శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తి తదితరులు కథా సంపుటాల మీద ప్రసంగించారు.

'ఇప్పుడు వస్తున్న కథల్లో వస్తువు, శైలీ, శిల్పాల్లో ప్రత్యేకమైన మార్పులు ఏమైనా గోచరిస్తున్నాయా' అని శ్రీ విహారి ప్రశ్నించారు. శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు, శ్రీ కవనశర్మ తదితరులు మాట్లాడుతూ నాటి కథల కంటే నేడు వస్తున్న కథలలో శైలీ, శిల్పం, వస్తువు బాగుంటున్నాయని అన్నారు. ఇదే విషయం గురించి శ్రీ నవీన్, శ్రీ జీడిగుంట రామచంద్రమూర్తి, వి.వి.న.మూర్తి. శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి ప్రసంగాలు చేశారు.

తెలుగు కథకి జాతీయ స్థాయిలో రావలసినంత గుర్తింపు రావడం లేదనే ఆవేదన మనకుంది. ఈ ఆవేదనలో నుంచే, ఆచరణీయమైన ప్రణాళికని ఏమైనా ఆలోచించగలమా అని శ్రీ విహారి ప్రశ్నించారు.

శివరాజు సుబ్బులక్ష్మి, పోతుకూచి సాంబశివరావు, శ్రీ వాకాటి పాండురంగారావు, శ్రీ కేతు విశ్వనాథరెడ్డి తదితర రచయితలు వారి వారి కోణాల నుంచి జాతీయ స్థాయిలో కథ ఎదగడానికి రచయితలు చేయవలసిన కృషి గురించి ప్రసంగాలు చేశారు.

ఈ కథా సదస్సులో దాదాపు అరవై మంది దాకా రచయితలు పాల్గొన్నారు. అభిరుచి ఉన్న పాఠకులు కూడా అధిక సంఖ్యలో పాల్గొన్నారు. చర్చ కూడా జరిగింది.

**(ఆంధ్రప్రభ దినపత్రిక ఫిబ్రవరి 14)**

# విమర్శకులు లేరు.... పత్రికల ఆదరణలేదు....

అయినా 'తెలుగు కథ' వన్నె తగ్గలేదు..

హైదరాబాద్, ఫిబ్రవరి 13: జీవితం ఉన్నచోట 'కథ' ఉంటుంది. ఆ కథను దర్శించ గలిగిన కథకుడు ఉన్న చోట 'కథ' ఉంటుంది. ఆ జీవితంలోని మలుపుల్ని మహాద్భుతాల్ని అగాధాల్ని అక్షరాలలో ఆవిష్కరించ గలిగిన మహా మాంత్రికుడు, మహోన్నత కథకుడు ఉన్నచోట 'మంచి కథ' కూడా ఉంటుంది.

తెలుగు వాడికి జీవితం ఉంది. ఆ జీవితం నిండా కథలు ఉన్నాయి. ఎన్నో మలుపులతో, ముగింపులతో సాగిపోయే వస్తు వైవిధ్య విలసితాలైన ఎన్నో కథలు కూడా.. చూడగలిగిన వారికి అందులో కనిపిస్తాయి. అలాగే ఆధునిక తెలుగు కథకు వందేళ్ల చరిత్ర కూడా ఉంది.

కానీ ఇప్పుడు ఏమై పోయింది. ఆ తెలుగు కథ ఆ వెలుగు కథ ఆసలు తెలుగు కథ నేడు ఎలా ఉంది? ఇవీ ఇప్పుడు సాహిత్య జగతిని, ముఖ్యంగా కథక లోకాన్ని కలవరపరుస్తున్న ప్రశ్నలు.

కొంత కాలంగా తెలుగు నాట 'కథా' చైతన్యం కనిపిస్తున్నది. మంచి కథ వెలుగులోకి రావాలనీ, 'కథ' గురించి కూడా మళ్లీ పది మందీ మాట్లాడుకోవాలనీ చర్చించుకోవాలనీ స్పృహ పెరుగుతున్నది. ఆ స్పృహకు ఉద్యమరూపం ఇవ్వాలన్న ఉత్సాహం కూడా కథా ప్రియులలో కనిపిస్తున్నది.

ఆదివారం నాడు హైదరాబాద్‌లో నగర కేంద్ర గ్రంథాలయంలో జరిగిన కథా 'రచన' సదస్సులో పాల్గొన్న దాదాపు యాభై మంది కథకులు కథా వర్తమానం, భవిష్యత్తు గురించి ఆవేదనను, ఆనందాన్ని కలబోసుకున్నారు. తెలుగు కథను మళ్లీ ఉజ్వలంగా నిలబెట్టడానికి చేయవలసింది ఏమిటో సమగ్రంగా కాకపోయినా, కొంత వరకు చర్చించుకున్నారు.

హైదరాబాద్‌లోని, సాధన సాహితీ స్రవంతి, రచన మాస పత్రిక సంయుక్తంగా నిర్వహించిన సదస్సు ఇది.

తెలుగు కథ నేడు ఎందుకు ఇలా వెల వెల బోతున్నది? నిన్నటి ప్రముఖ కథకులు నేడు రాయడం ఎందుకు మానుకున్నారు? పత్రికలు కథను ప్రోత్సహించడం లేదా? లేక విమర్శకులు పట్టించుకుని లోతైన విమర్శను ఆవిష్కరించడం లేదా? జాతీయ స్థాయిలో తెలుగు కథకు రావలసినంత గుర్తింపు ఎందుకు రావడం లేదు? కథా సంపుటాల్ని పాఠకులు కొని ఆదరిస్తున్నారా?

ఇవీ, అలాగే వస్తువు, శైలి, శిల్పానికి సంబంధించిన మరికొన్ని ప్రశ్నలూ సదస్సులో పాల్గొన్న ప్రముఖ కథా రచయితల ముందుకు వచ్చాయి.

"1972 వరకు కథలు రాశాను. 92 వరకు మళ్లీ రాయలేదు. అందుకు కొన్ని వ్యక్తిగత కారణాలూ ఉన్నాయి. సామాజిక కారణాలూ ఉన్నాయి. సాహిత్యం పట్ల నాకున్న అభిప్రాయాలకు తగిన సామాజిక వాతావరణం లేదు. ఇంతకు మించి వివరించలేను. రాయాలని మాత్రం ఉంది." అన్నారు శ్రీ కాళీపట్నం రామారావు.

'ఎందుకు రాయడం లేదు?' అన్న ప్రశ్నకు మరో సీనియర్ కథకుడు శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు ఇచ్చిన సమాధానం ఇలా

సాగిపోయింది. " రాయడానికి ప్రేరణ కలిగించిన సాంస్కృతిక వాతావరణం అప్పుడు ఉంది. 'తెలుగు స్వతంత్ర'లో నిష్ణాతులు రాసేవారు. వారిలో ఒకణ్ణి కావాలన్న తపనతో రాశాను. ఇప్పటి పరిస్థితి అలా లేదు. ప్రేరణ లేదు. "

"రాయలేక కాదు, మారిన పరిస్థితులతో పాటు మారలేక, వేగాన్ని అందుకోలేక రాయడం మానుకున్నాను. అప్పుడు ఇప్పుడు రాస్తున్న మధురాంతకం వంటి వారూ ఉన్నారు. పత్రికల ధోరణిలో కూడా మార్పు వచ్చింది. సంపాదకులపై పెట్టుబడిదారు ప్రభావం ఉంటున్నది. అందుకే చాలా మంది వేసే వారు లేక కథలు రాయడం మానుకుని ఉంటారు" అన్నారు శ్రీ శీలావీర్రాజు.

అక్కడి నుంచి చర్చ కథలు - పత్రికల వైపు మళ్లింది. "ఏ పెట్టుబడిదారుడు ఈ కథలే వేయాలని సంపాదకులకు చెప్పడు.. మంచి కథల్ని పత్రికలు ఆదరిస్తాయి. పతనం రచయితల మనసుల్లో వస్తోంది. పాఠకులలో వస్తోంది. ఇతరులు వాడుకుంటారు. కథ అసలు బాగులేదని ఎలా అంటారు? యువతరరచయితలు మంచి కథలు రాస్తున్నారు. కొందరు, అన్ని మూస కథలు తప్ప మంచి కథలు కావని ముద్రవేస్తున్నారు కనుక మంచి కథకు ప్రచారం రావడం లేదు." అన్నారు శ్రీ వాకాటి పాండురంగారావ్. "లేదు. పతనానికి రచయిత ఎంత బాధ్యుడో పబ్లిషర్ కూడా అంతే బాధ్యుడు. గతంలో ఉన్నన్ని గొప్ప పత్రికలు ఇప్పుడు లేవు. ఇప్పుడున్నవి చెత్త పత్రికలు. బూతు పత్రికలు" అనే అభిప్రాయం వ్యక్తం చేశారు శ్రీ అవసరాల రామకృష్ణారావు.

ఇక కథా సాహిత్యంపై రావలసినంత విమర్శ, సద్విమర్శ రావడం లేదని, పూర్వం'భారతి'లో యండమూరి సత్యనారాయణ రావు గారు (శ్రీ వాత్సవ) చేసినట్లు ఆ ఏడాది వచ్చిన కథలు

చదివి స్థాయిని నిర్ణయించే విశిష్ట విమర్శకుడు ఎవరూ లేరని, కనీసం కొందరు కలిసైనా ఆ పని చేయాలని శ్రీ మధురాంతకం రాజారాం అభిప్రాయం. "నిజమే. తెలుగు పత్రికలకు కథలే అవసరం లేనప్పుడు విమర్శకు స్థానం ఎక్కడ? అంటూ ఆయనతో ఏకీభవించారు శ్రీ డి. వెంకట్రామయ్య. కథపై విమర్శను ప్రోత్సహించక పోవడం పత్రికల నేరమే అన్నారు శ్రీ పాపినేని శివశంకర్. "తెలుగులో ప్రత్యేకంగా కథా విమర్శకులు లేరు. విమర్శా విస్తరించవలసిందే" నని డాక్టర్ కేతు విశ్వనాథ రెడ్డి అంగీకరించారు. "మంచి కథలు లేవు కనుక విమర్శ లేదేమో" అన్న అనుమానం వ్యక్తం చేశారు శ్రీసుభ.

కవిత్వంలో స్త్రీ వాదులు అంటూ ఒక శాఖ ఉన్నట్లుగా కథా సాహిత్యంలో ఉన్నదా ? అన్న ప్రశ్నను "ఆ ధోరణిలో వస్తున్న కథలు బాగుంటున్నాయి. ముఖ్యంగా ఓల్గా కథలు.. ఇంకా అటువంటివి రావాలి. అయితే వల్గారిటి ఉండకూడదు" అన్నారు శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి.

"గురజాడ. కొడవటిగంటి, చలం, రంగనాయకమ్మ, ఆచంట శారదాదేవి, ఛాయాదేవి కూడా స్త్రీవాద రచనలు చేశారు. అయితే స్త్రీవాదం నేడు ఒక ప్రాపంచిక దృక్పథంగా, తాత్విక బలంతో ఉద్యమంగా ఎదిగింది' అన్నారు ఓల్గా. ఎందుకోగాని, కథలో స్త్రీవాదం గురించి జరగవలసినంత చర్చ జరుగ లేదు.

ఇక నేటి కథలో వస్తువు, శైలి, శిల్పం ఎలా ఉన్నాయి? పాత కథకి, కొత్త కథకి మధ్య ఈ విషయంలో మార్పు కనిపిస్తున్నదా అని అడిగితే, పూర్వం కంటే ఇప్పుడు మంచి వైవిధ్యం ఉంది. పాత కథల కంటె నేటి కథలే నాకు నచ్చుతున్నాయి" అన్నారు శ్రీ తిరుమల రామచంద్ర "ఇప్పటి వారు క్లుప్తంగా, స్పష్టంగా

సూటిగా రాస్తున్నారు. నేటి కథలు నేటి కాలానికి తగినట్లు ఉంటున్నాయి. ఇది శుభ సూచన" అన్నారు శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు.జీవితంలో సంక్లిష్టత పెరిగింది కనుక శైలిలో శిల్పంలో, వస్తువులో మార్పు వచ్చింది" అన్నారు శ్రీ కవన శర్మ "సామాజిక నేపథ్యం మారి వెన్ను తడుతున్నప్పుడు కథకుడి వస్తువు కూడా మారుతుంది. అలాగే మారింది. నిన్నటి కథకు వలే నేటి కథకు సంఘటన ప్రాణం కాదు. ఇది శిల్పంలో వచ్చిన మార్పు" అని విశ్లేషించారు శ్రీ వాసిరెడ్డి నవీన్. "ఇప్పుడు కథా పరిమాణం తగ్గిపోయింది. ఇది కంప్యూటర్ యుగం కనుక అటువంటి కథలనే పాఠకుడు కోరుతున్నాడు అన్నారు శ్రీ జీడిగుంట రామచంద్రమూర్తి. శైలి శిల్పం కలిసిపోయి ఇప్పుడు అద్భుతమైన కథలు వస్తున్నాయి అన్నారు శ్రీ విహారి "ఫాంటసీని, వాస్తవికతను మిళితం చేయడం ఒక కొత్త శిల్ప విశేషం" అన్నారు శ్రీ వి.వి.న. మూర్తి. శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి నేటి కథ పట్ల సంతోషాన్నే వ్యక్తం చేశారు. రెండు పేరాలలో చెప్పవలసిన విషయాన్ని రెండు వాక్యాలలో చెప్పగలుగుతున్నారు" అన్నారు.

జాతీయ స్థాయిలో, అంతర్జాతీయ స్థాయిలో తెలుగు కథకు గుర్తింపు వచ్చిందా? రాకపోతే ఎందుకు రావడం లేదు? కథక హృదయాలను వేధించిన మరో ప్రశ్న ఇది. రష్యన్‌లోకి మరికొన్ని విదేశీ భాషల్లోకి తెలుగు కథలు తర్జుమా అయ్యాయి. కానీ, రావలసినంత గుర్తింపు రాలేదు. " అన్నారు శ్రీ పోతుకూచి. "అకాడమీలలో కవులు, కథకుల ప్రాతినిథ్యం పెరిగితే తప్ప తెలుగు కథ తెలుగు సీమ దాటదు.. ఇంగ్లీషులోకి విరివిగా అను వాదాలు జరిగాలి అని సూచించారు శ్రీ వాకాటి.

కథా సంపుటాల వ్యాపారం గురించి కూడా మంచి చర్చ జరిగింది. ఇది కూడా ఒక ఉద్యమం కావాలన్నారు శ్రీ భమిడిపాటి

రామగోపాలం. శ్రీ యామినీ సరస్వతి, శ్రీ సదానంద శారద, శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తి తమ వ్యాపారానుభవాన్ని వివరించారు.

'కళింగ కథలనీ సీమ కథలనీ, తెలంగాణా కథలనీ - ఇలా ప్రాంతాల పేరిట కథా సంపుటాలు వెలువరించడం మంచిదేనా? ఈ 'విభజన' పరిణామాలు ముందు ముందు ఎలా వుంటాయి అన్న ప్రశ్న సదస్సులో కొంత వివాదాన్ని రేపింది. శ్రీ జి.ఆర్. రెడ్డి అనే శ్రోత ఈ సదస్సులో అందరూ కోస్తా రాయలసీమ, తప్ప తెలంగాణా కథా ప్రాతినిధ్యం లేదేమిటి?'' అని ప్రశ్నించారు.

ఆ ప్రశ్న సమంజసంగానే అందరికి తోచింది. కథకుల ఎంపికలో నిర్వాహకులు కొంత జాగ్రత్త పాటించి ఉంటే బాగుండేది శ్రీ వీరాజీ శ్రీ రావులపాటి సీతారామారావు, శ్రీ శేషం పురుషోత్తమాచార్యులు శ్రీ చంద్ర.. కథలో ప్రాంతీయ విభజన తగదని అంటే ఒక ప్రాంతంలో జరిగే జీవన సంఘర్షణకు అద్దం పట్టిన 'సీమ కథల్ని', అలాగే ఈ దశాబ్దపు జీవన సంక్షోభాన్ని సామాజిక పరిష్కారాన్ని ఎంతో గొప్పగా చిత్రించిన అల్లం రాజయ్య కథలని ప్రాంతీయ కథలని ఎలా అంటారు? అల్లం రాజయ్య కథలు తెలంగాణాకే పరిమితమైనవి కావు, విశ్వవిఖ్యాతికి సంబంధించినవి అంటూ శ్రీ జ్వాలాముఖి ఆ ప్రశ్నలోని అసమగ్రతను ఎత్తి చూపించారు.

నిర్వాహకులు యాభై మందికి పైగా కథకులను ఆహ్వానించారు. వీరిలో కొందరు రాలేదు. వచ్చిన వారిలో కూడా అందరూ చర్చలో పాల్గొన లేదు. కేవలం రెండున్నర గంటల వ్యవధిలో అన్ని విషయాల గురించి సమగ్రంగా చర్చ జరగాలని ఎవరూ ఆశించలేరు. ఇది ఒక ప్రయత్నం. తెలుగు కథకు ఏ కొంచెం దోహదం చేసినా ఈ ప్రయత్నం సార్థకం.

**(ఆంధ్రప్రభ దినపత్రిక ఫిబ్రవరి 14)**

# కథా జగతిలో ఆరోగ్యకర పరిణామాలు

(న్యూస్‌ఫ్లాష్! విద్యానగర్)

కథాసాహిత్యంలో వస్తువు, శిల్పం, శైలి, మాండలికం, ఆధునికత తదితరాలలో వస్తున్న మార్పులు ఆరోగ్యకరంగానూ, హర్షించదగ్గవిగాను వున్నాయని ప్రముఖ రచయితలందరూ అభిప్రాయపడ్డారు. ఆదివారం మధ్యాహ్నం అశోక్‌నగర్‌లోని నగర కేంద్ర గ్రంథాలయంలో సాధనా సాహితీ సంస్థ, 'రచన' మాస పత్రికల సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన "కథా రచన సదస్సులో" ప్రముఖ రచయిత, రచయిత్రులందరూ పాల్గొన్నారు.

సాహితీ పరిమళం గుబాళింపజేసి కథా రచన సదస్సు సాయిప్రసాద్ గణేశ్ స్తుతితో ప్రారంభమైంది. ప్రముఖ రచయిత విహారి రచయితలందరికీ స్వాగతం పలికారు.

రచయితలందరినీ ఒకే వేదికకు చేర్చి ఏర్పాటు చేసిన సదస్సు సాహితీ ప్రియులందరినీ అలరించింది. ఒకప్పుడు తెలుగులో ఉధృతంగా కథలు రాసి శైలి, శిల్పం, కథనంతో పాఠకులను ఓలలాడించిన ప్రముఖులు ఇప్పుడు కథలు రాయకపోవడానికి కారణం గురించి కొంతమంది రచయితల్ని విహారి ప్రశ్నించారు.

మారుతున్న కాలానికి అనుగుణంగా, అభిప్రాయాలకు, అవగాహనలకూ లొంగకపోవడం, ఇప్పుడున్న పరిస్థితులకు ఇమడకపోవడం ఒక కారణమని శీలా వీర్రాజు అన్నారు. ముందు కాలంలో సాహిత్యవేత్తలే పత్రికాధిపతులుగా వుండేవారని, నేడు పెట్టుబడిదారులు ప్రవేశించి వ్యాపారాత్మకంగా మారడం కూడా మరో కారణమని వీర్రాజు అన్నారు.

రచన వెలుగు చూడాలంటే రచయిత ఎంత బాధ్యుడో ప్రచురణ కర్త కూడా అంతే బాధ్యుడని అవసరాల రామకృష్ణారావు అన్నారు.

పత్రికలలో కొన్ని శీర్షికల్లోనూ, ఆదివారం అనుబంధాలలోనూ కేవలం కవితలపైనే విమర్శలు, సమీక్షలు వస్తున్నాయి. కానీ కథా రచనపై సమీక్షలు, విమర్శలు రావడం లేదు కారణాలేమిటని విహారి ప్రశ్నించగా, రాజారాం మాట్లాడుతూ పై ప్రశ్నతో ఏకీభవిస్తూ పత్రికలలో ఏడాది పొడువునా ప్రచురితమైన కథలపై విమర్శలు చెయ్యటానికి ఎవరూ లేనందున విమర్శలు రావడం లేదని, కథా సమీక్షలపై ఒక సంఘం ఏర్పడి విమర్శను ప్రధానంగా తీసుకోవాలన్నారు.

డి. వెంకటరామయ్య మాట్లాడుతూ నేటి పత్రికలకు కథలు అక్కర్లేదని, అలాంటప్పుడు విమర్శ లెక్కడుంటాయని, పత్రికలు కేవలం క్రైం, సెక్సునే పేజీలనిండా నింపుతున్నాయన్నారు. ఇదే అభిప్రాయంతో పాపినేని శివశంకర్, శ్రీసుభ ఏకీభవించారు.

కథా రచనల్లో కళింగ కథలని, రాయలసీమ కథలని రచనల్లో ప్రాంతీయ ముద్ర ప్రవేశించింది. ఈ మార్పు వాంఛనీయమైనదా అన్న ప్రశ్నకు రావులపాటి సీతరాంరావు మాట్లాడుతూ రచనల్లో ప్రాంతీయత అన్నది హర్షనీయం. కానీ మంచి రచనకు ఈ పరిధులేమి వుండవన్నారు.

వీరాజీ మాట్లాడుతూ ఇప్పుడు కులాలతో చస్తుంటే రచయితల్లో మళ్లీ ప్రాంతీయత, దేశీయత, విదేశీయత అని మన మధ్య తగవులెందుకన్నారు. చంద్ర మాట్లాడుతూ వీరాజీ చెప్పిన అభిప్రాయంతో ఏకీభవిస్తూ కథా విమర్శలపై కూడా ఒక సంపుటి

లాంటిది ప్రచురిస్తే మంచిదన్నారు.

కవిత్వంలోనూ, కథా రచనల్లోనూ స్త్రీవాదం అన్న పరిణామం ఎంతవరకు హర్షణీయ మన్న ప్రశ్నకు అబ్బూరి ఛాయాదేవి మాట్లాడుతూ ఇప్పటికి చాలామంది స్త్రీవాదంపై రాస్తున్నారు. ఇంకా స్త్రీవాదంపై మంచి కథలు రావాలన్నారు. ఓల్గా మాట్లాడతూ ప్రాపంచ దృక్పథంగా గురజాడ, చలం స్త్రీవాద భావంతో రచనలు చేసారు. రచయిత్రులు కూడా చేశారన్నారు. నేటి రచయితలు ప్రపంచాన్ని కొత్త కోణంలో అన్ని సమస్యలను ఒక ప్రత్యేక దృక్పధంతో చూస్తున్నారన్నారు. అచ్చయిన కథల్ని సంపుటాలుగా వెలువరించడం ఉపయుక్తమా కాదా అన్న ప్రశ్నకు భమిడిపాటి రామగోపాలం మాట్లాడుతూ ఉపయుక్తమే లేకపోతే గుర్తింపు వుండదు, అదికూడా కథారచనా ఉద్యమంలా వుండాలన్నారు.

యామినీ సరస్వతి మాట్లాడుతూ సంపుటి సంకలనాలను లైబ్రరీ వాళ్లు కొనడం లేదని, అభిమానంగా కొనే పాఠకులు కూడా లేరని అన్నారు.

ప్రతికల్లో కథల సంఖ్య తగ్గిందని, చాలా పత్రికలు మూతపడ్డాయని, ఉన్న పత్రికలు కూడా మంచి కథలకు ద్వారం మూస్తున్నాయన్నారు. ఇలాంటి తరుణంలో స్వయంగా అచ్చేసుకుని సంపుటిగా తీసుకురావల్సిన ఆవశ్యకత ఏర్పడిందన్నారు.

వస్తువు, శైలి, శిల్పాలలో ఇటీవల కొట్టొచ్చినట్లు మార్పులు కనిపిస్తున్నాయా అన్న ప్రశ్నకు కప్పగంతుల మల్లికార్జునరావు మాట్లాడుతూ శైలి, శిల్పం, ప్రారంభం, ముగింపు స్పష్టంగా, సూటిగా చెప్పేలా వున్నాయన్నారు. ఇవాల్టి పరిస్థితుల కనుగుణంగా ఉన్నాయన్నారు. తిరుమల రామచంద్రరావు కవన శర్మ, నవీన్,

జీడిగుంట రామచంద్రమూర్తి మొదలైనవారు ఏకీభవించారు.

జీడిగుంట రామచంద్రమూర్తి మాట్లాడుతూ నేడు కథల్లో కార్డు కథ, పేజీ కథ అని రచనల నిడివి తగ్గిందన్నారు. పోలాప్రగడ సత్యనారాయణమూర్తి మాట్లాడుతూ పూర్వం మూడు పేజీలలో చెప్పే కథను నేడు ఒక వాక్యంలోనే చెప్పేంత స్థాయికి రచయిత లెదిగారన్నారు. మాండలీకత మరీ ఎక్కువగా ప్రవేశిస్తే రచయితల మధ్య ప్రాంతీయతాభావం చోటుచేసుకుంటుందన్నారు. శివరాజు సుబ్బులక్ష్మి, కేతు విశ్వనాథరెడ్డి మున్నగు వారు ఈ సదస్సులో పాల్గొన్నారు.

**(ఆంధ్రభూమి ఫిబ్రవరి 14)**

# నాలుగు కథాసంపుటాల ఆవిష్కరణ

వివేక్‌నగర్, ఫిబ్రవరి 14 (న్యూస్‌టుడే), కథ ఎలా చెప్పటమన్నది ముఖ్యంకాదనీ, ఎట్లాచెప్పినా హత్తుకునేలా చెప్పటం ప్రధానమనీ ప్రముఖ రచయిత 'వీరాజీ' అన్నారు. సాధన సాహితీ స్రవంతి, మాసపత్రిక 'రచన' నిర్వాహకుల సంయుక్తాధ్వర్యంలో నగర కేంద్ర గ్రంథాలయ భవనంలో జరిగిన నాలుగు కథాసంకలనాల ఆవిష్కరణ - అంకితోత్సవంలో ఆయన మాట్లాడారు. కాళీపట్నం రామారావు అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో వేదగిరి రాంబాబు, మైనంపాటి భాస్కర్‌లు రచించిన కథల సంకలనం 'విముక్తి'ని కడప జిల్లా కలెక్టర్ కె.వి.రమణ ఆవిష్కరించారు. వేదగిరి రాంబాబు కథల సంపుటి 'ఈ కాలం కథలు'ని భమిడిపాటి రామగోపాలం ఆవిష్కరించారు. వేదగిరి రాంబాబు మరో కథల సంపుటి 'వయసు కథలు'ని ఇచ్చాపురపు జగన్నాథరావు ఆవిష్కరించారు. వేదగిరి రాంబాబు, పి.ఎస్.నారాయణ. పి.వి.ఆర్.శివకుమార్, ప్రతాప రవిశంకర్, మైనంపాటి భాస్కర్, తులసి బాలకృష్ణల కథల సంకలనం 'కస్తూరి'ని వాకాటి పాండురంగారావు ఆవిష్కరించారు. 'విముక్తి'ని ఆదివిష్ణుకి, 'ఈ కాలం కథలు'ని'వీరాజీ కి, 'వయసు కథలు' విహారికి, 'కస్తూరి'ని డాక్టర్ మధురాంతకం రాజారాంకి అంకితమిచ్చారు. గ్రంథ స్వీకర్తలు ప్రతిస్పందన ప్రసంగాలు చేస్తూ వేదగిరి రాంబాబు సాహిత్య కృషిని కొనియాడారు. కేంద్ర సాహిత్య అకాడమి పురస్కారం పొందిన ప్రముఖ కథా రచయిత డాక్టర్ మధురాంతకం రాజారాంని కె.వి.రమణ నిర్వాహక సంస్థల పక్షాన సన్మానించారు. సాధన నరసింహాచార్య , వి. వెంకటేశ్వర శర్మలు కూడా సభాకార్యక్రమంలో పాల్గొన్నారు.

ఈనాడు ఫిబ్రవరి 15

# కథా రచయితల సదస్సు

కోఠి, ఫిబ్రవరి 13. తెలుగు సాహిత్యంలో ఆరోగ్యకరమైన కథ గురించి, ప్రస్తుతం తెలుగు కథ ఎంత వరకు సరైన మార్గంలో పయనిస్తున్నదనే అంశాలపై లబ్ద ప్రతిష్టులైన దాదాపు అరవై మంది తెలుగు కథా రచయితల విశేష గోష్ఠి కార్యక్రమం నగరంలో జరిగింది.

సాధన సాహితీ సమితి, రచన మాస పత్రికల సంయుక్త ఆధ్వర్యాన నగర కేంద్ర గ్రంధాలయంలో ఆదివారం మధ్యాహ్నం నుంచి సాయంత్రం వరకు కిక్కిరిసిపోయి, చక్కని సాహిత్య వాతావరణంలో ఈ గోష్ఠి జరిగింది.

'కళింగ కథలు, సీమకథలు, తెలంగాణా మాండలికంలో కథలు రాయటం సమంజసమా?' అనే ప్రశ్నకు ప్రముఖ విప్లవకవి శ్రీ జ్వాలాముఖి స్పందిస్తూ వివిధ ప్రాంతాల స్థితిగతులు, నేపథ్యాల ఆధారంగా కథలు వెలువడుతున్నాయని అన్నారు. తెలంగాణా యాసలో వెలువడిన 'శ్వేత రాత్రులు' కథల సంపుటిలో విశ్వజనీనత ఉందని ఆయన పేర్కొన్నారు. 'కథా సాహిత్యంలో తెలుగు సాహిత్యానికి తనదైన గొప్పవారసత్వమున్నా నేడు తెలుగులో మెరుగైన, విలువల ప్రాధాన్యతగల' కథలు వెలువడకపోవటానికి కారణమేమిటి?' అనే ప్రశ్నకు సమాధానం చెబుతూ సుప్రసిద్ద కథా రచయిత శ్రీ కాళీపట్నం రామారావు స్పందిస్తూ వివిధ కథా రచయితల వ్యక్తిగత కారణాల మూలంగా, సాహిత్యం పట్ల వారికి గల అభిప్రాయాల కారణంగా మంచి కథలు రావడం లేదన్నారు.

ఈ యేడాది కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డుపొందిన శ్రీ మధురాంతకం రాజారాం మాట్లాడుతూ నేటి కథా సాహిత్యంలో విమర్శలు అంతగా వెలవడటం లేదని, సద్విమర్శకులు కూడా కరువయ్యారని అన్నారు. ఉత్తమ కథలను కూడా విమర్శించే శక్తి యుక్తులు గల విమర్శకులు నేటి కథా సాహిత్యానికి ఆవశ్యకమని ఆయన సూచించారు. అనంతరం శ్రీ శీలా వీర్రాజు తన కాలానికి, అభిప్రాయాలకు అనుగుణంగా రచయితలు మారకపోవటం, ప్రస్తుత పద్ధతులలో ఇమడక పోవటాలను కారణంగా పేర్కొన్నారు. గతంలో సాహితీవేత్తలు నిర్వాహకులుగా ఉండటం వలన ఉత్తమ కథలు వెలువడేవని ఆయన అన్నారు. నేడు పెట్టుబడి దారులు రంగ ప్రవేశం చేయటం మూలంగా కథాసాహిత్యంలో విలువలు క్షీణిస్తూ ఉత్తమ, మెరుగైన కథలు రావటం లేదని ఆయన పేర్కొన్నారు. ప్రముఖ కథారచయిత శ్రీ అవసరాల రామకృష్ణారావు మాట్లాడుతూ నేటికాలంలో కథా సాహిత్యంలో విమర్శలు తగినంతగా వెలువడక పోవటం కూడా మంచి కథలు రాకపోవటానికి కారణమని పేర్కొన్నారు.

'ప్రస్తుతం వెలువడుతున్న కథలలో శైలి, వస్తువు స్వరూప లక్షణాల' గూర్చి సభలో అడిగిన ప్రశ్నకు శ్రీ నవీన్ స్పందిస్తూ నేటి కథలలోని వస్తువులో సామాజిక పరిణామాలు అధికంగా గోచరిస్తాయని అన్నారు. శైలి గూర్చి మాట్లాడుతూ అలనాటి కథలలో సంఘటనలకు, సన్నివేశాలకు ప్రాధాన్యత ఉండేదని, ప్రస్తుత కథలకు అటువంటి ప్రాధాన్యత లక్షణం కావచ్చుగాని, ప్రాణం మాత్రం కాదని పేర్కొన్నారు. శ్రీ తిరుమల రామచంద్ర మాట్లాడుతూ పాత కథకుల కన్నా నేటి యువతరం శైలిలో వేగం, వైవిధ్యాలు గోచరిస్తున్నాయని అన్నారు.

అనంతరం శ్రీ వేదగిరి రాంబాబు రచించిన, ఇతర రచయితల సహకారంతో రూపొందిం,చిన 'కస్తూరి' 'వయసుకథలు', 'విముక్తి', ఈ కాలం కథలు'ను ప్రముఖ రచయితలు ఆవిష్కరించారు. చిట్టచివరన ఈ యేడాది కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన ప్రముఖ కథారచయిత శ్రీ మధురాంతకం రాజారాంను కడప జిల్లా కలెక్టర్ శ్రీ కె.వి. రమణ దుశ్శాలవ కప్పి, నిర్వాహకుల తరపున ఘనంగా సత్కరించారు.

**(ఆంధ్రజ్యోతి దిన పత్రిక ఫిబ్రవరి 14)**

# వేదగిరి కథాసంపుటాల ఆవిష్కరణ

(కల్చరల్ రిపోర్టర్)

హైదరాబాద్, ఫిబ్రవరి 20 నగర కేంద్ర గ్రంధాలయంలో సాధన సాహితీ ప్రవంతి, రచన మాస పత్రికల సంయుక్త ఆధ్వర్యంలో ప్రముఖ ఫ్రీలాన్స్ జర్నలిస్ట్, రచయిత శ్రీ వేదగిరి రాంబాబు రచించిన నాలుగు కథాసంపుటాల ఆవిష్కరణ, అంకితోత్సవం, కథా రచన సదస్సు వైభవంగా జరిగాయి. కస్తూరి కథా సంకలనాన్ని డా. మధురాంతకం రాజారాంకు అంకితం ఇవ్వగా, శ్రీ వాకాటి పాండు రంగారావు ఆవిష్కరించారు. 'వయసు కథలు' శ్రీ విహారికి అంకితం ఇవ్వగా, శ్రీ ఇచ్చాపురపు జగన్నాథరావు ఆవిష్కరించారు. 'విముక్తి' ని శ్రీ ఆదివిష్ణుకి అంకితం ఇవ్వగా, కడప కలెక్టర్ ఐ.ఎ.ఎస్. అధికారి కళాపోషకులు శ్రీ కె.వి. రమణ ఆవిష్కరించారు. ఈ కాలమ్ కథలు శ్రీ వీరాజీకి అంకితం ఇవ్వగా, శ్రీ భమిడిపాటి రామగోపాలం ఆవిష్కరించారు.

ఈ సభకు అధ్యక్షత వహించిన సుప్రసిద్ధ కథారచయిత శ్రీ కాళీపట్నం రామారావు ప్రసంగిస్తూ, వివిధ కథా రచయితల వ్యక్తిగత కారణాల మూలంగా సాహిత్యంపట్ల గల అభిప్రాయాల కారణంగా మంచి కథలు రాలేని ఈ రోజుల్లో శ్రీ వేదగిరి తదితర యువ రచయితలు మంచి కథలను రచించడాన్ని అభినందించారు.

ఈ సదస్సులో డా. మధురాంతకం రాజారాం డా. పోతుకూచి సాంబశివరావు, శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు, అవసరాల రామకృష్ణారావు, సి. రామచంద్రరావు,డా. కె.విశ్వనాథరెడ్డి. వీరాజీ,

ఇచ్చాపురపు జగన్నాధరావు, వాకాటి పాండురంగారావు, ఆదివిష్ణు రావులపాటి సీతారామారావు భమిడిపాటి రామగోపాలం, శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి, శీలా వీర్రాజు, శ్రీమతి బీనాదేవి, డి. వెంకటరామయ్య, పోలాప్రగడ సత్య నారాయణమూర్తి శ్రీసుభ, పమ్మి వీరభద్రరావు. జీడిగుంటరామచంద్రమూర్తి,మిమిక్రి మెజీషియన్ శ్రీ చొక్కాపు వెంకటరమణ, తులసి బాలకృష్ణ, తల్లావఝ్ఝుల శివాజి విహారి, రాంబాబు ప్రభృతులు పాల్గొన్నారు.

అనంతరం కేంద్ర సాహిత్య అకాడమి పురస్కారం పొందిన ప్రముఖ కథా రచయిత డా. మధురాంతకం రాజారాంని శ్రీ కె.వి. రమణ సత్కరించారు. సాధన అధ్యక్షులు శ్రీ నరసింహాచార్య ఈ సదస్సును చక్కగా నిర్వహించి ప్రముఖుల ప్రశంసలందుకున్నారు. శ్రీ వేదరిగి రాంబాబు ఇటీవల ఆరోగ్య పుస్తకాలను, ఇంకా ఇతర కథా పుస్తకాలను రచించి విడుదల చేయడం గమనార్హం.

**( విశాలాంధ్ర దినపత్రిక ఫిబ్రవరి 21 )**

# మిత్రవాక్యం

తెలుగు కథకూ జై!

రచన పత్రికకూ జై

సాధన సాహితీ స్రవంతికి జై

అని గాఠిగా జయ జయ నినాదాలు చేయాలి అన్పించింది ఫిబ్రవరి 13 ఆదివారం మధ్యాన్నం

కారణం?

ఆనాడు 67,500 పని నిముషాలు Man hours అంటే పని గంటలు కదా! 250 మంది X 270 నిముషాలు తెలుగు కథ కోసం వెచ్చించారు. అంతమంది కథకుల్ని, కొందరు కవుల్ని, చిత్రకారుల్ని శ్రోతలుగా విచ్చేసిన రెండు వందల మంది పాఠకులను చూస్తుంటే పెళ్లి పందిరిలో కూర్చున్నంత సంబరంగా ఉండింది.

అబ్బే - కథ పసపోయింది, సీరియల్ నవలలే అమ్మేది, ఫలానా బ్రాండు రచయితలే రచయితలు, వారిలో వీరు సూపర్, అదుగో వారు మేజర్, ఇల్లిదిగో వీరు ఫీల్డు మార్షల్ అంటూ ప్రచార భేరి రణని నాదాల మారులు గోలచేసినా, కథలు అమ్ముడుపోవు, డైరెక్టు నవలలు అమ్ముడుపోతవి అని ప్రచురణకర్తలు తలుపులు బిగించే, సినా తెలుగు కథ భయపడలేదు.

గురజాడ చూపిన అడుగుజాడలో ముందుకు నడిచిన తెలుగు కథ మాగోఖలే చింతా, కరుణకుమారి, శ్రీపాద, మల్లాది, చలం, గోపీచంద్, పద్మరాజు, బుచ్చిబాబు, తిలక్, కొడవటిగంటి ఇల్లిందల,

చాయాదేవి జానకిరాణి, వసుంధర, మంజూశ్రీ, శంకరమంచి, పురాణం, ముళ్లపూడి, పెద్దింట్ల రావిశాస్త్రి, చాసో, రారా, శ్రీపతి, మదురాంతకం ప్రభృతులు చేకూర్చిన బలంతో నిండుగా నిలిచింది. తన సమాజాన్ని నిరాడంబరంగా నిజాయితి ప్రదర్శించింది. ప్రతిబింబించింది. సమాజంలోని అన్యాయానికి అద్దం పట్టింది దౌష్ట్యం మీద కొరడాఝుళిపించింది నవల కోడంబాకానికి మకాం మార్చేసినా, నాటకం కొంత తెరమరుగయినా కథ మాత్రం నిశ్చల దీక్షతో ముందడుగు వేస్తూ వచ్చింది.

స్వామి, ఓల్గా, అల్లం, సదానంద, వారాల కృష్ణమూర్తి, ఎం.ఎస్.ఆర్.మూర్తి, నరేంద్ర, రాసాని, హైమా బార్గవ్ 'అనామకుడు' దేవపుత్ర, సింగమనేని వంటి అనేకానేక యువ రచయితల చేతిలో నేటి తెలుగు కథ సవ్యంగానే ఉన్నది.

కానీ కథకు ఎన్నో సమస్యలున్నాయి, కథా రచయితలకు సమస్యలున్నాయి. వాటినెలా ఎదుర్కోవాలి, కథకు అనారోగ్యం చేసిందా అయితే రోగ నివారణ ఏమిటి? చికిత్సా దాని నెవరు చేయాలి. రచయితలా సంపాదకులా, ప్రచురణకర్తలా, పాఠకులా ఎవరు? ఇట్లాంటి ఆత్మపరిశోధనకై వెచ్చించిన ఆ ఆదివారం ఉందే అది తెలుగు కథా చరిత్రలో ఒక గొప్ప దినం.

కథా సంకలనాలు అమ్ముడుపోతున్నాయా? అని అడిగారు సదస్సు నిర్వాకుల తరఫున పౌరోహిత్యం వహించిన కథకుడు విహారి గారు.

నేను నా కథల పుస్తకాలు వేశాను. అమ్ముడుపోయినవి పోయాయి. మిత్రులకు వారి కాపీలు ఇచ్చాను. ఇక్కడ లాభాపేక్ష నా దృష్టి కాదు కదా అన్నారు యామినీ సరస్వతి.

'కొంత మంది రచయితల కథల నొక సంకలనంగా వేయడం అనేది ఎప్పటినుంచో ఉంది. ఒకే రచయిత కథలను సంపుటిగా వెలువర్చే ప్రయత్నాలు ఇటీవల మొదలయ్యాయి. ఏ తెలుగు

విశ్వవిద్యాలయం వారినో అడిగి కొంత డబ్బు తెచ్చుకొని ఎందరో ఈనాడు వేసుకుంటున్నారు. ఇది మెచ్చుకోదగిందే అన్నారు భరాగో,

నవీన్, శివశంకర్‌లు వేస్తున్న కథా సంకలనాలు, విశాలంధ్ర వారు వేస్తున్న ఏక రచయితా సంకలనాలు అమ్ముడుపోతూనే ఉన్నాయి. అని జనాంతికంగా విన్పించింది.

తెలుగు కథ పిలిక పిలికలయి, బూతు బజారులోకి దిగి సుఖ రోగం పాలయి పోతుండడానికి కారణం ఎవరు అన్నది తర్వాతి ప్రశ్న.

'పెట్టుబడిదారి వ్యవస్థ లక్షణం ఇది ' అన్నారు శీలా వీర్రాజు గారు, రచయితలు దిగజారితే వీళ్లని వాళ్లు వాడుకుంటారు. లక్ష రూపాయ లిచ్చినా కారా చేత, మధురాంతకం చేత బూతు కథ రాయించగలమా అని ఇది రాస్తున్న వ్యక్తి అన్నాడు.

"కాదు పతనానికి రచయిత ఎంత బాధ్యుడో పబ్లిషరూ అంతే బాధ్యుడు. ఒకప్పుడు గొప్ప పత్రిక లుండేవి. నేడు చెత్త పత్రికలు బూతు పత్రికలు అని రెండే రకాల పత్రికలుంటున్నాయి, అన్న ఆవేదనని అవసరాల రామకృష్ణారావు వ్యక్తం చేశారు.

కథలపై ఒకప్పుడు 'శ్రీవాత్సవ' చేసిన లాటి విమర్శలు రావటడం లేదేమి. అన్నది తర్వాతి ప్రశ్న.

"ఔను నిజమే! అసలు కథలకే చోటు తగ్గిపోతే విమర్శలు ఎవరు వేస్తున్నారు?

అదేమిటి! రచనలో కోడూరి శ్రీ రామమూర్తి గారు రాస్తున్నారు కదా. అబ్బే అది చాలదు. ఇంకా విస్తృతంగా విమర్శలు రావాలి." అంటూ చర్చించిన వారిలో మధురాంతకం రాజారాం, డి. వెంకట్రామయ్య, పాపినేని శివశంకర్, కేతు విశ్వనాథ రెడ్డి ప్రభృతులు అన్నారు.

'కథా సాహిత్యంలో స్త్రీ వాదం ప్రతిఫలిస్తున్నదా అన్నదానికి ఓల్గా- "ఎస్ ! గురజాడ, కొడవటిగంటి, చలం, రంగనాయకమ్మ, ఆచంట శారదాదేవి, ఛాయాదేవి లాంటి వారు ఆ ప్రయత్నం చేశారు. నేడు ఇది ఒక విశ్వజనీనమైన ఆలోచనా ధోరణిగా, ఒక విస్తృత సామాజిక తాత్విక ప్రాతిపదికగా సాగిపోతున్నది. కథలూ వస్తున్నాయి-' అన్నారు. మాండలికాలు అందమే కాని అవి ఇతర ప్రాంతాల వారు చదివి ఆదరించడానికి, అర్ధం చేసుకుని స్పందించడానికి అవరోధం కారాదని, ఎవరెలా రాసినా వస్తువు అందింది కదా - అని మాట్లాడిన వారిలో జ్వాలాముఖి, పోలాప్రగడ, వీరాజీ, రావులపాటి సీతారామారావు, జి.ఆర్.రెడ్డి, శేషం పురుషోత్తమాచార్య, చంద్రలున్నారు.

"వస్తువు, శైలి శిల్పం విషయంలో నేటి తెలుగు కథ ఎట్లా ఉంది" తిరుమల రామచంద్ర గారు "పూర్వం కంటే వైవిధ్యం గల కథలు ఇప్పుడు వస్తున్నాయి, శైలి కూడా మేలుగా ఉంది" అన్నారు. జీవితంలో వస్తున్న సంక్లిష్టతకు అనుగుణంగా శైలి, శిల్పం, వస్తువులలో మార్పు వచ్చింది అని కవన శర్మ అభిప్రాయం. నవీన్- నిన్నటిలా సంఘటన కాక, పాత్ర వ్యక్తిత్వ చిత్రణ నేటి కథలలో ప్రధానంగా కన్పిస్తోంది' అని చెప్పగా కథా పరిమాణం తగ్గింది అన్న విషయాన్ని ఎత్తిచూపారు జీడిగుంట రామచంద్రమూర్తి.

'ఇవన్నీ సరే గాని అస్సలు జాతీయస్థాయిలో మన వారి కథలకు గుర్తింపు రావడం లేదేమి? అన్న ప్రశ్నకు ఉడుతా భక్తిగా తను చేసిన దానిని ఒక రచయిత ప్రస్తావించాడు. ఆంగ్లంలో అనువాదాలు ఇతోధికంగా రావాలి అని సూచన అందింది. కథల పుస్తకాల అమ్మకాలకు దోహదంచేసే ఇంకొక సలహా వచ్చింది.

ఇప్పుడు కథకులకు, రాష్ట్రం మొత్తం మీద రోజూ ఎక్కడో చోట సన్మానాలు జరుగుతూనే ఉన్నాయి. అటువంటి సన్మానాలలో శాలువాలు కప్పుతారు, జ్ఞాపికలు ఇస్తారు కదా.

విశాలాంధ్ర, నవోదయ లాంటి సుప్రసిద్ధ ప్రచురణ సంస్థలు పుస్తకాలు కొనుగోలు రాయితీ కూపన్ల వంటి వాటిని అందంగా గ్రీటింగ్ కార్డుల వలె ముద్రించి, 58 రూపాయల కూపన్ని 50

రూపాయలకు, 116 రూపాయల కూపన్ను100 రూపాయలకు, 558 రూపాయల కూపన్ను 500 రూపాయలకు ఈ విధంగా అమ్మాలి, దానిని ఈ సాహిత్య సంస్థలు కొని ఒక కవర్‌లో ఉంచి సన్మానితులకు ఇవ్వాలి. ఆ సన్మానితుడు ఇంచక్కా ఆ ప్రచురణకర్తల ఏదో ఒక శాఖలోకి వెళ్లి తనకు కావలసిన పుస్తకాలను కొనుక్కోవచ్చు. దాని వలన శాలువాల అమ్మకం తగ్గి పుస్తకాల అమ్మకం పెరుగుతుంది. రచయితలూ, ప్రచురణకర్తలూ సుఖపడతారు. సాహిత్య సంఘాల పని సులువవుతుంది. పెళ్లిళ్లకు, పుట్టిన రోజులకు కూడా ఇటువంటి పుస్తకాల కొనుగోలు కూపన్లు ఇచ్చే ఆనవాయితీ వస్తే ఎంత బాగుండునో!

"మేము త్వరలోనే తెలుగు రచయితల సహకార సంస్థ పెట్టబోతున్నాము. అది పుస్తకాల పంపిణీని చేబడుతుంది. అని సదానంద శారద అనగానే తన పాత అనుభవాలను పురస్కరించుకుని పోలాప్రగడ, పోతుకూచి బాగుంది కాని ముద్రణ లోనికి దిగకండి! అని హెచ్చరించారు.

ఈలోగా సమయం ముగిసింది, మధురాంతకం రాజారాం గారి సన్మానం వంటి ఇతర కార్యక్రమాల వైపు దృష్టి మళ్లింది.

ఎంత బాగుందో ఇట్లాంటివి కనీసం ఏడాదికి ఒసారో రెండుసార్లో జరిగితే ఎంత బాగుండునో,

ఇంత మంది రచయితలు ఒక చోట కూర్చోవడం ఎంత సంతృప్తికరంగా ఉందో! అన్న ఆనంద ఆశ్చర్య అతిశయాలనే 'ఆ నిర్వాహకులకు జై, అన్న నినాదంగా కుదించుదాము.

**వాకాటి పాండురంగారావు**

**(ఆంధ్రప్రభ వారపత్రిక మార్చ్ 2, 94)**

# కథా ప్రవంతిలో కొత్త కదలిక కథా రచన

ఫిబ్రవరి 13 ఆదివారం సమయం మధ్యాహ్నం రెండు గంటలు. భాగ్యనగరం చిక్కడపల్లి నగర కేంద్ర గ్రంథాలయం

అక్కడంతా పండుగ వాతావరణం. కథా ప్రియుల, సాహితీ రసజ్ఞుల, కథా రచయితల సమ్మేళనం. ఆరు ఋతువుల సమ్మిశ్రమంగా- కొత్త గాలుల ఆహ్లాదం!

సమావేశమైన కథకులు - అందరి కందరూ-అనేక యుద్ధములలో ఆరి తేరిన వృద్ధమూర్తులు. కథా కథన రంగంలోకి ఉరుకుల, పరుగులతో ముందుకు దూసుకు వెళ్తున్న యువకిశోరాలు.

సందర్భం-భాగ్యనగరంలోని 'సాధన సాహితీ ప్రవంతి' ఉక్కు నగరంలోని "రచన సచిత్ర మాస పత్రిక' ల సంయుక్త ఆధ్వర్యంలో - కథా సదస్సు; మధురాంతకం రాజారాం గారి సమక్షంలో 'రచన' రచయితల, చందాదార్ల, పాఠకుల గోష్ఠి, వేదగిరి రాంబాబు గ్రంధావిష్కరణ, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డుని పొందిన డా. మధురాంతకం రాజారాం గారికి అభినందన సత్కారం.

నాలుగు సభా వేదికలు ఒక్కటై, నవ నవంగా సాహితీ

చైతన్యం వెల్లివిరిసిన సన్నివేశం!

"కథా రచన" సదస్సు సమన్వయకర్తగా వ్యవహరిస్తూ-ప్రముఖ రచయిత శ్రీ విహారి - తెలుగు కథా సాహిత్య వారసత్వ ఔన్నత్యాన్ని స్థూలంగా పేర్కొంటూ మొదటి తరంలోని గురజాడ, శ్రీపాద, చింతా, వేలూరి, కవికొండల, చలం, గోఖలే వంటి సాహితీ దిగ్గంతుల్ని స్మరించి, గోపీచంద్, బుచ్చిబాబు, కొండవటి గంటి, మల్లాది,రావి శాస్త్రి, కాళీపట్నం, మధురాంతకం వంటి పెద్దల్ని పేర్కొని, నిన్నటి, నేటి కథకుల కృషి ఫలితంగా, సుసంపన్నమైన 'తెలుగు కథ' గురించి తొలిపలుకులు పలికి సదస్సుని ఆరంభించారు.

రచయితల అభిప్రాయాల కలబోతకు ఒక వేదికగా ఈ కథా సదస్సు నిర్వహింప బడుతోందని చెప్తూ మొదటి ప్రశ్నను రచయితల ముందు వుంచారు శ్రీ విహారి.

ఇదీ ప్రశ్న: " గతంలో అధిక సంఖ్యలో కథలు వ్రాసి పాఠక లోకానికి సుపరిచితులైన కథకులు ఈనాడు అదే చైత్యనంతో ఎందువలన కథలు వ్రాయడం లేదు? వారిలో మళ్ళీ ప్రేరణ కలిగించడడానికి ఏ విధమైన కృషి జరగాలి?"

మొదటగా శ్రీ కాళీపట్నం రామారావు గారి అభిప్రాయాల్ని ఆహ్వానించారు. వారి సమాధానం ఇలా సాగింది "1972 నుంచీ 1992 వరకూ గేప్ వచ్చింది. కొన్ని వ్యక్తిగత కారణాలు. మానసిక వార్థక్యం కూడా నేమో! కొన్ని సామాజికమైన కారణాలు, సాహిత్యం పట్ల నాకున్న అభిప్రాయాలకు తగిన సామాజిక వాతావరణం లేదు. అంతకు మించి వివరణ ఇవ్వలేను. అయితే, రాయాలనే గట్టి ప్రయత్నం మళ్ళీ జరుగుతోంది.!"

శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు గారు ఇలా అన్నారు "ఒక

కారణం-వార్థక్యం వచ్చేసింది. మరో కారణం ఆ కాలంలో 'తెలుగు స్వతంత్ర' వుండేది. దిగ్గంతులైన కథకులు అద్భుతమైన కథలు వ్రాసేవారు. వారి సరసన వారి రచనకు దీటైన కథతో 'తెలుగు స్వతంత్రలో' కనపడాలనే ప్రేరణా, ఉత్సాహం వుండేవి. మంచి కథ రాయడం ఒక ఛాలెంజ్‌గా తోచేది. సంస్కృతీ సాహితి కూడా బాగున్న రోజులు అవి. ఇప్పుడా స్టేండర్డ్ వున్న కథలు రావడం లేదు. రాయాలనిపించదు. ప్రేరణ లేదు''

ఇదే ప్రశ్నని శ్రీ శీలా వీర్రాజు గారిని అడిగితే, వారన్న మాటలు ఇలా వున్నై "సమాధానం "కృష్ణ కృష్ణ' వంటిదే! రాయలేక కాదు. మారుతున్న సామాజిక మార్పులకు అడ్జస్ట్ కాలేకపోతున్నాను. పత్రికల్లో వస్తున్న మార్పులకి అనుగుణంగా మారలేక పోతున్నాను. పత్రికల ధోరణిలో వ్యాపారతత్వం వలన మార్పు వచ్చింది. లాభార్జనాపరులైన పెట్టుబడి దారుల వొత్తిడి వలన రచయితలైన ఎడిటర్లు కూడా చేతులు కట్టేసుకోవాల్సి వస్తోంది. రచయితల పత్రికలు లేకపోవడమే ఈ దుస్థితికి కారణం''

''వ్యక్తిగతమైన కారణాల్ని పక్కన పెట్టే, వేగంగా మారుతున్న పత్రికల వ్యాపార ధోరణులూ, అవాంఛనీయంగా మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా 'సర్దుకుపోయి' రాయలేకపోవడం ప్రధాన కారణాలుగా భావించ వచ్చు'' అంటూ తమ రెండవ ప్రశ్నను సంధించారు విహారి.

"కథా సాహిత్యం మనుగడకి ముఖ్యంగా పత్రికలే ఆలంబనం కదా. అయితే, పత్రికలు తమ బాధ్యతని సక్రమంగా నెరవేర్చడం లేదనీ, పత్రికాలోకంలో అనేక అవాంఛనీయ పరిస్థితులు నెలకొని వున్నాయనీ అనుకుంటున్నారు కొందరు. ఇందులో వాస్తవం ఎంత?''

ఏ ప్రశ్నకు ఏ రచయితలు సమాధానం ఇవ్వాలో ఒక పద్ధతి నిర్ణయించుకోవడం జరిగిందనీ, ఆ కారణాన ఇతరులు అపార్థం చేసుకోవద్దనీ, అయితే అన్ని ప్రశ్నలకు కలిపి సాధ్యమైనంత ఎక్కువ మంది అభిప్రాయాల్ని సేకరించుకోవడం జరుగుతుందనీ వివరణ ఇచ్చి అవకాశం రాని రచయిత లెవరైనా ఏ ప్రశ్నకైనా స్పందించ దలుచుకుంటే వేరే కాగితం మీద తమ అభిప్రాయాల్ని రాసి ఇవ్వవలసిందిగా అర్థించారు శ్రీ విహారి.

రెండవ ప్రశ్నకు మొదటి సమాధానం శ్రీ వాకాటి పాండురంగారావ్ గారిది : "పతనం అనేది రచయితల్లోనూ, పాఠకుల్లోనూ వచ్చింది. ఏ పెట్టుబడిదారూ, ఈ కథ వెయ్యి, ఈ కథ వెయ్యకు అని నిర్దేశించడు, శాసించడు. మంచి కథల్ని పత్రికలు ఎప్పుడూ ఆదరిస్తాయి. ఇటీవల కొత్త రచయితలు ఎందరో చాలా మంచి కథలు వ్రాస్తున్నారు. ఎవరో కొందరు రచయితలూ, కొన్ని పత్రికలూ కొన్ని మూస కథల్ని దిగుమతి చేస్తున్నంత మాత్రాన కథ బాగుండలేదని అనుకోవద్దు. మంచి కథకు తగినంత ప్రచారం రావడం లేదు. అంతే!"

శ్రీ వాకాటితో ఏకీభవించక, శ్రీ అవసరాల రామకృష్ణారావు గారు ఇలా అభిప్రాయపడ్డారు. "పతనానికి సంపాదకులు, పబ్లిషర్ల బాధ్యత వున్నది. ఇది వరకు వున్నటువంటి పత్రికలు లేవు. పబ్లిషర్లూ లేరూ ఇప్పుడున్నది చెత్త పత్రికలు, బూతు పత్రికలు."

"కవిత్వం మీద వస్తున్నంతగా కథా సాహిత్యం మీద సద్విమర్శ రావడం లేదు. దీనికి కారణాలేమిటి?" అనే ప్రశ్న వచ్చినప్పుడు, "ఇది వరలో వలె శిష్టులైన విమర్శకులు లేరు. 'భారతి' వంటి పత్రికలు లేవు. శ్రీవాత్సవ గారిలా సంవత్సరానికోసారి కథలను సింహావలోకనం చేసే వారు లేరు.

కనీసం కొందరు కలిసయినా Syndicate గా ఆ పని చేయాలని అభిప్రాయపడ్డారు శ్రీ మధురాంతకం రాజారాం. ఇదే అంశం పై -శ్రీ డి. వెంకట్రామయ్య "మంచి కథలే అక్ఖర్లేదు. మంచి విమర్శ లెందుకు పత్రికలకు? అంటూ "పత్రికల్లో సెక్స్, క్రైమ్‌ల విశృంఖలత్వం పోనిదే పరిస్థితిలో మార్పు రాదు" అన్నారు. శ్రీ పాపినేని శివశంకర్ స్పందిస్తూ "మంచి కథలు వస్తున్నాయి. కవిత్వం మీద విమర్శ కూడా బాగానే వుంది. పత్రికల సహకారం కావాలి" అన్నారు శ్రీ సుభ "మంచి కథలు లేవు కనుక మంచి విమర్శలేదు. వృద్ధాప్యం effect కూడా వుంది. కుర్రవాళ్ళు రాయాలి" అనే అభిప్రాయం ఇచ్చారు. "కొత్త తరానికి ప్రాధాన్యత వుంది. తప్పకుండా వారిని గుర్తించి ఉదహరించడం జరుగుతోంది'స్వామి' రచన 'పాపుకూడు' వంటి కథల అనువాదం జరుగుతోంది" అని వివరణ ఇచ్చారు డా. కేతు విశ్వనాథరెడ్డి.

ఆ తర్వాత ప్రశ్న -క్రిక్కిరిసిన హాలులో- మరికొంత ఉత్సాహాన్ని, ఉత్సుకతనీ రేపింది.

"కళింగ కథలు, సీమ కథలు సంపుటాలు వచ్చాయి. మరి కొన్ని కథా సంపుటాల్ని తెలంగాణా కథలుగా పేర్కొంటున్నారు. ఈ పరిణామం వాంఛనీయమైనదేనా లేక భవిష్యత్తులో కొత్త సమస్యల్ని తెచ్చి పెట్టుందా?" అన్నది ఆ ప్రశ్న.

అభిప్రాయాల్ని వెలిబుచ్చిన రచయితలు సర్వశ్రీ రావులపాటి సీతారాంరావు, వీరాజీ, చంద్ర, ఎస్. పురుషోత్తమాచార్య "ఈ విధంగా ప్రాంతీయ విభజన వాంఛనీయం కాదు" అని స్పష్టం చేశారు. కాగా శ్రీ. జి. ఆర్. రెడ్డి అనే శ్రోత-సదస్సులో తెలంగాణా రచయితలకు తగిన ప్రాతినిధ్యంలేదనే ప్రశ్న లేవనెత్తారు. విషయ వివరణ చేస్తూ, శ్రీ విహారి, "సభా నిర్వాహకులకు అలాంటి

ప్రాంతీయ దృష్టి వుండి వుండదని కథా చర్చలో ఇలాంటి భేద భావానికి తావు లేదనీ" అంటూ, "వాకాటి, బి. పోరుడు, రెండు రెక్కలవాడు, మధురాంతకం -పొద్దు చాలని మనిషి, తాను వెలిగించిన దీపాలు సదానంద కదన రంగం వంటి కథలు ఎంత గొప్పవో అల్లం రాజయ్య కథలూ, ఉప్పల నరసింహం తిరగబడ్డ భూమి, బువ్వ కథలూ అంతకంత గొప్పవేనని చెప్పారు. ఉప్పల నరసింహం ఎవరో తెలియకున్నా అతని పుస్తకం మీద, ఒక్క బువ్వ కథ మీదా తాను చేసిన కృషి, విమర్శలో ఆ కథకి ఇచ్చిన ప్రాముఖ్యతల్ని వివరించారు శ్రీ విహారి.

శ్రీ జ్వాలాముఖి ఈ ప్రశ్నకు స్పందిస్తూ, "ఒక ప్రాంతంలో జరిగే జీవన సంఘర్షణకూ, సంక్షోభానికీ అద్దం పట్టే కథల్ని-ఆ నేపథ్యంలోనే చూడాలి. అల్లం రాజయ్య కథల్ని ప్రాంతీయ కథలని ఎలా అంటారు. అవి తెలంగాణాకే పరిమితమైనవి కావు. విశ్వవిఖ్యాతికి తగినవి" అని 'శ్వేత రాత్రులు' సంపుటిని ఉదహరించి, సభికుల హర్షధ్వానాల్ని చూరగొన్నారు.

స్త్రీవాద సాహిత్యం గురించిన ప్రశ్నకు సమాధానంగా శ్రీమతి ఓల్గా "అలాంటి కథా సాహిత్యం ఇది వరకూ వుంది. చలం, కుటుంబరావు, రంగనాయకమ్మ, ఛాయాదేవి, ఆచంట శారదాదేవి స్త్రీ వాద రచనలు చేశారు. అయితే ఇప్పుడు స్త్రీ వాదం ఒక ప్రాపంచిక దృక్పథంగా తాత్విక బలంగా ఎదిగింది" అన్నారు. శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి "ఈ కథల్లో స్త్రీ హృదయ చిత్రణ వుంది. అయితే నైశిత్యం వల్గారిటీగా మారుతోంది. జాగ్రత్త పడాలి" అన్నారు.

"కథా సంపుటాల ప్రచురణతో మళ్ళీ తెలుగు కథకు మంచి రోజులు వచ్చాయి అంటున్నారు. ఈ పుస్తకాల్ని నిజంగా పాఠకులు

కొని చదువుతున్నారా? ఈ ప్రయత్నాల్లోని సాధక బాధకాలు ఏమిటి?" అనే ప్రశ్నకు సర్వశ్రీ భరాగో, యామినీ సరస్వతి, వాకాటి, అవసరాల రామకృష్ణారావు, భమిడిపాటి కృష్ణమూర్తి, సదానంద శారద తమ తమ అనుభవాల్ని వెల్లడించారు. వ్యాపార పరంగా లాభార్జనకు వీలు లేదని, ఎక్కువ భాగం సాటి రచయితలకి పంచడంతోనే పోతాయనీ, అయితే పరిస్థితులు మెరుగవుతున్నాయనీ విభిన్న అభిప్రాయాలు వచ్చినై.

"ఇప్పుడు వస్తున్న కథల్లోని వస్తువు, శైలి, శిల్పాల్లో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్న మార్పులు ఏమైనా ఉన్నాయా?" అనే ప్రశ్నకు "పూర్వం కంటే ఇప్పటి కథల్లో వైవిధ్యం వుంది. క్లుప్తత, స్పష్టత పెరిగింది" అన్నారు శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ కప్పగంతుల మల్లిఖార్జునరావు. "జీవితంలో పెరుగుతున్న సంక్లిష్టత కథావస్తువు, శైలి, శిల్పాల్లో కూడా మార్పుని తీసుకువచ్చింది" అన్నారు శ్రీ కవనశర్మ. శ్రీ విహినమూర్తి ఈ అంశాల్ని విశ్లేషిస్తూ-ఇదీ వచ్చిన మార్పు అనే రీతిలో ఫాంటసీ వాస్తవికంగా ఎలా సమ్మిళితమై కొత్త శిల్పంగా పరిణమిస్తుందో వివరించారు. శ్రీ వాసిరెడ్డి నవీన్- వస్తువు పరంగా గిరిజనుల కథల వంటివి రావడం, శైలిపరంగా మాండలికాలు ఎక్కువగా చోటు చేసుకోవడం గురించి చెప్పి కథా నిడివి తగ్గటం కంప్యూటర్ యుగ లక్షణమే నన్నారు. ఇదే అంశంపై శ్రీ జీడిగుంట రామచంద్రమూర్తి. -"Size తగ్గిపోయింది. స్పీడ్ పెరిగింది" అంటే, శ్రీ ఎస్.. పురుషోత్తమాచార్య "సామాజిక నేపథ్యం మారుతోంది కనుక కథలూ మారుతున్నై" అన్నారు. శ్రీ పోలాప్రగడ- "కథలో సింబాలిజిమ్ ఎక్కువౌతోంది" అంటూ, "మాండలికంఎక్కువైతే Communication gap ఎక్కువౌతుంది. మనం జాగ్రత్తపడాలి" అన్నారు. శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి "వారపత్రికల్లో నెలలోని ఒక వారం పత్రిక పూర్తి కథల పత్రికగా రావాలి" అన్నారు.

"తెలుగు కథకి జాతీయ స్థాయిలో రావలసినంత గుర్తింపు రావడం లేదనే ఆవేదన మనకు వుంది. ఆచరణీయమైన ప్రణాళికని ఆలోచించగలమా?" అన్నది చివరి ప్రశ్న. శ్రీ పోతుకూచి సాంబశివరావు మాట్లాడుతూ, "రచయితలు హాస్యం రాయాలనీ, అనువాద సంపుటాలూ, చిన్న చిన్న కథా సంపుటాలు ప్రచురించుకోవాలనీ, సహకార సంస్థ ఏర్పడాలనీ" వాంఛించారు. శ్రీ పొకాటి, విరివిగా "ఇంగ్లీషులోకి తర్జుమా కావాలనీ, సృజనాత్మకత కన్నా Academic faculties వృద్ధి చెందినవారు judge చేయకూడదనీ, feasibility of translation గురించి పరిశీలించాలనీ తమ సూచనల్ని ఇచ్చారు. డా. కేతు విశ్వనాథరెడ్డి జరుగుతున్న కృషిని వివరిస్తూ "ఇంగ్లీష్‌లో వెలువడుతున్న 'కథ' సంపుటాల్ని, Southern Harvest సంపుటాల్నీ ఉదహరించారు.

"చాలినంత సమయం లేకపోవడం వలన కొందరు రచయితలు-వారు సమాధానం చెప్పవలసి వచ్చినప్పుడు సభలో లేనందు వలనా-కథకులందరి అభిప్రాయాల్నీ సేకరించ లేకపోయినా-చర్చ ఆలోచనీయంగా సాగింది. వాతావరణం మెదడుకు పదును పెడుతోంది. ఈ అభిప్రాయ సమీకరణ నిర్దిష్ట ప్రణాళికలకు కరదీపిక కాగలిగితే సదస్సు లక్ష్యం నెరవేరుతుంది. నిర్వాహకులు, మనమూ ఈ దిశగా పయనించాలి. తెలుగు కథ వన్నెని, వాసినీ మరింత అభివృద్ధి చేసుకుందాం" అంటూ సదస్సును ముగించారు శ్రీ విహారి. చర్చల మధ్య మధ్య సుప్రసిద్ధ కథకుల్ని కథల్నీ, వారి వారి శైలినీ, శిల్పాన్నీ ఉదహరిస్తూ-సదస్సుని హుందాగా, అందంగా నిర్వహించిన-సమన్వయకర్త శ్రీ విహారిని పెద్దలూ, శ్రోతలూ ఎందరో అభినందించడం జరిగింది. సుమారు నలభై మంది సుప్రసిద్ధ రచయితలూ, మరో60 మంది కొత్తతరం రచయితలూ, ఇంకా మూడు వందల దాకా సాహిత్యాభిమానులు ఈ సదస్సులో పాల్గొనడం ఒక విశిష్ట సంఘటన.

**రెండవ సదస్సు 'రచన' సచిత్ర మాస పత్రిక రచయితల, చందాదారుల, పాఠకుల కబుర్లు:**

'రచన' సంపాదకులు శ్రీ శాయి నిర్వహించారు. 'రచన' మాస పత్రిక ఆవిష్కరణకు కారణాలు, నేపథ్యం వివరించి, 'రచన' ఆర్థికంగా స్వయంపోషకం కావడానికి జరుగుతున్న కృషిని సభ ముందుంచారు. పత్రికని కొనసాగించడం ఎంతటి కత్తి మీది సాములా మారిందో తెలియచేశారు. చందాదారుల ద్వారా సర్క్యులేషన్ పెరిగితే కాపీకి ఒక రూపాయి ఖర్చు తగ్గుతుందనీ-ఇది నష్టంలో లాభమనీ - అంకెలతో ఉదహరించి, చందాదారులుగా చేరి ప్రతి ఒక్కరూ తమ మిత్రుల్ని కనీసం మరో ఇద్దరిని చేర్పించి - పత్రికని నిలిపేందుకు సహకరించమని అర్థించారు. అలాగే ప్రకటనల సేకరణకు తోడ్పడి సహాయాన్ని అందించమనీ కోరారు. ఈ సలహా ముందుగా సదస్సుల మధ్య నుంచే రావడం గమనార్హం.

పాఠకుల నుంచి వచ్చిన సలహాలూ, అభిప్రాయాల్లో ముఖ్యమైనవి - పత్రికలో అశ్లీలతని చోటు చేసుకోనివ్వవద్దనీ, illustrations లో కూడా జాగ్రత్త వహించమనీ, కొత్త రచయితల్ని ప్రోత్సహించమనీనూ. వివిధ విషయాల మీద వివరణలు ఇస్తూ 'రచన' నలుగురూ కలిసి చదువుకొనే పత్రికగానే నిలుస్తుందనీ, అదే తమ ఆశయమనీ చెప్పారు సంపాదకులు.

'రచన' తరఫున రచయితల సహకారాన్ని ఆశిస్తూ, 'రచన' సలహాదారు శ్రీ. కాళీపట్నం రామారావు కథకుల్ని తమ తమ రచనలు పంపవలసిందిగా కోరారు. "రచన మీ బిడ్డ వంటిది. బిడ్డకి ఏమి కావాలో అది ఇవ్వండి. అడగకపోయినా బిడ్డ ఆరోగ్యం, ఆనందం, పోషణ తల్లిదండ్రుల బాధ్యతే గదా! అలాగే పొరపాట్లు వుంటే హెచ్చరించండి, చెప్పండి" అని ఆర్ద్రతతో [illegible] చేయడం

రచయితల్నీ పాఠకుల్నీ కదిలించింది.

చర్చలో - స్త్రీలకు ప్రత్యేక శీర్షిక, పిల్లలకు ప్రత్యేక శీర్షిక వుండటం వంటి పలు అంశాలపై ఆసక్తిదాయకమైన సలహాలు, సూచనలూ అందాయి.

పత్రిక ఆర్థిక స్తోమతుకు దోహదం చేసే వివిధ అంశాల్నీ ఆలోచించమని సూచించారు కొందరు రచయిత మిత్రులు.

చర్చలో మాట్లాడిన వారంతా 'రచన' పట్ల మక్కువనీ, మన్ననీ, 'రచన' నిర్వాహకుల పట్ల గౌరవాభిమానాల్నీ వెలిబుచ్చారు. అందరికీ ఏదో ఒక సహాయం చేయాలనే భావస్ఫూర్తి కలిగిందని అనుకున్నారు.

ఈ 'కబుర్ల'ని ముగిస్తూ శ్రీ శాయి - "చెప్పాల్సింది చెప్పాను. వినాల్సిందంతా విన్నారు. చేయవలసింది మీకు తోచినట్లుగా చేయండి" అంటూ ధన్యవాదాలు తెలిపారు.

**నాల్గు కథా సంకలనాల ఆవిష్కరణోత్సవం**

ఆ తర్వాతి సమావేశంలో శ్రీ వేదగిరి రాంబాబు నాలుగు కథా సంపుటాలు ఆవిష్కరణ సభ, శ్రీ కాళీపట్నం రామారావు అధ్యక్షులుగా, శ్రీ కె.వి రమణ (కడప జిల్లా కలెక్టర్) ముఖ్య అతిథిగా సాగింది.

"కస్తూరి" సంపుటాన్ని శ్రీ వాకాటి ఆవిష్కరించగా, శ్రీ రాజారాం గారికి అంకితం ఇవ్వడం జరిగింది. "వయసు కథలు" శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు ఆవిష్కరించారు. గ్రంథ స్వీకర్త శ్రీ విహారి. "విముక్తి" శ్రీ కె.వి. రమణ IAS ఆవిష్కర్త. శ్రీ ఆదివిష్ణు గ్రంథస్వీకర్త. "ఈ 'కాలమ్' కథలు సంపుటిని శ్రీ భరాగో

ఆవిష్కరించారు. శ్రీ వీరాజీ అంకితం స్వీకరించారు. గ్రంథ స్వీకర్తలు నలుగురూ-రచయిత శ్రీ వేదగిరి రాంబాబు-స్నేహ సౌజన్యాన్నీ, ఆత్మీయతనీ వివరించి, అతనికి తమ ఆశీస్సుల్నీ, అభినందనల్నీ తెలిపారు. శ్రీ కె.వి. రమణ -'జనాంతర సౌహృదాని' అంటూ తనకూ, వేదగిరి రాంబాబుకీ గల స్నేహాన్ని తెలిపి రచయితను అభినందించారు. అధ్యక్షులకూ, ముఖ్య అతిధికీ, ఆవిష్కర్తకు, గ్రంథ స్వీకర్తలకూ "జ్ఞాపిక" ప్రదానం జరిగింది. శ్రీ వేదగిరి రాంబాబు అందరికీ తన కృతజ్ఞతలు పేరు పేరునా తెలిపారు.

ఈ కార్యక్రమంలో ముఖ్య భాగంగా శ్రీ కె.వి రమణ, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత డా. మధురాంతకం రాజారాం గారిని ప్రత్యేకంగా సన్మానించారు.

మొత్తం సాహిత్య కార్యక్రమానికి తొలుత 'సాధన సాహితీ స్రవంతి' అధ్యక్షుడు శ్రీ నరసింహాచార్య సభికులకు స్వాగతం పలుకగా, చివర కార్యదర్శి శ్రీ అమర్‌నాథ్ వందన సమర్పణ చేశారు.

ఈ కార్యక్రమం దిగ్విజయం కావడానికి అందరూ కారకులే!

ఎందరో మహానుభావులు!!

అందరికీ వందనాలు!!

**'హంసలేఖ'**

**(రచన ఏప్రిల్ 94)**

# తెలుగు కథా సరిత్సాగరం

నాడు స్వాతంత్ర్య సమరంలో అంత చురుకుగా పాల్గొన్న మీరు ఇప్పుడు రాజకీయాలకు ఎందుకు దూరంగా వుంటున్నారు? విలువలు మారాయి అప్పటి ప్రేరణ వాతావరణం ఇప్పుడు లేవు. అంత గొప్ప వ్యక్తులు ఇప్పుడు లేరు. అందుకే దూరంగా వుండడం మంచిదనుకున్నాను. నాడు వెండితెర మీద అంతగా వెలుగొందిన మీరు ఇప్పుడు నటించడలేదు ఎందుకని? విలువలు మారాయి అప్పటి ప్రేరణ, వాతావరణం ఇప్పుడు లేవు. అంత గొప్ప వ్యక్తులు ఇప్పుడు లేరు. నాడు కథా రంగంలో కదం తొక్కిన మీరు ఇప్పుడు రచనలు చేయడం ఎందుకు మానుకున్నారు? విలువలు మారాయి. అప్పటి ప్రేరణ, సామాజిక సాంస్కృతిక వాతావరణం ఇప్పుడు లేదు. అంతగొప్ప పత్రికలూ ఇప్పుడు లేవు.

ఈ తరం వారిని మరో తరంలో ఇవే ప్రశ్నలు వేసినా ఇలాంటి జవాబులే వస్తాయి! తరాల మధ్య అంతరం అంటే అదే కాబోలు! అయితే అందరూ ఇలాగే సమాధానం చెప్పరు.

"ఈ తరం యువతరానిది. మేము వారితో పోటీపడం. వారికి స్ఫూర్తినిస్తాం. ప్రేరణగా నిలుస్తాం! మా కంటె వారు మరింత వేగంగా ముందుకు వెళ్ళాలని కోరుకుంటాం" అనే వారూ ఉంటారు. అయితే వారి సంఖ్య బహు స్వల్పం. ఒకప్పుడు పది మంది గౌరవ పురస్కారాలు అందుకున్న వ్యక్తి నేడు ఏ గుర్తింపూ లేక నేటి నడక వేగాన్ని అందుకోలేక పడుతున్న మానసిక సంఘర్షణను మనం అర్థం చేసుకోగలం. "ఐడెంటిటీ క్రైసిస్" అనేది మనిషి బలహీనత. ఆ బలహీనత అన్ని రంగాల్లోని ప్రముఖుల్లోనూ ఉంటుంది అనడం అతిశయోక్తి కాబోదేమో !

ఇటీవల హైద్రాబాద్‌లో ఓ యాభై అరవై మంది కథకులు సమావేశమైనప్పుడు ఆ సమావేశంలో ప్రధానంగా అదే విధమైన సంఘర్షణ. ఆవేదన తొంగి చూశాయి. వారిలో. చాలా మంది ఒకప్పటి ప్రముఖ కథా రచయితలు కాగా కొందరు ఈ తరంతో పోటీపడుతూ కథా స్రవంతిలో తమ కలం గుర్తింపును కొనసాగిస్తున్న వారు. మరి కొందరు నిన్నటి తరానికి, నేటి తరానికి ప్రతినిధులు. ఇంకొందరు ఈ తరం కథా రచయితల్ని మనసారా అభినందిస్తున్న వారూనూ వీరంతా కలిసి వందేళ్ల ఆధునిక తెలుగు కథ మీద చర్చించారు.

తెలుగు కథ నేడు వెల వెలబోతోంది ఎందుకు?

నిన్నటి ప్రముఖ కథకులు నేడు కథలు రాయడం ఎందుకు మానుకున్నారు?

పత్రికలు కథను ప్రోత్సహించడంలేదా?

విమర్శకులు పట్టించుకుని లోతైన విమర్శను ఆవిష్కరించడం లేదా?

జాతీయ స్థాయిలో తెలుగు కథకు గుర్తింపు ఎందుకు రావడంలేదు?

కళింగ కథలనీ, సీమ కథలనీ, తెలంగాణా కథలనీ ఇలా ప్రాంతాల పేరిట కథా సంపుటాలు వెలువరించడం మంచిదేనా?

ఈ విభజన పరిణామాలు ముందు ముందు ఎలా ఉంటాయి? మొదలైన ప్రశ్నలపై కథా సదస్సులో చర్చ జరిగింది.

వీటికి జవాబులు చెప్పుకునే ముందు ఆ సదస్సులో పెద్దల అభిప్రాయాలు గమనిద్దాం. శ్రీ కాళీపట్నం రామారావు కథలు

రాయకపోవడాన్ని గురించి ప్రస్తావిస్తూ 1972 వరకూ కథలు రాశాను 1992 వరకూ మళ్ళీ రాయలేదు. అందుకు కొన్ని వ్యక్తిగత కారణాలు ఉన్నాయి. సాహిత్యం పట్ల నాకున్న అభిప్రాయాలకు తగిన సామాజిక వాతావరణం లేదు. ఇంతకు మించి వివరించలేను. రాయాలని ఉంది అన్నారు. ఎందుకు రాయడంలేదు? అనే ప్రశ్నకే శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు సమాధానం ఇస్తూ తాను రాయడానికి ప్రేరణ ఇచ్చిన సాంస్కృతిక వాతావరణం ఇప్పుడు లేదన్నారు. "తెలుగు స్వతంత్ర" లో నిష్ణాతులు రాసేవారు. వారిలో ఒకణ్ణి కావాలనే తపనతో రాసేవాణ్ణి. ఇప్పటి పరిస్థితి అలా లేదు. ప్రేరణ లేదు అన్నారాయన.

రాసిన కథలు వేసే వారు లేక కథలు రాయడం మానుకున్నాననీ, పత్రికల ధోరణిలో మార్పు వచ్చింది. సంపాదకులపై పెట్టుబడిదారుల ప్రభావం ఉంటోందని శ్రీ శీలా వీర్రాజు బాధపడ్డారు.

పత్రికలు కథను ప్రోత్సహించడం లేదా? అనే ప్రశ్నకు శ్రీ యామినీ సరస్వతి స్పందిస్తూ పత్రికల్లో కథల సంఖ్య తగ్గిందని, చాలా పత్రికలు మూతపడ్డాయని, ఉన్న పత్రికలు కూడా "మంచి కథల" కు ద్వారం మూస్తున్నాయని అన్నారు. ఈ పరిస్థితుల్లో స్వయంగా కథల్ని అచ్చేసుకుని సంపుటిగా తీసుకు రావలసిన అవశ్యకత ఏర్పడిందనీ, అయితే సంపుటి, సంకలనాలను లైబ్రరీ వాళ్ళు కొనడంలేదనీ, అభిమానంగా రాసే పాఠకులు కూడా కరువయ్యారని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు.

కథా రచనపై సమీక్షలు, విమర్శలు రావడంలేదనే ప్రశ్నకు శ్రీ మధురాంతకు రాజారాం జవాబిస్తూ-పత్రికలలో ఏడాది పొడవునా ప్రచురితమైన కథలపై విమర్శలు చేయడానికి ఎవరూ లేనందున

విమర్శలు రావడంలేదనీ, కథా సమీక్షలపై ఒక సంఘం ఏర్పడి విమర్శను ప్రధానంగా తీసుకోవాలని అన్నారు.

నేటి పత్రికలకు కథలు అక్కర్లేదని, అలాంటప్పుడు విమర్శ లెక్కడుంటాయని, పత్రికలు కేవలం క్రైం, సెక్స్‌నే పేజీల నిండా నింపుతున్నాయనే శ్రీ డి. వెంకటరామయ్య అభిప్రాయంతో పాపినేని శివశంకర్, శ్రీ సుభ ఏకీభవించారు.

కథా రచనల్లో కళింగ కథలనీ, రాయలసీమ కథలనీ, తెలంగాణా కథలనీ ప్రాంతీయ ముద్ర ప్రవేశించింది. ఈ మార్పు వాంఛనీయమేనా? అనే ప్రశ్నకు శ్రీ రావులపాటి సీతారాంరావు "రచనల్లో ప్రాంతీయం హర్షణీయం! కానీ మంచి రచనకు పరిధులేమీ ఉండవు" అన్నారు. శ్రీ శేషం పురుషోత్తమాచార్యులు, శ్రీ చంద్ర, శ్రీ వీరాజీ కథలలో ప్రాంతీయ విభజన తగదని అన్నారు. కాగా ఒక ప్రాంతంలో జరిగే జీవన సంఘర్షణకు అద్దం పట్టిన సీమ కథల్ని ఈ దశాబ్ద జీవన సంక్షోభాన్ని సామాజిక పరిష్కారాన్ని ఎంతో గొప్పగా చిత్రించిన అల్లం రాజయ్య కథల్ని ప్రాంతీయ కథలని ఎవరంటారు? అంటూ రాజయ్య కథలు తెలంగాణాకే పరిమితమైనవి కావు. విశ్వ విఖ్యాతికి సంబంధించినవి అని శ్రీ జ్వాలాముఖి, అన్నారు.

ఇంకా భరాగో, అబ్బూరి ఛాయాదేవి, ఓల్గా, సదానంద శారద, భమిడిపాటి కృష్ణమూర్తి, తిరుమల రామచంద్ర, వాకాటి పాండురంగారావు, జగన్‌రెడ్డి, జీడిగుంట రామచంద్రమూర్తి, వి.వి.న మూర్తి పతంజలి, పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి, పోతుకూచి సాంబశివరావు, కేతు విశ్వనాథరెడ్డి వంటి పలువురు ప్రముఖులు పాల్గొన్నారు. వారంతా వివిధ అంశాల మీద తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

'కథ' గురించి స్వేచ్ఛగా మాట్లాడే అవకాశం ఉంటే వారంతా ఎలా మాట్లాడే వారో తెలియదు కాని వారికి కచ్చితంగా ఒక అంశం ఇచ్చి ఆ అంశం మీదే జవాబు చెప్పమని కోరడమైంది. అయినప్పటికీ ఈ సదస్సులో మంచి అంశాలు ప్రస్తావించారు కొందరు కథకులు. ఎటొచ్చీ ప్రశ్నావళిలోనే కొన్ని అనవసర ప్రశ్నలు చోటు చేసుకున్నాయి.

తెలుగు కథ ఎందుకు వెలవెలబోతోంది? అనేది అర్థంలేని ప్రశ్న. తెలుగు కథ వెల వెల బోతోందని ఒక నిర్ణయం తీసేసుకుని దానికి కారణాలు వెతుక్కోవడంలో ఔచిత్యం లేదు.

సమాజం అత్యంత వేగంగా పరిణామం చెందుతోంది. విజ్ఞాన శాస్త్ర ఫలితాలు, పారిశ్రామికీకరణ ఈ వేగాన్ని మరింతగా పెంచుతున్నాయి. ముఖ్యంగా మానవ సంబంధాలను నిలబెట్టే విలువలలో మార్పులు వచ్చాయి. విజ్ఞాన శాస్త్రం, దూర భారాలను తగ్గించి ప్రపంచంలో వివిధ సంస్కృతులను సమ్మిళితం చేస్తోంది. ఈ వేగమైన మార్పుల్ని గ్రహిస్తూ నేటి రచయిత తన కర్తవ్యాన్ని గ్రహించి రచనలు చేస్తున్నాడు. ఆ మార్పు, ఆ వేగం అనుసరించలేని ఒకనాటి ప్రముఖ కథకులు వెల వెలబోతోంది అనడం సమంజసం కాదేమో! పోలాప్రగడ సత్యనారాయణమూర్తి గారన్నట్లు మూడు పేజీలలో చెప్పే కథను నేడు ఒక్క వాక్యంలోనే చెప్పేంత స్థాయికి రచయిత ఎదిగాడనన్నది అక్షర సత్యం. ఆధునిక రచయిత బాధ్యతలు, వస్తు పరిధి చాలా గురుతరమైనది, విస్తృతమైనది. నిరంతరం మారుతున్న సమాజాన్ని ఆ మార్పుని మరింత వేగవంతం చేసే విధంగా రాయవలసిన బాధ్యత నేటి రచయితలపై ఉంది. ప్రతి వ్యక్తిలోనూ స్వాతంత్ర్య కాంక్ష పెంపొందింది. ఒకప్పుడు వెనకబడ్డారనుకున్న మనుష్యులు, దేశాలు

తలెత్తినిలబడడానికి ప్రయత్నాలు జరుగుతున్న నేపథ్యం ఇది. ఈ నేపథ్యంలో కథ ఉద్యమ స్థాయిలో పయనించవలసిన పరిస్థితులు కూడా లేవు. నిన్నటి వరకు సంస్కరణలుగా భావించిన విషయాలు నేడు సాధారణ విషయాలు. నిన్నటి కన్యాశుల్క దురాచారం నేడు లేదు. స్వాతంత్ర్యం వచ్చే వరకు జాతీయత, గతకాలపు వైభవాన్ని చాటడం ద్వారా జనాన్ని ఉద్దీప్తం చెయ్యడం రచనా వస్తువుగా ఉండేది. స్వాతంత్ర్యానంతరం సమాజ చిత్రాన్ని బట్టబయలు చేయడం లేదా యధాతథంగా వర్ణించడం జరుగుతుండేది. అందుకే ఆనాటి రచనలకు, రచయితలకు గుర్తింపు వచ్చింది. అయితే ఇప్పటి రచయితల బాధ్యత అంత కంటే గొప్పది. భిన్నమైనది. ఇంతకు ముందు లేని నిర్మాణావస్థలో ఉన్న తాను కూడా భాగస్వామి అయిన సమాజాన్ని చిత్రించవలసి ఉంది. జరిగిన దానికన్నా జరగవలసిన దాన్ని గురించి చెప్పవలసిఉంది. ఈ అభిప్రాయాలనే దేవులపల్లి రామానుజారావుగారు ఒక సందర్భంలో పేర్కొన్నారు. అలా కాక ఇంకా కన్యాశుల్కం గురించి, స్వాతంత్ర్య పోరాటం గురించి, నిజాం నిరంకుశత్వాన్ని గురించిన కథలే రాయాలి అంటే ఎలా ఉంటుంది? శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఆ రోజుల్లో దర్శించిన వస్తు వైవిధ్యం, సమస్యల తీవ్రత నేడూ ఉందా? మతాంతీకరణ, అస్పృశ్యతా సమస్య, ఇల్లు పట్టిన ఆడపడుచులు తదాది సమస్యలు ఇప్పుడూ అంత తీవ్రస్థాయిలోనే ఉన్నాయా? అరవై, డెభ్భయ్యవ దశకంలో వచ్చిన కథలలో అధిక శాతం వృద్ధ మాతా పితరులను అలక్ష్యం చేయడం, భార్యాభర్తల ఇబ్బందులు, టీచర్ల సమస్యలు, పంచాయతీ రాజకీయాలు వంటి సమస్యలే ఇతివృత్తంగా కథలు వచ్చాయి. అవి పాఠకుల్ని హత్తుకునేలా చేశాయి. ఇప్పుడు ఆ సమస్యలు లేవని కాదు. సామాజిక నేపథ్యం చాలా వరకు మారింది. అవే ఇతివృత్తాలతో అంతకంటే గొప్పగా రాసినా అప్పటి

రచయితలకు వచ్చినంత పేరు ఇప్పుడు రాదు అనేది గమనార్హం.

**మాండలికం**

ఇటీవల వస్తున్న కథల్లో మాండలికం పెరిగిందని, ఇది ఆహ్వానించదగ్గ పరిణామమని శ్రీ వాసిరెడ్డి నవీన్ అన్నారు. మాండలికం అంటే ప్రస్తుతం తెలంగాణా, సీమ భాషా వైవిధ్యం మాత్రమే అనుకునే అపోహ ఏర్పడింది. నిజం చెప్పాలంటే కథ ఎప్పుడూ మాండలికంలోనే ఉంటుంది.

ప్రాంతీయ, వర్గ మాండలికాల్లో కథలు ఉంటాయి. శ్రీపాద, గురజాడ నుంచి నిన్న మొన్నటి రావి శాస్త్రి వరకూ వర్గ మాండలికంలో రచనలు చేసిన వారే! శ్రీపాద వారిది తూర్పు గోదావరి జిల్లా బ్రాహ్మణ కుటుంబాల మాడలికం కాగా గురజాడ విజయనగరం, రావిశాస్త్రి విశాఖ మాండలికాల్లో రచనలు చేసిన విషయాన్ని ప్రత్యేకించి ప్రస్తావించ నవసరం లేదు. స్వామి నామినిలు జిల్లా మాండలికాలతో రచనలు చేశారు. ఇటీవల తెలంగాణా మాండలికంలో రచనలు ఎక్కువయ్యాయి. కానీ మొత్తం మీద మాండలిక రచన ఎక్కువైందనేది సరికాదు.

మాండలికం వల్ల ప్రాంతీయ విభేదాలు ఎక్కువ అవుతాయా? అనే ప్రశ్న పక్కన పెటితే మొత్తం కథంతా మాండలికంలో చెప్పవలసిన అవసరం ఏముంది? అని ప్రశ్నించుకోవడం మంచిది. సామాజిక నేపథ్యాన్ని ఎత్తి చూపటానికి మాండలికాన్ని పాత్రల వరకే పరిమితం చేసి రచయిత నరేషన్ మామూలుగా చెప్పినట్టైతే బాగుంటుంది.

అల్లం రాజయ్య వంటి వారి రచనలు మాండలికంలో ఉన్నా జ్వాలాముఖిగారు పేర్కొన్నట్లు అవి విశ్వజనీనమైనవి కావచ్చు.

అయితే ఇక్కడ థీమ్ మాత్రమే యూనివర్సల్. మాండలికం మాత్రం ఇతర తెలుగు ప్రాంతాల వారికే మింగుడు పడనప్పుడు అవి యూనివర్సల్‌గా కీర్తించడం భావ్యమా? ఆలోచించాలి. సమకాలీన సాంఘిక పరిస్థితుల్ని హృద్యంగా చెప్పడానికి పాత్రోచిత మాండలికం అవసరమే. రచయిత నరేషన్ కూడా మాండలికంలోనే ఉండాలి. అది కచ్చితంగా ప్రాంతీయాభిమానమే అని చెప్పాలి. అప్పుడు ఆ కథలు ఎంత విశ్వజనీనమైనా ప్రాంతీయ కథలుగానే పరిగణించాలని చెప్పవలసి ఉంటుంది.

**రాశి ఎందుకు తగ్గింది?**

కథ వాసి తగ్గింది రాశి తగ్గింది అనే విమర్శ నిజం కాదు. రాశి తగ్గిన మాట నిజం కావచ్చు. అందుకు కారణం వాసి కానే కాదు. గతంలో ఏ అంశాన్నైనా కథారూపంలో చెప్పే వారు. ఇప్పుడు చదువరులు ఎక్కువయ్యారు. పాఠకుల ఆలోచనా పరిధి, స్థాయి పెరిగాయి. అందువల్ల పత్రికలలో ఫీచర్స్ ప్రాధాన్యం పెరిగింది. సైన్స్, ఆరోగ్యం, పజిల్స్, వినోదం వగైరా ఫీచర్ల ఆవశ్యకత ఏర్పడి కథలు తగ్గించవలసి వచ్చిందే గాని మంచి కథలు లేక కాదు.

రచయిత, సంపాదకుడు శ్రీ వాకాటి పాండు రంగారావు వృత్తి, ప్రవృత్తుల అనుభవంతో "ఏ పెట్టుబడిదారుడూ ఈ కథలే వేయాలని సంపాదకులకు చెప్పడు. మంచి కథల్ని పత్రికలు ఆదరిస్తాయి. పతనం అనేది రచయిత మనసులలో వస్తుంది. పాఠకులలో వస్తుంది. ఇతరులు వాడుకుంటారు. కథ అసలు బాగాలేదని ఎలా అంటారు? యువతరం మంచి కథలు రాస్తున్నారు. ఎవరో కొందరు మూస కథలు తప్ప మిగిలినవి కథలు కావని ముద్ర వేస్తున్నారు. కనుకనే మంచి కథలకు ప్రచారం రావడం లేదు" అని చెప్పిన సమాధానం

కథకు సంబంధించి తలెత్తే అన్ని ప్రశ్నలకూ సమాధానంగా అన్వయించుకోవచ్చు.

ప్రముఖ సాహితీపరులు రామచంద్ర "పాత కథల కంటె నేటి కథలే నాకు నచ్చుతాయి" అని నిర్మొహమాటంగా చెప్పారు. వందేళ్ళ ఆధునిక తెలుగు కథ ఇప్పటికీ వెలుగొందుతూనే ఉంది. ఆధునిక కవితకు తెలంగాణా పట్టుకొమ్మయితే ఆధునిక తెలుగు కథకు విశాఖ మండలం పుట్టినిల్లు. ఇప్పుడు కథ ఆ చివరి నుండి ఈ చివరకు, కవిత ఈ చివరి నుంచి ఆ చివరకూ విస్తరించాయి. తెలుగు కథలు భారతీయ భావాలతో సమానంగా కొన్ని సందర్భాలలో అంతకన్నా మిన్నగా నిలుస్తున్నాయి.

ఇతివృత్తం అంతర్జాతీయ స్థాయిలో వివిధ భాషల కథలకు ధీటుగా ఉంటోంది. కథనంలో కూడా వైవిధ్యం చోటుచేసుకుంటోంది. కొన్ని కథలు 'హిపోక్రసీ'కి తావు లేకుండా సూటిగా ఉంటున్నాయి.

కొందరు రచయితలు తమని తాము ఆత్మ వంచన చేసుకుంటూనో లేక పాఠకుల్ని ప్రలోభ పెట్టే విధంగానో వ్యవహరించకుండా కథను కొత్త కోణంలో ఆవిష్కరిస్తున్నారు. అయితే అటువంటి కథలు కొన్ని వర్గాల విమర్శలకు గురవుతున్నాయి. అయినా ఆ విమర్శల్ని పరిగణలోకి తీసుకోవలసిన అవసరం లేదు. తెలుగు కథ అంటే 'మడి కట్టుకుని' ఫలానా ఫలానా అంశాలకే పరిమితం కావాలని ఎక్కడా లేదు. ఇప్పుడు తెలుగు కథలో ప్రాంతీయ వైరుధ్యాలకు తావు లేదు. ఒకనాడు కోస్తా ప్రాంతం నుంచి వచ్చిన కథలు అక్కడి రాజకీయ, ఆర్థిక స్థితిగతులకు, సాంస్కృతిక వాతావరణానికి అద్దం పట్టేవి. మిగతా ప్రాంతాల్ల కథలూ అంతేను. అయితే ఇక్కడి పరిస్థితుల్లో ఒక రకమైన 'నిశ్చింత' ఉండేది. అదే కథల్లో ప్రతిబింబిచేది. అదే కోస్తాలో

కళింగాంధ్రం దగ్గరకు వస్తే ఒరియా ప్రాంత ప్రభావం గిరిజన సంస్కృతి, బుగతల పాలన, అణచివేత ప్రతిఫలిస్తాయి పైగా అప్పటి వామపక్ష ఉద్యమం, నక్సలైట్ల పోరాటం ప్రభావం కూడా ఉండేది. విశాఖ మండలంలో చాసో, కారా, రావిశాస్త్రి రచనా ప్రభావం ఉండేది. ఎక్కువ కథల్లో ఏదో విధంగా వేశ్య పోలీసు పాత్రలుండేవి.

ఇక తెలంగాణాకు వస్తే నిజాం నిరంకుశ పాలన, 'కమ్యూనిస్టు ఉద్యమం' దొరల పెత్తందారీ పోకడ, స్వాతంత్ర్య ఉద్యమాలు, ఆర్థిక, పారిశ్రామిక పరిస్థితులు ప్రధాన ఇతివృత్తాలుగా వుండేవి ఎక్కువగా సాయుధ పోరాటమే ప్రధాన సందేశంగా వచ్చేవి

రాయలసీమకు వస్తే కరువు ప్రధాన పాత్ర వహిస్తుంది. నీళ్ళు, కరెంటు మోటార్లు, అనావృష్టి, ఆకలి, భూమి, రాజకీయంగా మోసపోవడం వగైరా అంశాలే ఇతివృత్తాలు. ఇప్పుడు ఆ ప్రాంతాల్లో ఆ సమస్యలు పూర్తిగా పరిష్కారం అయ్యాయా లేదా అనే చర్చ అప్రస్తుతం. కథకు పూర్తిగా అవే ఇతివృత్తాలు తీసుకునే పరిస్థితి మారింది. అందుకే తెలుగు కథ పరిధి మరింతగా విస్తృతపరిచేందుకు కథా సదస్సులు తప్పనిసరిగా జరగవలసిందే. అయితే అందులో అన్ని తరాల రచయితలు, అన్ని వర్గాల రచయితలు పాల్గొనాలి. చర్చలలో పాలు పంచుకోవాలి. చర్చ స్వేచ్ఛగా విస్తృతంగా జరగాలి. అప్పుడే ఆశించిన ప్రయోజనం చేకూరుతుంది.

-పి. విజయబాబు

**(ఆదివారం ఆంధ్రప్రభ 27-2-94)**

# తెలుగు కథా సముద్రం-ఒక మథనం

మన నాగరికతతో బాటే తెలుగు మారింది. మారింది మంచికా చెడుకా? మంచి చెడ్డలు అంటే శైలీ శిల్పాల్లోని బాగోగులా? ఈ బాగోగులకి వస్తు విచక్షణ లేదా? ఆ మాట కొస్తే తెలుగు కథకి దిక్కెవరు? ఇప్పటివరకు బాగా బతికిన తెలుగు కథకి ప్రాంతీయత వుందా, లేదా? వుంటే తప్పేమిటి? లేకపోతే ముప్పేమిటి, జనజీవన చిత్రణ మాటేమిటి, వంటి అనేకానేక ప్రశ్నలకు సమాధానాలిస్తూ చర్చించాలనుకుంటూ అనేక మంది రచయితలు ముఖ్యంగా కథకులు ఒకచోట చేరిన సందర్భం ఈ మధ్యనే ఏర్పడింది. ఢిల్లీలో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం అందుకోవడానికి బయలుదేరి వెడుతున్న మన మధురాంతకం రాజారాంకు నగరంలో గతవారం ఘనసత్కారం జరిగింది. అక్కడి నుంచి మొదలయి సాధన సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో 'రచన' పత్రిక తెలుగు కథ అతీగతీ గురించిన సదస్సు నిర్వహించింది. ఆ వెంట మంచి కథల పత్రిక బతికి బట్టకట్టాలంటే తీసుకోవలసిన జాగ్రత్తల గురించిన సలహా సంప్రదింపుల పౌరసంబంధాల చర్చ కూడా సాగిపోయాయి. ఆపై వివిధ రచనలతో పాఠకులని, సత్సంబంధాలనూ సాధించుకున్న వేదగిరి రాంబాబు పట్టుబట్టి నాలుగు కథాసంకలనాలు రాజారాం, కాళీపట్నం మాష్టారు వంటి పెద్ద కథకుల సమక్షంలో విడుదల చేయించారు. కనుక చాలినంత సందర్భశుద్ధి వుండనే వుంది. ఆ రోజు ఆదివారం ఉదయం డా. ఎన్. గోపి నిర్మించుకున్న 'వంతెన' ఆవిష్కరణలకు బిలబిలమంటూ వచ్చి చేరిన పాఠక, రచయితలు అసంఖ్యాకులు రాత్రి తొమ్మిది వరకు సాహిత్య చర్చలో

మునిగిపోయారు.

ఓటరు, పాఠకుడు, ప్రేక్షకుడు, శ్రోత, కొద్దో గొప్పో పబ్లిషరూ ఒకళ్ళే అయినంతగా ప్రతి ఒక్కరూ జరిగిన చర్చలో పాలు, నీళ్ళూ పంచుకున్నారు. ఐతే చర్చలో మకుటం లేని మహారాజు పద్ధతిలో బెత్తం లేని హెడ్మాష్టరు స్థాయిలో ప్రముఖ రచయిత విహారి (సుస్పష్టమైన అభిప్రాయాలను కూడా వదలకుండా) సభికులని, వక్తలనీ కూడా పూర్తి డిసిప్లిన్‌లో పెట్టేశారు. ఈ మధ్యనే ప్రముఖ పత్రికలో అనేక మంది రచయితలు చేరి నాలుగయిదు దశకాల సాహిత్య దుస్థితి గతులపై రైల్లో పరిచయం లేనీ మనుషులు శ్రీమతి బెనజీర్ మనస్తత్వం నుంచీ భగవద్గీత వరకు సకల విషయాల పై ఉచితంగా చర్చించుకున్నట్టు జీడిపాకం సాగిన టైపులో కబుర్లాడుకున్నారు. దాదాపు అదే ఈ సదస్సులో కొంత భాగం సన్మార్గంలో కట్టె, పాము, కప్ప మూడింటి క్షేమం ఆశించిన కబుర్లు దొర్లాయి. మధ్యాహ్నం మూడింటి నుంచీ ఓ గంట సేపు మాత్రం చర్చ బాగానే సాగింది. ఎక్కడో హఠాత్తుగా కథ అడ్డం తిరిగింది. పైన చెప్పుకున్న వర్ణనలోకి వెళ్ళిపోయింది.

సదస్సుకి ముందు, వెనుక జరుగుతున్న సమయంలో కూడా కొందరు రచయిత(త్రు) లు తెలుగు కథ అవస్థ గురించి మినీ సదస్సులు గా ఏర్పడి చెప్పుకున్నారు. ఈ సారి సదస్సులో చిన్న తేడా లేకపో లేదు. కవులు, కథకులు, నాటక రచయితలు కలగలిసి చర్చలోకి దిగడమే ఆ తేడా, దురదృష్టవశాత్తు మన ఆంధ్ర రాష్ట్రంలో రచయితలవి రచనల విషయంలోనే కాదు చర్చల్లో సైతం వేరు కుటుంబాలే. కవులు పొరపాట్నయినా కథకుల సమావేశాలకి వెళ్ళరు. కథకులు, కవుల జోలికి రారు. వీరిరువురూ నాటకాల వాళ్ళ దగ్గరికి పోరు. నాటకాల వాళ్ళు కవుల ఛాయలకి రారు. ఇది

అధిక శాతానికి సంబంధించిన భోగట్టా. అలాగే ఆధునిక సాహిత్య విమర్శలో సంగీత, చిత్ర లేఖనాలకి, సాహిత్యానికీ బొత్తిగా సంబంధం లేనట్టే వుంటాయి. ఇందుకే కాబోలు పాపినేని శివశంకర్ మాట్లాడుతూ సాహిత్య విమర్శ అంటే కేవలం కవిత్వ విమర్శగా సాగిపోతోందని చురక అంటించారు. మొత్తానికి ఈ సదస్సులో పై విధమైన అడ్డుగోడలు మోసుకు వచ్చిన వారు లేరనే చెప్పాలి.

కథ శైలి, సంవిధానం గురించి, ప్రచురణ దశలో అవస్థలు, సత్కథకులు పెన్నుమూసి కూర్చున్న కారణ కారణాంతరాలు పాఠకులు ఆశించే స్థాయి విశేషాలు, ప్రాంతీయత, మాండలీక కథలపై అపప్రథలు, విమర్శ ఉనికి, రీతి రివాజు, సంపాదక సాధక బాధకాలు, సంపాదక మిత్రులే రచయితలు, స్త్రీవాద ప్రభావం, సంకలనాలు, తిరిగొచ్చే కథలు (అచ్చయినవే కథలా సామి) దారీ తెన్నూలేని వాణిజ్య వినియోగదారుని కోవలోకి చేరే కథలు మొదలయినవి ప్రధానాంశాలుగా ప్రశ్నోత్తరీయం సాగింది.

సుదీర్ఘ ఉపోద్ఘాతానంతరం సోమర్ సెట్ మాఘుడు 'బట్ దిసి కాల్ బైదిబై' అని అసలు కథ కొచ్చినట్టు సదస్సులో పాల్గొన్న రచయితలు వ్యక్తం చేసిన అభిప్రాయాల సారాంశాలు ఇలా వున్నాయి.

తమ వంటి కొందరు నేడు కథలు రాయకపోవడానికి కారణం వ్యవస్థ మార్పునకు అనుగుణంగా తమని తాము మలుచుకోలేక పోవటంవల్ల, కొన్ని రాజకీయ సిద్ధాంతంగల పత్రికల పద్ధతి వల్లా కథలు రాయడం మానుకుంటున్నానని శీలా వీర్రాజు అంటారు. వయస్సు మళ్ళితే చాలు ఒకనాటి యవ్వనంలో వున్న గుండె నిబ్బరం ధైర్యం సడలి చప్పబడి కథ రాయలేకపోవడం, అన్నిటికీ సర్దుకుపోయే తత్వం ఏర్పడ్డం సైతం రచయితలు నేడు కథలు

రాయలేకపోవడానికి కారణాలు అని శ్రీ సుభా అంటారు.

పబ్లిషర్‌లను బట్టి మంచి కథలు వస్తాయని అవసరాల రామకృష్ణారావు గారంటే, అసలు పతనం అన్నది రచయితల్లోను, పాఠకుల్లోను వుందంటారు వాకాటి. మరి మంచి కథ అన్నది మంచి విమర్శ మీద కూడా ఆధారపడి ఉంటుంది. కవిత్వంపై వచ్చినంతగా కథా సాహిత్యంపై విమర్శకులు రాయడం లేదని మధురాంతకం అంటారు. మంచి కథలు సరే, అసలు పత్రికలకి కథలే అక్కరలేదు. సెక్స్ నింపే పత్రికలకి, ఆ కథలకీ విమర్శలు కూడా దేనికని ప్రశ్నిస్తూ కథకుడు ఏ ప్రాంతం వాడయినా, ఏ సిద్ధాంత ప్రభావం ఇష్టపడినా, ఏ రాజకీయ దృష్టి వున్నా ముందసలు అర్ద్రత పలికే వాక్యం, చక్కని వాక్యం, గంధకపు ఘాటు వంటి, విద్యుద్ఘాతం వంటి అనుభూతి పలుకగల వాక్యం రాయడం రానప్పుడు ఎవరు ఏ వస్తువు, ఏ ఇతివృత్తం తీసుకున్నా వాటి ప్రయోజనం, ఫలితం నిరర్ధకమై, నిస్సారమవుతాయని డి. వెంకటరామయ్యగారన్నారు.

కథ సంకలనాలు, మంచి కథలూ అన్న అంశం చర్చిస్తుండగా ప్రాంతీయ కథా సంకలనాలను ఆహ్వానించవచ్చునా? అన్న ప్రశ్న ఎలాగో వచ్చింది. యువ కవి జగన్ రెడ్డి గారు లేచి ఆవేశం పాలు రంగరించి తెలంగాణా కథకుల సంకలనాలు లేకపోవడానికి గల కారణాలు, నేపథ్యం చెప్పేందుకు ప్రయత్నించారు. ఆ అంశాన్ని జ్వాలాముఖి కలుగజేసుకొని ఒక్కో ప్రాంతంలో ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతంలో జనజీవన దారుణ దృశ్యాల్ని, నిత్య జీవయాత్రలో మనిషి ప్రతిస్పందననూ చిత్రించవలసిన ఆవశ్యకత ముఖ్యం అంటూ విశ్వశ్రేయస్సు కోరే కథలు కావాలన్నారు జ్వాలాముఖి.

వీరాజీ గారేమో కులాల్లాగానే ప్రాంతీయ కథలంటూ విభజన

తేవద్దండీ అని మంచి కథకు ప్రాంతీయత లేదని, కథ బాగా రాస్తే ఆ కథల మాండలీకం కూడా పాఠకుడికి సజావుగా చేరుతుందనీ అన్నారు. పురోగమనం, సామాజిక స్పృహ గల మంచి కథలు ప్రజలకి చేరవేసేందుకు సంకలనాలు రావాలి గానీ ప్రాంతీయత పేరిట కథా సంకలనాలు రావడం హర్షణీయం కాదంటారు కళాకారుడు, కథకుడూ చంద్ర. పాఠకుడిని హత్తుకునే అంశం అంటూ వుంటే కథ ఏ ప్రాంత నేపథ్యాన్ని చెబుతున్నా సరే, ఆ నేపథ్యంలోకి పాఠకుడు ప్రయాణించగలడని విహారి వివరణ. సామాజిక నేపథ్యం బట్టి వస్తువుంటుందని, ఈ నేపథ్యాన్ని బట్టి వస్తువు మారుతుంటుంది. కథకి సంఘటన ముఖ్యం కాదిప్పుడు అంటూ మాడలీకంలో కథలు రాయడం ఆరోగ్యకరమేనన్నారు వాసిరెడ్డి నవీన్.

చర్చలో ఇంకో మలుపు... స్త్రీ వాదం కవిత్వంలో వున్నంతగా కథా సాహిత్యంలో లేదని, రావాలనీ, ఐతే ఇప్పటివరకు గురజాడ, చలం, ఆచంట శారదాదేవి, అబ్బూరి ఛాయాదేవి వంటి కథకులు స్త్రీవాద భావాలతో రాసినప్పటికీ స్త్రీవాద తాత్విక దృక్పథంగల రచనలు రావడంలేదని, మంచి స్త్రీవాద కథలు రాయాలనీ అన్నారు ఓల్గా. ఇక ఓల్గా వంటి రచయిత్రుల కథలు స్త్రీని వివరించడంలో ఎంతో పదునుగా రాస్తున్నారు. ఒక వల్గారిటీ ధోరణి మార్చుకుంటే కొత్తగా రాస్తున్నవాళ్ళ కథలు బాగుంటాయని అబ్బూరి ఛాయాదేవి చెప్పారు.

కథ శిల్పం, శైలి గురించిన ప్రస్తావన... పాత కథలు నేడు తిరిగి చదువలేకపోతున్నామా? పూర్వ కథల కంటే నేటి కథల్లోనే సామాజిక, మానసిక చిత్రణ బాగుంటున్నది అంటారు పోలా ప్రగడ సత్యన్నారాయణమూర్తి.

శైలి, శిల్పం, పరుగు, పేకా చదివించగలగడమే శైలి... విహారి.

నాటి కథ సాంఘిక దురాచారాల మీద, నేటి కథ సాంఘిక

అసమానతల మీదా- కనుక సమాజ దుస్థితిని బట్టి, స్పృహని బట్టి మంచి కథ, మంచి శైలీ వస్తాయి. శైలి విషయానికొస్తే ఇటీవల కె.వై.ఎన్. పతంజలి ఫేంటసీ రియాలిటీ కలిసి రాసిన కథా శైలి బహు బాగుంది-

మొత్తం మీద దేవుడి తిరగలి బహు నింపాదిగా తిరుగుతుంది. అందులో నలిగేది బహుస్వల్పం అని సోమర్‌సెట్ మాఘం అన్నట్టు....దంచింది, నలిగింది తక్కువే కాని అక్కడి కది ప్రారంభంగా భావించాలి.

అదే ఆదివారం సాయంత్రం శ్రోతలు అలసిసొలసిన వేళ వేదగిరి రాంబాబు 'వయసు కథలు' **ఈ కాలమ్ కథలు** వేదగిరి రాంబాబు, మైనంపాటి భాస్కర్ రాసిన విముక్తి, వీరిరువురితో బాటు శివకుమార్, ప్రతాప రవిశంకర్, తులసి బాలకృష్ణ, పి.ఎన్. నారాయణ కథలున్న 'కస్తూరి' విడుదలయ్యాయి. వేదికమీద కాళీపట్నం రామారావు, మధురాంతకం, విహారి, ఆదివిష్ణు, వీరాజీ వంటి కథా రచయితలు రాంబాబును అభినందిస్తూ అతని వ్యక్తిత్వాన్ని, గుణగణాల్ని విప్పిచెప్పారు. దండల పండుగ జరిగింది.

చివరికి ఒక సాహిత్య చర్చ, ఒక సదస్సు మరింత అర్థవంతంగా జరగడానికి కొత్త రచయితకు, సాహిత్య విలువలు కోరే పాఠకులకూ ప్రయోజనకరంగా వుండే సదస్సులు ఎలా జరపాలో తెలుసుకోవడానికి మొన్న జరిగిన సదస్సు మరొక మాంచి సూచన అన్నట్టు భావించాలి. ఈ అభిప్రాయాన్నే రచయితలు అనేక మంది వ్యక్తం చేశారు. తెలుగు కథ, సంరక్షణ కోసం మనస్సుపడ్డ వారెందరో ఈ సదస్సుకు రావడం ఒక మంచి సూచన. ఫలితం ఇక మామూలుగానే పత్రికల మీదా, రచయితల మీదా, పాఠకుల మీదా ఆధారపడి ఉంటుంది.

**-శివాజీ**

**(ఉదయం 21.2.94)**

# స్ఫూర్తి నిచ్చే సదస్సు

సహజంగా కథారచన మీద సభ అంటే ఉపన్యాసాలు, సెమినార్, అంటే పేపర్లూ ఉంటాయి. కానీ ఈ మధ్య నగరంలో సాధన సాహితీ స్రవంతి, 'రచన' మాస పత్రిక కలిసి ఏర్పాటు చేసిన కథా రచన సదస్సు విభిన్నంగా, మరింత లైవ్లీగా జరిగింది. ఇష్టాగోష్టి అని అన్నా చాలా మంది రచయితలు కలిసి చాలా సేపు ఇష్టమైన వాటితో పాటు, కష్టం కలిగిస్తున్న విషయాల గురించి కూడా మనసు విప్పి మాట్లాడుకున్నారు. తమ తమ ఫ్రస్టేషన్స్‌ని, వ్యక్తిగత బందిఖానాలన్నీ పరస్పరం వివరించుకుని సాంత్వనం పొందారు. మనసుల్ని తేలిక పరుచుకున్నారు. పెద్ద సంఖ్యలో ఎందరో రచనాభిలాషులు రావటమే కాక చాలా గంటల సేపు కార్యక్రమంలో పాల్గొనటమే కాక కార్యక్రమానంతరం కూడా ఒకరిని మరొకరు విడవలేనట్టు మరింత సమయం కలిసి గడిపారు. రచన పత్రిక శాయి, సాధన సాహితీ స్రవంతి, వేదగిరి రాంబాబు పుస్తకావిష్కరణ... ఇలా అందరి కలయిక వల్ల జరిగిన ఈ సమావేశం, సరైన సాహితీ వాతావరణం కోసం ఎంతగానో తపించిపోతున్న చాలామందికి రిలీఫ్‌ని, ఉత్సాహాన్ని పునరుత్తేజాన్ని అందించింది.

ఈ సమావేశంలో ముఖ్యంగా చెప్పుకోవాల్సినవి కనిపించిన అంశాల్లో కొన్ని:-

ఏ రచయితని ఏ ప్రశ్న అడిగితే సబబో చక్కగా నిర్ణయించి అలా సమావేశాన్ని చాలా బాగా నిర్వహించిన విహారి తీరు.

ఎప్పటిలాగే శ్రీ కాళీపట్నం మాస్టారి మెత్తటి, చక్కటి పలుకులు.

కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి పొందిన సందర్భంలో విచ్చేసిన మధురాంతకం రాజారాం వారి వ్యక్తిగత సాహితీ జీవితాల సాదా సీదాతనపు సమాచారం చాలా మంది కథకులకి ఈ సమావేశం ద్వారా తిరిగి అందటం.

కొద్ది మాటలలో ఎంతో విషయాన్ని ఒక సాహితీ కేప్సూల్‌లా అందించిన శ్రీ వాకాటి పాండురంగారావు గారి మాటలు.

రచన పత్రికని ఏ రకమైన వ్యవస్థాగత అండ దండలూ లేకుండా, వ్యక్తిగత కృషితో నడుపుతూ, ఆ పత్రిక తాలూకు సాధకబాధకాల్ని చర్చించి తగిన సహాయం పొందాలన్న (పత్రికకి చందాదారులని చేర్పించి) ఉద్దేశంతో తాపత్రయపడిన శ్రీ శాయి, దానికన్నా రచన స్థాయి మంచి చెడులకే ప్రాధాన్యత నిచ్చిన అతని మంచితనం.

సమావేశాల్లో అరుదుగా కనిపించే శ్రీ సి. రామచంద్రరావు, శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాధరావు లాంటి చాలా మంది రచయితలు ఒకచోట కొన్ని గంటల సేపు సుదీర్ఘంగా కలిసి కనిపించటం.

వీరందరినీ చూస్తూ ఈ మధ్యనే రచనా రంగంలోకి దిగిన చాలామంది యువతీ యువకులు మంచి సాహితీ కళ్యాణంలో పాల్గొన్నట్టు మురిసిపోవటం.

గతంలో విరివిగా కథలు రాసిన కథకులు కొందరు ఈ మధ్యన ఎందుకు రాయటం లేదు? అన్న అంశానికి కాళీపట్నం మాస్టారు ఇచ్చిన వివరణ, విశ్లేషణ, దాంతోపాటు ఆయన ఇప్పటికీ కథలు రాయాలనే ఉంది' అన్న ఆయన ఆశలో చాలా మంది రచయితల అంతరంగం ప్రతిబింబించటం, మంచి కథలు రాయమని, అలా రాసిన కథల్ని మంచి పత్రికలకి అందించి వాటిని సజావుగా నడిచేలా

చెయ్యమని ఆయన చేసిన అభ్యర్థన.

కథలకి వేసే బొమ్మల విషయంలో తన దృష్టిని వివరించిన చంద్ర, తమకి ఏమి కావాలో ఏమి వద్దో చెప్పిన పాఠకులు. కథా రచనకి సంబంధం లేకపోయినా అవసరమైన ఇతర విషయాల్ని చర్చించిన సందర్భాలు. ఇలా ఒక నూతన పంథాలో సాగిన సమావేశం ఇది. పుస్తకాల అమ్మకం, కొన్ని అంశాల మీద సంతకాల సేకరణ లాంటి ఇతర కార్యక్రమాలూ జరిగాయి.

ప్రయోజనమే కాదు, ప్రమోదాన్ని కూడా కూర్చిన సమావేశం ఇది. ఈ సమావేశంలోని సాహితీ రుచి తృప్తిగానే కాదు, తిరిగి ఉత్సాహంగా ఎదురు చూసేలా వుంది.

స్వలాభం ఉద్దేశం కాకుండా, ఇష్టమే ప్రధానంగా పలువురు కలిసిన ఈ సమావేశంలోని నిజం, నిజాయితి చాలా మందిని మరింతగా కార్యోన్ముఖుల్ని చేస్తుంది.

**వి. రాజారామ మోహన్‌రావు**

**(ఉదయం 21.2.94)**

# మంచి కథలున్నాయి కనుక్కోండి చదవండి-నోరువిప్పి చెప్పండి

ఈ మధ్య నగరంలో సాధన సాహితీ సమితి-'రచన' సంయుక్తంగా ఏర్పాటుచేసిన'కథా సదస్సు' లో నేను కూడా పాల్గొన్నాను. అంత మంది రచయితల్ని ముఖ్యంగా సీనియర్ రచయితల్ని ఒకచోట చేర్చి అంతసేపు బోర్ కొట్టకుండా సదస్సు నిర్వహించిన నిర్వాహకుల్ని అభినందిస్తున్నాను. ఇలాంటి సదస్సులు మరిన్ని ఇక ముందు జరగాల్సి ఉంది. జరిపిస్తారని ఆశ.

సీనియర్ కథా రచయితల్ని "మీరు కథలు రాయకపోవడానికి కారణం ఏమిటి?" అని సదస్సు నిర్వహించిన శ్రీ విహారి గారు అడిగారు. రచయితలు తమకు తోచిన సమాధానాలు చెప్పారు.

ఈ విషయమ్మై కొంత చర్చిస్తాను.

పూర్వకాలం నుంచి తెలుగులో మంచి పత్రికలూ, మంచివి కాని పత్రికలు ఉన్నాయి. మంచివికాని పత్రికలంటే సెక్స్, క్రైమ్ ప్రచురించే పత్రికలని స్థూలంగా అనుకుందాం. పూర్వకాలంలో కుటుంబ పత్రికలతో పాటు -సెక్స్ పత్రికలు వేరే ఉండేవి. కొందరు అవి, కొందరు ఇవి -కొందరు అవి, ఇవి కూడా చదువుకునే వారు. రాను రాను ఆ పత్రికల మధ్య ఉండే గీత చెరిగిపోయింది.(కొన్నిటి విషయంలో మాత్రమే!)

మొదట్లో కుటుంబ పత్రికల్లా మొదలైనవే అమ్మకాలు పెంచుకోవాలనే ఉద్దేశ్యంతో సెక్స్‌ని, క్రైమ్‌నీ ప్రవేశపెట్టాయి. దానివల్ల అవి అనుకున్న సత్ఫలితాలు సాధించాయి. కాని కొన్ని పత్రికలైనా

మడికట్టుకుని కూర్చున్నాయన్న విషయం ఒప్పుకోక తప్పదు. సెక్స్, క్రైమ్ ప్రచురించే పత్రికలు కూడా మంచి కథలు వెయ్యడం పూర్తిగా మానలేదు. ఆ ఛానల్ వేరుగా, ఈ ఛానల్ వేరుగా ప్రచురిస్తూనే ఉన్నాయి. పోనీ వాటి విషయం పక్కన బెడితే పూర్తిగా మంచికథలు మాత్రమే ప్రచురించే పత్రికలున్నాయి. మంచి కథలు రాద్దామనుకునే లబ్ధప్రతిష్టులైన రచయితలు ఈ పత్రికల్లో రాయవచ్చుకదా!

అంటే మంచి పత్రికలు లేవు కాబట్టి రాయడం లేదన్న వాదనలో పసలేదు.

ఒకనాటి సాంఘిక, సాంస్కృతిక వాతావరణం లేదు. అందువల్ల రాయలేక పోతున్నామన్నది మరొక వాదం. ఒక శతాబ్దమో, అర్థ శతాబ్దమో, లేదా ఒక దశాబ్ధమో తీసుకుంటే ఎపుడూ ఒకే రకమైన సాంస్కృతిక, సామాజిక వాతావరణం ఉండదు. సంస్కృతి, సమాజమూ నిరంతరం మార్పు చెందుతూ ఉంటాయి. నా చిన్నతనం నాటి విలువలు ఇప్పుడు లేవు. అంటే ఈ కాలంలో అసలు విలువలు లేవని కావు. పాత విలువల స్థానంలో కొత్త విలువలు పుడుతూనే ఉంటాయి. మరి కొన్నాళ్ళకి ఈ విలువలూ ఉండకపోవచ్చు. ఒకప్పుడు అవిభక్త కుటుంబాలుండేవి. ఇప్పటి కాలమాన సాంఘిక, ఆర్థిక పరిస్థితుల వల్ల అవిభక్త కుటుంబాలు లేవు. అంత మాత్రం చేత విలువలు పడిపోయాయనుకోకూడదు. వేరు వేరుగా ఉంటూ కష్టాలు, సుఖాలు వచ్చినపుడు కల్సి అనుభవించే కుటుంబాలు చాలా ఉన్నాయి.

మారుతున్న సాంఘిక, సాంస్కృతిక వాతావరణాన్ని అధ్యయనం చెయ్యడం, ప్రతిస్పందించడం రచయిత బాధ్యత. అలా చెయ్యలేకపోవడం వైఫల్యం కింద లెక్క. మన దేశస్తులకి ముఖ్యంగా మన తెలుగువారికి ఓ చిత్రమైన మనస్థత్వం ఉందనిపిస్తుంది.

"నేటికంటే నిన్న గొప్పది" అన్న మనస్తత్వం

"మా రోజుల్లో గొప్ప కథలు వచ్చాయి. మా రోజుల్లో అన్నీ గొప్ప" అన్నది కొంతమంది వాదన.

మిగతా కళారూపాల మాట అటుంచితే - తెలుగు కథ విషయంలో మనం 'నీరస గంగాధరాలు' అయిపోవల్సిన అవసరం లేదని నేను భావిస్తాను. కొంతమంది పడక్కుర్చీ మేధావులుంటారు. వారు పత్రికలు చదవరు. కథా సంపుటాలు చదవరు. వాళ్ళు వయసులో ఉన్నపుడు చదివిందేదో అదే! కొత్త రచయితల గురించిగానీ, కొత్త కథల గురించిగాని వారికే మాత్రం అవగాహన ఉండదు. కానీ పడక్కుర్చీలో కూర్చొని "సాహిత్యమంతా భ్రష్టు పట్టిపోయిందని, మంచి కథలు రావడంలేదనీ" స్టేట్ మెంట్లిచ్చేస్తుంటారు. వీరివల్ల కథా సాహిత్యానికి ఒరిగేదేమీ లేదు సరికదా - బోల్డంత హాని మాత్రం జరుగుతోంది

ఒకప్పుడు ఉధృతంగా రచనలు చేసి తర్వాత తర్వాత మానెయ్యడానికి స్థూలంగా ఇవి కారణాలని నా ఉద్దేశ్యం. అన్ని కారణాలు అందరికీ వర్తించకపోవచ్చు. కొందరికి కొన్ని కారణాలు వర్తించవచ్చు.

వయసంత ఉన్నపుడు ఉండే చేవ, ఒడుపూ వయసు మీరే కొద్దీ లేకపోవడం.

తనకు తెల్సిన విషయం లేదా తాను కనుగొన్న విషయం మరొకరికి చెప్పాలనే తపన తగ్గిపోవడం.

రచయితల్లో ఎక్కువమంది మధ్యతరగతి వాళ్ళు. ఉద్యోగస్తులు కావడంవల్ల కుటుంబ బాధ్యతలు, బాధలు పెరిగి కళాత్మక దృష్టి

కళాత్మక హృదయం తగ్గిపోవడం.

మనం రాసి సాహిత్యాన్ని, ప్రపంచాన్ని ఏం ఉద్ధరించాలి-అనే నిరాశ కలగడం.

భక్తి మార్గంలో వేదాంత మార్గంలో పడి మనం రాసేదంతా నిరుపయోగం, నిర్జీవం అనిపించడం.

కొత్తగా రాస్తున్న కథలు చదివి పోటీపడలేం అనే భావం కలగడం లేదా 'కొత్తగా రాస్తున్న వారి రచనల్లో పసలేదు' ఇలాంటి కాలంలో మనం రాయడం ఎందుకులే అనే నిర్వేదం చెందడం.

మా తాతలు నేతులు తాగారు - అన్న ధోరణిలో ఆ కాలంలో గొప్ప పత్రికలు, గొప్ప రచనలు ఉండేవి. విలువలు పడిపోయాయి.... అనుకోవడం

రచయితకి ముఖ్యంగా కావాల్సిన స్పందన, ప్రతిస్పందన చచ్చిపోవడం.

రచయిత కుండే (చాలా మంది ఉద్యోగస్తులు) కాస్త సాయం సమయమూ వేరే పనులకో, వ్యసనాలకో ఖర్చు చెయ్యడం.

నానా కష్టపడి కథ రాస్తే వచ్చేది వందో, నూట యాభయ్యో - దీనికోసం తపన ఎందుకు అనుకోడం (సీరియల్ కథా రచయితలు కూడా ప్రతిఫలం ఆశిస్తారు అందులో తప్పులేదు)

ఉన్న కాస్త సమయాన్ని చదువుకోడానికో, సినిమా, టీ.వీ లాంటి వాటికి రచనలు చెయ్యడానికో ఉపయోగించడం.

నేను ప్రపంచానికి చెప్పాల్సింది చెప్పేస్తాను. ఇంకేం లేదు అనుకోడం.

కొందరు రచయితలు పత్రికల్లో ఉద్యోగాల్లో చేరి వృత్తి వ్యావృత్తి ఒకటే కావడంవల్ల కలాలు మూసెయ్యడం.

తాము రాయకపోవడానికి పత్రికలు, పాఠకులు కారణం అని రచయితలంటే అందులో నిజాయితీ లేదని నేను భావిస్తాను.

పేర్లు చెప్పను గాని (వారి అనుమతి లేదు కాబట్టి) ఆ మధ్య ఓ ఇద్దరు రచయితల్ని "మీరెందుకు రాయడం లేదు" అనడిగాను. ఇద్దరూ నిజాయితీగా సమాధానం చెప్పారు.

ఒకరు - "నా దగ్గర సరుకైపోయింది. ఏ పత్రిక వారైనా అడిగితే కాస్త అవస్తపడి రాయాల్సి వస్తోంది" అన్నారు.

మరొకరు-"వాళ్ళిచ్చే వందా, వందా యాభైకి అంత శ్రమ పడదల్చుకో లేదు. ఆ టైం ఖర్చు చేసి టి.వికి రాసుకుంటే బోలెడు డబ్బు వస్తుంది" అన్నారు.

కొన్ని మంచి కథలు, కొన్ని మామూలు కథలు, కొన్ని చెడ్డ కథలు వస్తున్నాయన్నది మనం గ్రహించవచ్చు. మంచి కథల సంఖ్య పెరగకపోవచ్చు. కానీ అసలు మంచి కథలే రావడం లేదన్నది ధృతరాష్ట్ర దృష్టి అవుతుంది.

అసలు ఏది మంచి కథ? ఏది గొప్ప కథ?

వెనకెప్పుడో శ్రీ మధురాంతకం రాజారాం గార్ని 'రంజని' సభలో "ఏది మంచి కథ?" అనడిగారు. "పదిమందికి మంచి చెప్పేది, పదిమంది మంచి కోరేది మంచి కథ" అని ఆయన సమాధానం చెప్పారు. అలాగే ఒక ఇంటర్వ్యూలో శ్రీ పురాణం వారు "కావాలని ఎవరూ గొప్ప కథలు రాయరు. ప్రతి రచయిత మంచి కథ రాయడానికి ప్రయత్నిస్తాడు. కాలం దానికి గొప్పదనం

ఆపాదిస్తుంది" అన్నారు. ఈ రెండూ నిర్వచనాలని ఆమోదిస్తే- ఈ నాడు మంచి కథలు వస్తున్నాయని మనం నిస్సందేహంగా ఒప్పుకోవచ్చు. తర్వాత కాలం వీటిలో కొన్నిటికి 'గొప్పదనం' ఆపాదించనూ వచ్చు. మనం రాయడం లేదన్నంతమాత్రాన మంచి కథలు రావడం లేదని స్టేట్‌మెంట్ ఇవ్వడం భావ్యం కాదు. ఇలాంటి ప్రకటనలు చేసే వారు ఇపుడు పత్రికల్లో వస్తున్న కథల్నిగాని, సంపుటాల్లో వస్తున్న కథల్ని గాని చదవడం లేదన్నది మనకర్థమౌతోంది. చదవక పోవడం వారికున్న హక్కు. చదవకుండా స్టేట్‌మెంట్లిచ్చే హక్కు మనకెవరికీ లేదు.

సీమ కథలు, తెలంగాణా కథలు, కళింగ కథలు -ఇలా ప్రాంతాల పేరుతో కథా సంపుటాలు రావడం హర్షణీయమా -అనే ప్రశ్న సదస్సులో వచ్చింది. దాని మీద ప్రముఖులు వారి వారి అభిప్రాయాలు చెప్పారు. ఒక ప్రాంతపు సమస్యల్ని అక్కడి జీవితాన్ని ముఖ్యంగా ఆ నేపథ్యాన్ని తీసుకుని కథలు రాసి వాటిని ఆ ప్రాంతపు కథలుగా ప్రచురిస్తే అందులో ఆక్షేపణ లేదు కానీ-ఒక ప్రాంతపు నేపథ్యం లేకుండా- ఆ ప్రాంతంలో పుట్టిన రచయితలు కథలు ఒక సంపుటిగా తీసుకురావడం హర్షణీయం, సమర్థనీయం కాదు. మనకి రాజకీయ వాదులు కల్పించిన కుల, మత, ప్రాంత వర్గ విభేదాలు చాలు - మనం మరిన్ని చీలికలు తెచ్చుకోవడం ఎందుకు?

కవిత్వం మీద వస్తున్నంతగా కథల మీద విమర్శ రావడం లేదు - ఎందుకు? - అన్న ప్రశ్నకి...

తెలుగులో ఎక్కువ భాగం ఉన్నది సాహిత్య సమీక్ష.విమర్శ ఎక్కడుంది? ఆ మధ్య తెలుగు కవుల్లో రెండు వర్గాలు ఏర్పడినట్టు బాహాటంగా తెల్సింది. ఒక వర్గం హైద్రాబాద్‌ది, మరొకటి విజయవాడది. ఈ రెండు వర్గాలు ఒకర్నొకరు దెప్పుకోడం, సూటిపోటి మాటలనుకోడం లాంటివి జరిగి వాటి తాలూకు మంటలు లేచి చల్లారి పోయింది. ఇందులో Clashes of Egos తప్ప పెద్దగా సైద్ధాంతిక విభేదాలు ఉన్నట్టు గోచరించదు. దీన్ని తోటి కోడళ్ళ

తగువులా తీసుకోవాలే తప్ప-విమర్శగా తీసుకోవల్సిన అవసరం లేదు.

పోతే 'చేరాతలు' మాత్రం తెలుగు కవిత్వాన్ని కొన్నిమెట్లు పైకి తీసుకెళ్ళింది. స్త్రీవాద కవిత్వం గురించి కూడా ఆ మధ్య ఓ చిన్నదుమారం లేచి సద్దుమణిగింది. అపుడపుడు పత్రికలు సృష్టించే Contraversies మాట మామూలే! ఏదైనా ఒక దినపత్రిక (ఆదివారం అనుబంధంలో) గానీ, ఒక వారపత్రికగాని అలాంటి బలమైన శీర్షిక 'కథ'కు ప్రారంభిస్తే తెలుగు కథకు కొంత చేవ, జవసత్వం చేకూరుతాయి. కథా సంపుటాల ప్రచురణ గురించి కూడా చర్చ వచ్చింది. కథలతో పోలిస్తే కవితా సంపుటాలు ఎక్కువగా వస్తున్నాయన్నది అందరికీ తెల్సిన విషయం. కానీ కథా సంపుటాలు వెయ్యడానికి పబ్లిషర్లు ముందుకి రానట్టే కవితా సంపుటాలుకీ రావడం లేదు. కథకులు స్వంతంగా వేసుకుంటున్నట్టే కవులు కూడా స్వంతంగా ప్రచురించుకుంటారు. (కవిత్వం ప్రచురణలు పేరుతో శ్రీ త్రిపురనేని శ్రీనివాస్ గారు చాలా కవితా సంపుటాలు ప్రచురించారు. ఆయన్ని వృత్తి ప్రచురణ కర్తగా భావించడానికి వీల్లేదు. కవిత్వం మీదున్న మమకారం కొద్దీ అవి ప్రచురించారని భావిస్తున్నాను).

ఏతా వాతా చెప్పేదేమిటంటే-

'తెలుగు కథ వెల వెల బోతోంది. అనుకోడం తప్పు అభిప్రాయం. మంచి కథను గుర్తించే తీరుబాటు, కీర్తించే అలవాటు మనకి లేదు. అది దాచుకోడానికి వేరే 'శషభిషలు' ఎందుకు? కథా రచయితలు-ముఖ్యంగా సీనియర్ కథా రచయితలు చెయ్యాల్సిన పని-మంచి కథలు వస్తున్నాయి-చదవడానికి ప్రయత్నించండి, చదివి ఊరుకోకండి, ఆ రచయితకో, ఆ కథ ప్రచురించిన పత్రికకో మీ అభిప్రాయం ఒక్క లైను కార్డుమీద రాయండి.

ఆ ఒక్క లైను 'తెలుగుకథ' కు వెయ్యేనుగుల బలం చేకూరుస్తుంది. శుభం భూయాత్!

-వీరభద్రరావ్ పమ్మి

(ఉదయం 07-9-94)

# కథ గురించి, పత్రికల ప్రోత్సాహం గురించి రచయితల అభిప్రాయాలు

రెండు నెలల క్రితం ఫిబ్రవరి 13 వ తేదీన కథా రచన సదస్సు జరిగిన సందర్భంలో తెలుగు కథ మీద రచయితల, రచయిత్రుల అభిప్రాయాలని సరాసరి, కారణాంతరాల వల్ల రాలేక పోయిన రచయితల అభిప్రాయాల్ని పోస్ట్‌ద్వారా సేకరించాం.

చాలామంది నిర్మొహమాటంగా తమ అభిప్రాయాల్ని తెలియజేసారు. వాటిని యధాతధంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము.

కథలు ఎందుకు రాస్తున్నారు? ఎందుకు రాయడం మానేశారు? ఇప్పుడొస్తున్న కథల మీద అభిప్రాయాలేమిటి? కథా ప్రాచుర్యానికి పత్రికల నుండి ఎటువంటి సహకారం లభిస్తోంది? మొదలైన ప్రశ్నలకు రచయిత, రచయిత్రుల నుండి లభించిన జవాబుల్ని మీరూ చదవండి.......

(ఇందులోలేని రచయిత, రచయిత్రులందర్నీ కూడాపై విషయాలలో అభిప్రాయాల్ని తెలుపమని కోరుతున్నాము. పునర్ముద్రణలో వాటిని కలుపుతాం)

**అబ్బూరి ఛాయాదేవి**

నాకు తోచిన అభిప్రాయాలను పాఠకులతో పంచుకోవడానికి - 1952 నుంచి రాస్తున్నాను.

ఇప్పుడు వస్తున్న కథల్లో కొన్ని కథలు చాలా బావుంటున్నాయి... కథా వస్తువు పరంగానూ, శైలిపరంగానూ-కథా రచయితల వయస్సుతో నిమిత్తం లేకుండా, కానీ కొన్ని పత్రికల్లో వచ్చే కథల్లో శృంగారమే ప్రధాన విషయంగా ఉండటం వల్ల అశ్లీలత

ఎక్కువగా ఉన్నట్లు తోస్తోంది. భాష కూడా, సున్నితంగా ఉండటం లేదు, కథలు కళాత్మకంగా ఉండటం లేదు. అనేక కథల్లో హింస కూడా ఎక్కువగా ఉండి వెగటు కలిగిస్తున్నాయి. చదవాలనే ఉత్సాహం తగ్గుతోంది.

కథలకు ప్రాచుర్యం అన్ని పత్రికలూ ఇస్తున్నా, కొన్ని పత్రికలు శృంగారానికీ, హింసకీ ఎక్కువ ప్రాచుర్యాన్నిస్తున్నాయి. ఈ ధోరణి మారాలి. మంచి కథలకు ఇచ్చే పబ్లిసిటీ కన్న 'పాపులర్' గా రాసేవారి కథలకే మరీ ఎక్కువ పబ్లిసిటి ఇస్తున్నారు. ఇది కొంతవరకూ అవాంఛనీయం.

పేరు పొందిన కథా రచయితలకు పత్రికలలో రాసే అవకాశాన్ని ప్రత్యేకంగా ఇవ్వాలి. అంతే కాని, ఎంత పేరు పొందిన వారి కథలైనా మాకు నచ్చితేనే వేసుకుంటామని ప్రకటించడం భావ్యంకాదు. ఆ హక్కు సంపాదకులకు ఉంటుందనేది అందరికీ తెలిసిందే. కానీ ఆ విధంగా ప్రకటించడం ఒక విధమైన నిరాసక్తినీ, నిరుత్సాహాన్ని కల్గిస్తుంది. కొందరు సంపాదకులకు పాజిటివ్ అప్రోచ్ ఉండాలి. ప్రయోగాత్మకంగా రాసే అవకాశాలను కల్పించాలి. రచయితలను ప్రోత్సహించాలి. పెద్ద రచయితలు రాసే చిన్ని కథలను (నిడివి ఉంటేనే మంచి కథ అవదు) కూడా ప్రోత్సహించాలి.

**అక్కినేని కుటుంబరావు**

రాయకుండా వుండలేక -1969 నుంచి రాస్తున్నాను.

ఇప్పుడొస్తున్న కథల మీద మంచి అభిప్రాయమేవుంది.

రెండు మూడు పత్రికలు తప్ప మిగతావి కథలకి సరైన సహకారం ఇవ్వటం లేదు.

మంచి కథల్ని గుర్తించి వాటికి ప్రచారం ఇవ్వడం, సంకలనాలు తేవడం, అనువాదాలు చేయించడం లాంటి బాధ్యతలు తీసుకుంటే బాగుంటుంది.

**అల్లం రాజయ్య**

సమాజంలో కలువడానికి, నేను సమాజం నుండి పొందిన దానిని వ్యక్తం చేయడానికి 1970 నుండి కథలు రాస్తున్నాను. 1975 నుండి అచ్చయ్యాయి.

అస్థిత్వంలో ఉన్న భావజాలాన్ని మాత్రమే రచయితలు రాసే స్థితి నుండి, సమస్త, సామాజిక మూలాలను అన్వేషిస్తూ ఇప్పుడు కథలొస్తున్నాయి. ఈ అన్వేషణ ఇటీవలే మొదలయ్యింది. ఇది మరింత విస్తృతమై రచయితలు తమ కాలాన్ని సంపూర్ణంగా చిత్రించగలరనే విశ్వాసం.

రచయితలు వర్తమానంలో నుండి భవిష్యత్తును చూస్తారు. అస్థిత్వంలో ఉన్న సమాజంతో పోరాడుతారు. పత్రికల్లో చాలా భాగం అస్థిత్వంలో ఉన్న భావజాలానికే కట్టుబడి ఉంటాయి. రచయితలు పత్రికలతో కూడా పోరాడుతూనే ఉండాలి. నిస్సందేహంగా కొత్తను పత్రికలు స్వీకరించవు. అయితే స్వీకరించక తప్పదు.

మనిషికీ, సమాజానికీ, ఐక్యత - ఘర్షణ రెండూ వున్నాయి. మనిషిని అన్ని రకాలుగా దోచి హత్యచేసే సమాజంలో కథా రచయితలు మిగతా సృష్టి కర్తలైన ప్రజల్లాగే బతుకుతున్నారు. సృష్టి కర్తలైన ప్రజలు పోరాడుతున్నారు. ప్రజా పోరాటంలో రచయితలు విధిగా పాలు పంచుకోవాలి. మనిషి హత్యను నిరోధించి - సకల శక్తులతో మనిషి సమిష్టి జీవితాన్ని అనుభవించగలగాలి. సాహిత్యం మనిషిని మహోన్నతునిగా నిలబెట్టగలగాలి.

**అరిగే రామారావు**

1958 నుంచి రాస్తున్నాను.

మొదట్లో అచ్చులో పేరు చూసుకోవాలని రాశాను. రాను రాను రాయాలనే నిరంతర తపనతో రాశాను. తర్వాత తర్వాత, అయ్యో గేప్ వస్తోందే అని రాశాను.

గొప్ప కమిట్‌మెంటుతో, సమాజాన్ని వుద్ధరించాలని ఎప్పుడూ రాయలేదు. ఎన్నుకున్న కథా వస్తువు మంచిదైతేనే, కథా వస్తువులో వైవిధ్యం చూపాలనే తపనతో అన్ని రకాల కథలు రాశాను.

ఇప్పుడు చాలా మంచి కథలు వస్తున్నాయి. అలాగే, చాలా నాసిరకం కథలు వస్తున్నాయి.

వాసి కల కథయినా, నాసి రకం కథలయినా ప్రచురించేవి పత్రికలే! ఏ కథయినా పాఠకుడికి జేరాలంటే పత్రికలే శరణ్యం. నేటి పత్రికలకు చిన్న కథల మీద చిన్న చూపు. మంచి కథల్ని వెయ్యాలనే కమిట్‌మెంట్ వుంటే తప్పకుండా మంచి మంచి కథలు వస్తాయి. ఇందుకు పత్రిక ప్రోత్సాహం తక్కువ అనే నా అభిప్రాయం.

నేటి పత్రికలకు సారథ్యం వహించే ఎడిటర్లకు ముఖ్యంగా మంచి కథల మీద మంచి అభిరుచి వుంటే తెలుగు కథకు వూపిరి పొయ్యాలనే చిత్తశుద్ధి వుంటే ఆటోమేటిగ్గా మంచి కథలు పుట్టుకువస్తాయి.

**అవసరాల రామకృష్ణారావు**

1947 నుంచి నాకు నేనుగా గ్రహించిన సున్నితమైన విషయాలు నాకు తోచిన పద్ధతులలో నలుగురికి చెప్పడానికి రాస్తున్నాను.

ఇప్పుడొస్తున్న కథలు బాగా కొద్దిగా తప్ప ఏమంత బావుండడం లేదు.

ఒకటి రెండు పత్రికలు తప్ప అన్నీ తలో మార్గంలో నడుస్తున్నాయి.

మనిషి మౌలికంగా బాగుపడకపోతే సంఘం దానికి తోడ్పడకపోతే- ఎవరో బాగుచేస్తారని ఉదాసీనత వహించినంత కాలంమనకి మిగిలేది తిరోగమన సాహిత్యమే.

**ఆదివిష్ణు**

ఇప్పుడు డబ్బు కోసం. మొదట్లో గుర్తింపు కోసం. చాలా కాలం నుంచి-1959 నుంచి రాసాను. ఇప్పుడు నేను కథలు రాయడం లేదు. కోపం వచ్చి మాత్రం కాదు. బద్ధకం ఒక కారణం. తప్పునాదే! వప్పుకుంటున్నాను. ఇంతకంటె ఏం చెబుతాను?

బూతు ప్రయోగం విస్తారంగా వుంది. మునుపు ఈ ధోరణి వుండేది కాదు. ఇంకా చెప్పాలంటే - కథలకి డిమాండ్ తగ్గి, సీరియల్స్‌కి గిరాకి పెరగడం నాకు బాధగా వుంది. అప్పుడప్పుడు మంచి కథలు చదువుతున్నందుకూ ఆనందంగా వుంది.

ఇప్పుడు పత్రికలన్నీ సీరియల్స్‌కి ప్రాముఖ్యతనిస్తున్నాయి. అంచేత కథలు తక్కువ సంఖ్యలో కనిపిస్తున్నాయి. ఇది అంత ఆరోగ్యకరమైన వాతావరణంగా నాక్కనిపించడం లేదు. కథలో వున్న కిక్కు నవల్లో దొరకదని నా సిద్ధాంతం. తరువాత మీ ఇష్టం.

ఇంకా ఏ చెప్పగలను? కథల్ని బతికించండి - అనే నినాదం తప్ప!

**ఆకెళ్ళ శివ ప్రసాద్**

ఒక్కొక్క అనుభూతిని ఆవిష్కరించడానికి, అనుభవాన్ని పంచుకోవడానికి, ఆలోచనలోని అంతరార్థాన్ని ప్రతిబింబించడానికి (అక్షరాల్లో) రాస్తున్నాను. 1980లో మొదటి కథ పిల్లల మాస పత్రికలో పడింది. సుమారు 60 కథలు ప్రచురింపబడ్డాయి.

ఎప్పటిలాగే ఇప్పుడూ మంచి కథలు వున్నాయి. వస్తున్నాయి.

కథ ప్రాచుర్యానికి పత్రికల పాత్ర ఎంత ఎక్కువగా వుందో, అంత తక్కువగా పత్రికలు స్పందిస్తున్నాయి. కొన్ని సందర్భాల్లో 'మాత్రమే'

అందుకే నేను కోరేది-

పత్రికల 'సహకారాలు' ఎక్కువగా వుండాలి

రచయితలు తరుచు కలుసుకుని ఎప్పటికప్పుడు రచనలను (వారివైనా, ఇతరులవైనా) విశ్లేషిస్తే బాగుంటుంది.

**ఇచ్ఛాపురపు జగన్నాథరావు**

మొదట కీర్తి కాంక్షతో రాశాను. ఇది చాలా కాలం ఉండి పోయింది. ఇప్పుడు ఏదైనా కథ మనసులో ముల్లులాగ గుచ్చుకుంటూ వుండిపోతే రిలీఫ్ కోసం రాస్తున్నాను. మిత్రుల కోరికలని కాదనలేక రాస్తున్నాను.

నేను చాలా తక్కువ పత్రికలూ, కథలూ చదవగలుగుతున్నాను. కాని చదివిన వాటిలో చాలా మంచి కథలు వున్నాయి. అయితే పరిధి ఇంకా పెరగాలనీ కొత్త కొత్త విషయాలు కథలలో విషయంగానో బేగ్రౌండ్‌గానో రావాలని అనిపిస్తుంది. రచయితలు

తెలుగులోనే రాస్తే బాగుంటుంది.

పత్రికలు లేకపోతే కథలు లేవు. సంగీతం, నాట్యం లాంటి కళలు వ్యాపారానికి అమ్ముడుపోయాక పత్రికలనీ, కథలనీ తప్పు పట్టలేము.

చాలా వేగంగా మారిపోతున్న ప్రపంచంలో రచయితలు కూడా మారగలిగితే పాఠకులు మారతారు. కథ శిల్పంలోనూ, వస్తువు విషయంలోనూ ఎంత గొప్పగా వున్నా అది పాఠకుడి మనసుకి హత్తుకోకపోతే ప్రయోజనం సాధించలేదు. రచయితలు చదువరులకి మార్గదర్శకులుగానూ అనుయాయులుగానూ కూడా ఉండాలి. ఇది ద్వైముఖం. కానీ తప్పదు.

**ఇచ్ఛాపురపు రామచంద్రం**

1966 నుంచి రాస్తున్నాను

మొదట్లో పేరు కోసం, నలుగురిలోనూ రచయితగా ప్రఖ్యాతి చెందాలని, తరువాత అది అలవాటుగా మారి రాస్తున్నాను. కథలు అచ్చవుతూ, పారితోషికం తెస్తూ కలిగించిన చిన్న థ్రిల్ కోసమూ ఇప్పుడు - ప్యాంటు షర్టుల అర్బన్ కథలలో కూడా మంచివి నిజమైన కథలు ఉండొచ్చని నిరూపించాలని.

సెక్స్ కథలు మినహాయిస్తే - కథావస్తువులో ఎంతో నూతనత్వమూ, వైవిధ్యమూ, సులభమైన భాషతో మంచి కథలతో ఎక్కువగానే వొస్తున్నాయి, వెతుక్కోగలిగే పాఠకుడికైతే తెలుగు కథలలో ఆంగ్ల పదాలధికం కావడం తెలుగు భాష కవమానమని గుర్తించాలి. ఇప్పటి కథ క్లుప్తంగా సూటిగా సరళంగా హాయిగా సాగుతోంది.

ఐదారు సీరియల్స్ ఉండే వార పత్రికల్లో రెండో కథే అరుదుగా

దర్శనమివ్వడమే సూచిస్తుంది ఎక్కువ పత్రికలు కథా ప్రాచుర్యానికెంత సహకరిస్తున్నాయో! పత్రికలు చిత్తశుద్ధితో తలుచుకోవాలే కాని వైవిధ్యం కల కథలు ప్రచురిస్తూ పాఠకులను కథల వేపు తిప్పనూగలరు. కథనూ శక్తివంతం చెయ్యగలరు.

కథ భారంగానే ఉండక్కర్లేదు. హాయిగానూ సరదాగానూ కూడా ఉండొచ్చు. ఇలాంటివి కూడా మంచి కథలో బహుమతి కథలో కావడంలో ప్రమాదమేమీ లేదు. పాఠకుడికి స్పష్టంగా అర్థం కాని గొప్ప కథకంటే అర్థమయ్యే మామూలు కథే ఎక్కువ ప్రయోజనం సాధిస్తుంది. కథకి ప్రాణం వస్తువులో నవ్యతే. తెలుగు కథ కూడా ప్రపంచ భాషల కథలలో రూపాన్ని మెరుగుపరచుకుందుకు మారడం మొదలు పెట్టాలి. దినదినానికి వేగం పెంచుకుంటున్న మన జీవితాలకి కథే అనువయిన ప్రక్రియ; తక్కువ సమయంలో పాఠకుడికి ఎక్కువ యివ్వ గలుగుతుంది. కనుక వివిధ రచయితల కథలతో కూడిన ఒక్కొక్క సంకలనం పీరియాడికల్‌గా విడుదల చేసే ప్రయోగం ఆలోచించదగినది.

ఓల్గా :

స్త్రీ వాద రాజకీయాల ప్రచారంకోసం 1985 నుంచీ కథలు రాస్తున్నాను.

కొన్ని మంచి కథలు - జీవితంలోని అనేక కోణాలను చూపే కథలు ఇప్పుడు వస్తున్నాయి.

ఒకటి రెండు పత్రికలు (ఆంధ్రప్రభ, రచన, ఆహ్వానం) తప్ప మిగిలినవన్నీ వ్యాపారం కోసం మాత్రమే నడుస్తున్నాయి. వాటికి మంచి కథలతో పెద్ద సంబంధం లేదు.

**క.వ.న. శర్మ**

అచ్చయిన మొదటి కథ ఆంధ్ర సచిత్ర వార పత్రిక, 1953 లో వ్రాయాలనిపించివ్రాస్తున్నాను. నాకు ఒక చిత్రం (బొమ్మ) క్లియర్ గా కనిపిస్తే దాన్ని నేను ఇతర్ల ముందు పెట్టడం ద్వారా, వాళ్లకి ఆ విషయంలో కొంత అంతకు ముందు లేని, కోరుకొంటున్న క్లారిటీకి తోడ్పడ్తుందేమోనని రాస్తున్నాను. పత్రికలెక్కువవడటం వల్ల వాటి మొత్తం ఆకలి ఎక్కువ అయింది. (అబ్జల్యూట్ టెర్మ్స్‌లో) ఆ లోటు భర్తీ చేయటానికి ఉత్పత్తి పెరుగుతోంది. మనం ఏం అంటామన్నది మన దృక్పథం బట్టి మనకందు బాటులో ఏం ఉన్నాయన్న దాన్ని బట్టి ఉంటుంది. పెద్ద సంఖ్యలో మంచి కథలూ వస్తున్నాయి. చెత్త కథలూ వస్తున్నాయి. కథల్లో చాలా వెరైటీ (వైవిధ్యం) ఉంటోంది. కథలు శిల్పం, శైలి, వస్తువు దృష్ట్యా పూర్వం కంటె చాలా అభివృద్ధి పొందాయి. పెరిగిన సంక్లిష్టతని సమర్ధవంతంగా చిత్రిస్తున్నారు.

భర్తల మీద తన ప్రాచుర్యానికి దేవుడాధారపడటం రచయితలు, పత్రికల మీద కథా ప్రాచుర్యానికి ఆధారపడటం ఒక్కలాంటివే. ఏది దేనికి ఆధారం, పత్రికలు ఏది అమ్మగలమనుకుంటామో అవే బజారులో పెడ్తాయి. ఎప్పుడైతే పెట్టుబడి ఉందో అప్పుడు 'లాభాలు' ఉంటాయి. అవి వ్యక్తి గతమైనవి కావచ్చు, సామాజిక పరమైనవి కావచ్చు.

వ్యక్తి :- కీర్తి, డబ్బు...

సామాజికం:- ఒక రాజకీయ లేక ఒక మత విశ్వాసాలను ప్రచారం చెయ్యటం. ఒక సంస్కరణోద్యమం లేక అటువంటి కొన్ని అభిప్రాయాలను ప్రచారం చెయ్యటం. కొంత పెట్టుబడి ప్రచురించి

ఒక ధర పెట్టి బజారులో అమ్మకానికి పెట్టినవన్నీ వ్యాపార రచనలే. ఈ వ్యాపారంలో మనం కోరుకున్న లాభం బట్టీ మన రచనలుంటాయి.

వ్యాపార రచన కానిది ఏది?

**కలువకొలను సదానంద**

స్వభావరీత్యా రాస్తున్నాను. కథలు ఏదో ఒరగబెడుతాయని (లోకానికి) కాదు. ఆత్మానందం కోసం అందమైన కథ, బడుగు జనం బాధల్ని మానసికంగా పంచుకోవడానికి బరువైన కథ - రాస్తున్నాను.

1957-58 నుంచి రాస్తున్నా.

ఇప్పుడు వస్తున్న కథల్ని ఎక్కువగా చదవడం లేదు. చదువుతున్న ఏ ఒకటో రెండో కథలు కూడా శైలి, శిల్పం రీత్యా ఆహ్లాదంగా ఉండటం లేదు. ఇక పాత రచయితల్లో స్వాతిశయం కాస్త తగ్గితే (రచనల్లో) బాగుంటుంది.

సంపాదకులు యాంత్రికంగా మారిపోతున్నారు. ప్రసిద్ధ రచయితల రచనల్లోన్నా చవీ సారం చచ్చిపోయినా, అనవసరమైన పరిగణన యిచ్చి ప్రచురిస్తున్నారు. అసలు కథల మంచి చెడ్డల్ని గురించి విస్పష్టమైన స్పృహతో పట్టించుకుంటున్నారా అనిపిస్తుంది. అందుకు తగిన వ్యవధి ఉండటం లేదేమో! ఓపిక చేసుకుంటే, కొత్త రచయితలు పంచే కథల్ని సైతం కళాఖండాలుగా మలిచి ప్రచురించవచ్చు. అంత శ్రమకు పూనుకుంటారా !

దీనులు, హీనుల సంక్షేమం విషయంలో కథా రచయిత సాధించగలిగింది సున్న. కనుక ఈ వ్యాపకంలో గర్వించటానికేముంది?

జన సామాన్యంతో కలిసి వారి సుఖాలతో సమానంగా కష్టాలను సైతం అనుభవిస్తూ జీవించే ఉద్యమకారుడు తనకంటే కోటిరెట్లు నయం అన్న వాస్తవం తెలుసుకుంటే, రచయిత కథను సత్య సుందరంగా ప్రచురించగలడు.

**కట్టా రాంబాబు**

సమాజంలో జరుగుతున్న సంఘటనలకు నా మనస్సు మెదిలే భావాలను జోడించి వాటిని అందరికీ చెప్పాలనే కథలు వ్రాస్తున్నాను. సుమారు ఇరవై సంవత్సరాల నుంచీ రాస్తున్నాను.

ఇప్పుడు మంచి కథలు చాలా తక్కువగా వస్తున్నాయి. కథల్లో సెక్స్, వయొలెన్స్ ఎక్కువ చోటు చేసుకున్నాయి. పూర్వంలా పది కాలాలపాటు గుర్తుంచుకునే కథలు మాత్రం ఎక్కువగా రావడం లేదు. ఇప్పుడొచ్చేవన్నీ కాలక్షేపం కోసం చదివేవే!

ఇప్పుడు పత్రికలు సీరియల్ నవలలకి ఇస్తున్న ప్రాధాన్యత కథల కివ్వడంలేదు. అందుకే మంచి కథలు రావడం లేదనిపిస్తోంది. ప్రతీ పత్రికా ఒకటీ రెండు కథలకన్నా ఎక్కువ ప్రచురించడం లేదు. అవైనా సరసమైన కథలు, సెంటర్ సెన్సేషన్ శృంగార కథల రూపంలోనే వుంటున్నాయి. ఈ పద్ధతి మారాలనేదే నా అభిప్రాయం.

నవలల మాదిరిగా కథల సంపుటాలు విరివిగా ప్రచురణ కావాలి. వివిధ రచయిత(త్రు) లు వ్రాసిన, వ్రాస్తున్న మంచి కథలను ఏరి కథా సంకలనాలుగా ప్రచురించాలి. ఈ విషయంలో ప్రచురణ కర్తలు ముందుకు వచ్చేటట్టుగా పేరున్న రచయితలు కంకణం కట్టుకోవాలి. ఎందుకంటే ప్రచురణ కర్తలు వీరి మాట వింటారు కాబట్టి. పెద్ద రచయితలు తలుచుకుంటే మంచి కథలకు మంచి రోజులొస్తాయని నా ఆశ....

**కాటూరు రవీంద్ర త్రివిక్రమ్**

ఆత్మానందంకోసం పాఠకుల మానసిక వికాసం, ఉల్లాసం కోసం 1935 నుంచి రాస్తున్నాను.

ఒకప్పుడు మనోస్పందనతో, ప్రేరణతో, మంచి కథ రాయాలనే తపనతో రాసేవాళ్లం. అకస్మాత్తుగా, ఉప్పెనలా వచ్చిపడిన కొత్త సాహితీ తరంగాలు - సెక్స్, హింసలకు ప్రత్యేక స్థానం కల్పించి, పత్రికల అమ్మకాన్ని పెంచే ఆకర్షణలుగా అలంకారాలుగా అయిన నుండీ, తెలుగు కథ బక్కచిక్కిపోయింది. చక్కని కథలు రాసిన వాళ్లు, రాయగలవాళ్ళు మౌనం వహించారు. పత్రికల్లో వస్తున్న కథల్లో మంచివి లేకపోలేదు. కానీ, అన్నీ మంచివే రావటం లేదు.

మంచి తెలుగు కథల సంపుటాలు విరివిగా రావాలి. ఇవి ఇతర భాషల్లోకి తర్జుమా కావాలి. కథా సదస్సులో తరచుగా ఉత్తమ కథల మీద చర్చలు జరగాలి. తరచుగా రచయితల సమావేశాలు, సుహృద్భావ, సహకార వాతావరణంలో జరుగుతుండాలి. ఇవి ప్రధాన నగరాలు/ పట్టణాలలో జరుగుతుండాలి. రచయిత(త్రు) ల తాజా జాబితాలు ఉండాలి. వీటి ప్రకారం వారిని సమావేశాలకు ఆహ్వానిస్తుండటం బావుంటుంది.

**కాలువ మల్లయ్య**

ఈ సమాజాన్ని చూస్తుంటే నాలో కలుగుతున్న ఆవేశానికి, ఆవేదనకు, ఆక్రోశానికి, ఆనందానికి అక్షర రూప మివ్వడానికి నేను కథలు రాస్తున్నాను. సామాజిక మార్పును సాహిత్యం వేగవంతం చేస్తుందని నమ్ముతూ రాస్తున్నాను. వైవిధ్య భరితమైన మానవ జీవితంలోని సంవేదనను, సంఘర్షణను, సంక్లిష్టతను, ప్రజా ఉద్యమాలను కథలుగా మలుస్తున్నాను. సామాజిక మార్పు

నభిలషిస్తూ ఇప్పటికంటే ఉన్నత సమాజావిష్కరణ కోసం నేను 1983 నుంచి కథలు రాస్తున్నాను.

ఇప్పుడు రాశిలో కథ లెక్కువగానే వస్తున్నా వాసిలోనూ లెక్కించపదగిన కథలు రావడం గమనార్హం. ఇప్పుడొస్తున్న అన్ని కథల్లో కాకున్నా, మంచి కథల్లో వస్తు వైవిధ్యం, విస్తృతి పెరిగింది. ప్రజల భాషయైన మాండలికంలో ముఖ్యంగా తెలంగాణా, రాయలసీమ మాండలికాల్లో ఎక్కువ కథలు రావడం, దాదాపు అన్ని పత్రికల్లోనూ మాండలికం చోటు చేసుకోవడం మంచి పరిణామం. అయితే ఈ మధ్య తెలంగాణా నుంచి ఉద్యమ కథలు తక్కువ రావడం (ఉద్యమం బలహీనపడటం వల్ల కాబోలు) జరుగుతుంది. ఇది వరకటిలా కాకుండా ఇప్పుడు రచయితలు వస్తువుతో పాటు శిల్పానికీ ప్రాధాన్యత నివ్వడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే ఇంకా మధ్య తరగతి దృక్కోణంలోంచే ఎక్కువ కథలు వస్తున్నాయి. మొత్తంగా ఇప్పుడొస్తున్న కథలు తెలుగు నవలల్లా వ్యాపార మయం కాలేదని, తెలుగు కథకు ఉజ్వల భవిష్యత్తు ఉందని చెబుతున్నాయి.

ఒకటి, రెండు పత్రికలు తప్ప కథా ప్రాచుర్యానికి పత్రికలు చెప్పుకోదగినంత ప్రాధాన్యత నివ్వలేదు. వార పత్రికల్లో ముఖ్యంగా సీరియల్ నవలలే ప్రచురింపబడుతున్నాయి. దిన పత్రికల్లోని సాహిత్య పేజీలు కవిత్వానికి, కవిత్వంపై విమర్శకిస్తున్న ప్రాధాన్యత, కథకు కథలపై విమర్శలకివ్వడం లేదు. కొన్ని పత్రికలు, సంస్థలు మాత్రం కథ కోసమే ఉన్నట్టుగా విశేషంగా కృషి చేస్తున్నాయి. మొత్తంగా ఇటీవలి కాలంలో కథలపై పత్రికల దృష్టి ఎంత మరలినా కథా ప్రాచుర్యానికి వాటి సహకారం మరింత కావాలని ఇది వరకు జరిగింది పాక్షికమేనని నా అభిప్రాయం.

"సాహిత్యం జీవిత వృక్షానికి పూసే పువ్వు. సిద్ధాంతాల కోసం

జీవితాన్ని వక్రీకరించకూడదు. అన్న కొ.కు గారి మాటల్ని కథకులు గుర్తుంచుకోవాలి. ఇప్పుడు మంచి కథలు బాగానే వస్తున్నా తెలుగు కవిత్వం ఎదిగిన ఎత్తులకు తెలుగు కథ ఇంకా ఎదగవలసి ఉందని గమనించాలి. తెలుగు కథకులు నిజాయితీతో, సమాజికావగాహన వాస్తవిక దృక్పథంతో కథలు రాస్తున్నా కవుల కొచ్చినంత పేరు రావడం లేదు. ఇందుకు కారణం ముఖ్యంగా విమర్శకులే. కవిత్వం, కవులపై వస్తున్నంత విమర్శ కథ, కథకులపై రావడం లేదు.

కథకున్న సామాన్య పాఠకులు కవితకు లేకున్నా పై కారణం వల్లే వాళ్ల కెక్కువ పేరు వచ్చింది. కథలపై విమర్శ పెరగాలి. కథ మానవ జీవితానికి చాలా దగ్గరైంది కాబట్టి కథకు మరింత ప్రాచుర్యం పెరగాలి. కథకులు ప్రజా కథల్లోని బాణాలని స్వంతం చేసుకుని కథను ప్రజలకు మరింత చేరువగా తీసుకెళ్ళాలి. మరింత విస్తృతమైన సంఖ్యతో అన్ని పత్రికల్లో మంచి కథలు రావాలి. ముఖ్యంగా గ్రామీణ జీవితంపై.....

**డా. కేతు బుచ్చిరెడ్డి**

మొదట్లో ఎందుకు రాస్తున్నా అన్న స్పృహ లేకుండా - అసంకల్పితంగా మధ్యలో ఆత్మతృప్తి రాయకుండా ఉండలేక.

ఇప్పుడు ఒక బాధ్యతగా కథ ఒక కళా సాధనగా సాంఘిక ప్రయోజన కార్యదీక్షగా - దిశగా, ఒక చిరు ఆశతో 1953 నుండి రాస్తున్నాను.

'హాట్, హాట్, హాయ్, బై' లాంటి చాలా తేలిక పాటి, కాలక్షేపం బఠాణీల్లాంటి కథలు ఎక్కువ రావడం తగ్గాలి. కొందరు కొత్త రచయితలు బాధ్యతగా నిజాయితీగా రాయడం మెచ్చుకోదగ్గ అంశం. భాషా విషయంగా కనీస జాగ్రత్తలేని కొన్ని కథలు రావడం

బాధాకరం.

కొంత వ్యాపార మార్గంలో - అందుకో గల్గిన వారికి ఆదాయం, ఆనందం ఇబ్బడిగా కొన్ని పత్రికలు కొంత బాధ్యతగా, నిజాయితీగా కథ ఎదుగుదలకు కృషి, తమ వంతు కర్తవ్యంగా చేస్తున్నాయి. పత్రికల సహకారం చాలా అవసరం. ఇతర ఆకర్షణలతో ఉన్న పత్రిక కొన్న పాఠకుడికి కథ చేరువవుతుంది.

చదువను, వ్రాయను వచ్చిన ప్రతి ఒక్కరికీ కథ అర్థమయ్యేలా ఉండాలి. కథ సాహితీ ప్రక్రియలన్నిట్లోకి చాలా బలమైన ప్రక్రియ. ప్రయోజనాన్ని చాలా సులభంగా సాధించగల్గిన సాధనం. "కథ కళలకు కేంద్ర బిందువు "నిజమే కథ చిన్నగా, సూటిగా, ఆసక్తిగా, స్ఫూర్తిస్ఫోరకంగా ఉండాలి. జీవితమే కథ - కథ జీవితం అన్నంత సహజంగా, సరళంగా ఉండాలి. కథా సమ్మేళనాలు విరివిగా జరగాలి. కథా వర్క్‌షాప్‌లు, కథా సదస్సులు బహుళంగా ప్రయోజనాత్మకంగా జరగాలి. క్రీడాకారులకిచ్చే ప్రోత్సాహకాలు - ఉద్యోగాలు, రాయితీలు వగైరాలు కథారచయితలకివ్వాలి.

**కొండముది శ్రీరామచంద్రమూర్తి**

రాయకుండా ఉండలేను కనుక రాస్తున్నాను. రాస్తేనే ఆనందం కలుగుతుంది కనుక రాసింది చదివిన ఇతరుల్లో మంచి కోసం వో 'రియాక్షన్' వస్తుంది కనుక రాస్తున్నాను. కళా సంబంధమైన ఒక కదలిక ఏర్పడుతుంది కనుక రేపటిమీద ఆశ కలుగుతుంది కనుక రాస్తున్నాను. 1955 లో నా మొదటి రచన 'భారతి' మే నెలలో ప్రచురితమైంది.

'చెడు' వేపుకు ఆకర్షణ ఎక్కువ గిమ్మిక్స్ తప్ప విలువలు శూన్యం.... టెక్నిక్ మీద వున్న శ్రద్ధ వస్తువు మీద లేదు. భాషా

శుద్ధి అసలు లేదు.

రేట్ రేస్ కాంపిటీషన్‌లో, ఏ పత్రికకు ఆ పత్రిక ఏదో బాగుపడి పోవాలన్న రుగ్మతతో అడ్డదారులు తప్ప రాచ మార్గం మర్చిపోయాయి. కథల్లో సెక్స్ మరియు వయోలెన్స్ పెరగటానికి ఇవి ఎంతో తోడ్పడుతున్నాయి.

ఆచరించేవాళ్ళు లేనప్పుడు చెప్పి ఏం ప్రయోజనం? ఇది బధిర శంఖానాదం. కనుక ఇంతవరకు చాలు. ప్రభుత్వాలు మారి తలుపులు కుదిరి, మనస్సు తలపులు తెర్చుకుని, స్వార్థం తగ్గి, సంస్కృతి పెరిగి ఎవరికి. వారు సొంత సెన్సార్‌షిప్ విధించుకుంటే అప్పుడు ఆలోచిద్దాం.

**కోడూరి శ్రీరామమూర్తి**

నేను ఎందుకు రాశాను? ఎప్పటిదాకా రాశాను? - అనే విషయాలు చెబుతాను. ఎందుకంటే యిప్పుడు నేను కథలు రాయడంలేదు కాబట్టి.

1953-55 సంవత్సరాల మధ్య కాలంలో స్కూల్లో చదివే రోజుల్లోనూ 1965-72 సంవత్సరాల మధ్య కాలంలోను కథలు రాశాను. మొదటి దశలో రాసినవి. హాస్యకథలు. జీవితంలో అనుభవంలోకి వచ్చిన చిన్న చిన్న సంఘటనలను హ్యూమరస్‌గా రాసిన ఆ కథలు 40-50 దాకా వుంటాయనుకుంటాను (సరిగా గుర్తులేదు) అవి అన్నీ 53-55 మధ్య రాజమండ్రి నుంచి వెలువడే ఒక వారపత్రికలో ధారాళంగా వచ్చాయి. అవి ఎందుకు రాశానంటే సరి అయిన సమాధానం తోచదు.

ఆ తర్వాత, అంటే '65-72' సంవత్సరాల మధ్య కథలు 30 దాకా వుంటాయి. ఇవి అన్నీ అప్పట్లో ఆంధ్ర సచిత్ర వారపత్రిక, ఆంధ్రప్రభ వారపత్రిక. ఆంధ్రజ్యోతి వార పత్రిక, యువ, జయశ్రీ లలో ప్రచురించ బడ్డాయి. నా కథలు మనిషి ప్రవర్తనలోని కొన్ని 'కాంప్లెక్సిటీస్' కథలో ఆవిష్కరించాలనే కోరికతో రాశాను.

72 తర్వాత 22 సంవత్సారాలుగా కథ లేవీ రాయ లేదు. నా ఆలోచనా విధానంలో వచ్చిన మార్పులకు, నాలోని కథకుడికీ, పొంతన కుదరకపోవడం యిందుకు కారణం అనుకుంటాను.

ఇప్పుడు మంచి కథలు వస్తూన్నాయి. చెత్తా చెదారం కథలు కూడా వున్నప్పటికీ మంచి కథలకూ లోటులేదు.

మంచి కథలకు పత్రికలవారు ప్రోత్సాహం యిస్తున్నారనే చెప్పాలి. మంచి కథలు వెయ్యాలనే తపన గల సంపాదకులు కూడా మనకు వున్నారు. కనీసం కొందరు!

యింతకు మించి చెప్పాల్సింది ఏమీ లేదు. తెలుగు కథను ఉన్నత శిఖరాలకు తీసుకు వెళ్లే కృషి ఎవరు ఎక్కడ ఎప్పుడు చేసినా యథాశక్తి నా సహకారం ఎప్పుడూ వుంటుంది అని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

**కె.ఆర్.కె. మోహన్.**

మంచి సాహిత్యం సృష్టించాలని రాస్తున్నాను. రాసిన వాటిలో కొన్నైనా కలకాలం పాఠకుల మనసులో గుర్తుండిపోవాలని నా తపన. ఒంటిగాకాని, నలుగురూ కలిసికాని హాయిగా చదువు కునేటట్లుండాలి రచనలు. 1958 నుండి రాస్తున్నాను.

చిరస్మరణీయంగా వుండే కథలు చాలా తక్కువగా వస్తున్నాయి. అన్నిటిలోనూ స్పీడ్. ఫుడ్‌లు కూడా ఫాస్ట్ వచ్చిన ఈ రోజుల్లో కథా రచనలలో కూడా వేగం ఉంటోందే కానీ శిల్పం ఉండడం లేదు. అయితే నవ రచయితలు చాలా మందిలో ప్రజ్ఞ కనిపిస్తోంది. దీనిని నిర్మాణాత్మకంగా మళ్ళిస్తే మంచి రచయితలు చాలా మంది రాగలరు.

కథలకి పత్రికల ప్రోత్సాహం ఉండవలసిన రీతిలో ఉండడం లేదు. లబ్ధ ప్రతిష్టులైన ఎందరో ఉత్తమ రచయితలు, ఈ రోజుల్లో తమ మంచి కథలకి ఈనాటి, ఎన్నో పత్రికలలో స్థానం ఉండడంలేదని వాపోతున్నారు. చవుకబారే కాదు, జుగుప్సాకరమైన శృంగారం కూడా నేటి కథానికలలో చాలా ఉంటోంది.

పత్రికలకు వ్యాపార దృక్పథం ఉండడంలో తప్పులేదు. అమ్మకాలు పెంచు కోవాలనుకోవడాన్ని అర్థం చేసుకోవచ్చు. పత్రికల్లో ఐదు కథలు వేస్తే వాటిలో కనీసం ఒక్కటైనా మంచి కథ వుండాలి. నవరచయితలలో వుండే స్పార్క్‌ని గుర్తించాలి. అది వక్రమార్గం పట్టి దావానలంలా సమాజాన్ని దహించకుండా, నలుగురికీ కాంతిని పంచి ఇచ్చే దీపకళికలుగా మారేటట్లు ఆ రచయితలను ప్రోత్సహించాలి.

**కేతవరపు వెంకటరమణమూర్తి**

నేను కథలు ఎందుకు రాస్తున్నానంటే జవాబు చెప్పడం కష్టమనిపిస్తోంది. చుట్టూ జరుగుతున్న విషయాలకి స్పందించి, నేను కూడా ఏవైనా పదిమందికి చెప్పాలని కాబోలు కథలు రాయడం! 1992 నుంచి సీరియస్‌గా రాస్తున్నాను.

ఇప్పుడొస్తున్న కథల్లో చాలా భాగం ఈ కంటితో చూసి ఆ కంటితో వదిలేయ తగ్గవే! కానీ చీకటి ఆకాశంలో నక్షత్రాల్లా మంచి కథలు ఎక్కువసంఖ్యలో కాకపోయినా అప్పుడప్పుడూ వస్తూనే వున్నాయి.

రచనలాంటి ఒకటి, రెండు పత్రికలు తప్ప మిగతా పత్రికలు కథలకి ప్రాముఖ్యం ఇవ్వడంలేదు. మొక్కుబడిగా ఒకటి రెండు కథలు ప్రచురించి చేతులు దులుపు కుంటున్నాయి. కథల విషయంలో పత్రికలు దారి తప్పాయనే చెప్పాలి. ఇంకా ఎక్కువ

సంఖ్యలో కథలు రావాలి. పత్రికలు, రచయితల మధ్య ఇంటరాక్షన్ వుండాలి. బాగా రాస్తున్న వర్థమాన రచయితలకు పత్రికలు సీనియర్ రచయితలకిచ్చే ప్రోత్సాహమివ్వాలి.

**గంధం యాజ్ఞవల్క్య శర్మ**

నేను 1956 నుండి కథలు వ్రాస్తున్నాను. అంటే, నా కళాశాల విద్యార్థి దశనుండి ఎందుకు వ్రాస్తున్నానో - నేనే నాడూ ప్రశ్నించుకోలేదు. కానీ ఒక్కటి అన్పిస్తోంది. 'నిజానికి' నేనే 'కమిట్‌మెంట్'కు కట్టుబడి కథలు వ్రాయలేదు. నాకు ఎదురైన అనుభవాల నుండి, తారసపడ్డ వ్యక్తుల ప్రవృత్తుల పరిశీలనల నుండి నేను కథలు వ్రాయటానికి ప్రయత్నించాను.

ఇప్పుడొస్తున్న కథల మీద నా అభిప్రాయం చెప్పాలంటే 'రాసి' ఎప్పుడూ వుంటుంది. వాటిలో 'వాసి' గల కథలూ వుంటున్నాయి. కొన్ని మంచి కథలు - తక్కువగా గొప్ప కథలు దర్శన మిస్తూనే వున్నాయి.

ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక, రచన, ఇండియా టుడే - లాంటి అతికొద్ది పత్రికలు కథా ప్రాచుర్యానికి దోహద పడుతున్నాయి. చాలా ఎక్కువ పత్రికలు కథలు వారు కోరిన తీరున వుంటేనే ప్రచురిస్తున్నాయి. (ఉదా శృంగార కథ, పెద్దలకు మాత్రమే కథలు) మొత్తము మీద ఉత్తమ కథ రావటానికి పత్రికల సహకారం లేదనే చెప్పాలి.

'కథ' గొప్ప ప్రక్రియ. పత్రికలు - యూనివర్సిటీలు, అకాడమీలు సహకరించి - ప్రోత్సహిస్తే తెలుగు కథకు గొప్ప భవిష్యత్తు వుంది. - వారు తాత్సారం చేసినా గొప్ప భవిష్యత్తు వుంటుంది.

**గంటి రమాదేవి**

కథలు వ్రాయడం 1965 నుండి ప్రారంభం. మొదటి కథ ఆంధ్రప్రభలో ప్రచురితం, ఇక కథలు ఎందుకు వ్రాస్తున్నానంటే అది ప్రచురితమైతే పొందేథ్రిల్ కోసమే. చదివిన వాళ్లు మెచ్చుకుంటే పొందే అనుభూతి గురించీ.

వ్యాపార రాక్షసి (డెవిల్ ఆఫ్ కమర్షియలిజమ్) కథ యొక్క ఆత్మను ఎప్పుడో మింగేసింది. ఇప్పుడు శరీర భాగాలను కూడా తినేస్తోంది. అయితే పూర్తిగా ఆశ చావలేదు. మరో అరుణోదయపు తెలుగు రేఖలు చూచాయగా కనిపిస్తున్నాయి.

ఈ క్రాస్ కమర్షియలిజమ్ ఝంఝూంమారుతంలో కొట్టుకుపోతూ పత్రికలిప్పుడు అసహాయ స్థితిలో వున్నాయి.

టి.వీ.ల దాడితో ప్రింట్ మీడియా అనారోగ్యం పాలయింది. పత్రికలు పెరిగినా పాఠకులు తగ్గారు. అనాసక్తి పాఠకులకు మసాలాలందించి ఆకర్షించాలని పత్రికలు ప్రయత్నిస్తున్నాయి. వట్టి మసాలాలే ఎప్పుడూ తింటే ఆరోగ్యం పాడవుతుంది. ఈ తపస్సులో నుండి ఉషస్సులోకి వెళ్లే రోజు త్వరగా వస్తుందని ఆశపడుతున్నాను.

**గిడుగు రాజేశ్వరరావు**

నేను చుట్టూ వుండే జీవితాన్ని చూసి స్పందించినపుడు రాయాలనిపించి కథలు రాస్తాను. 1986 నుండీ విడవకుండా రాస్తున్నాను. అంతకుముందు 3,4 కథలే వ్రాశాను.

మునపటికంటే ఎక్కువ సంఖ్యలో కథలు రాస్తున్నారు. అందువల్ల మంచి కథలు తక్కువ నిష్పత్తిలో వుండి ఎంపిక

చేసుకోవడంలో మునుపటికంటే శ్రమ ఎక్కువ ఉంటున్నది. మంచికథలు రాకపోవడం అంటూ లేదు. ఎక్కువ పత్రికలు వాణిజ్యధోరణి కథలు వేసుకొనే ఉత్సాహం వల్ల మంచి కథలను నిర్లక్ష్యం కూడా చేస్తూవుండవచ్చునని అనిపిస్తున్నది.

పత్రికల సహకారం వాణిజ్యపరమైన ఈ కథలకు అంటే క్రైమ్ - సెక్స్ కథలకు ఎక్కువగా ఉండటం అందరికీ తెలిసినదే. ఆ ధోరణిలో రాయని వాళ్ల కథలు విరివిగా ప్రోత్సహించ బడడంలేదనే అనుకుంటున్నాను. మంచి కథలు (వాణిజ్య ధోరణికి భిన్నమైనవి) పడవు, వేసుకోరు అన్నప్పుడు రాయడానికి కూడా ఉత్సాహం తగ్గుతుంది.

సాహిత్య విమర్శకు ప్రాధాన్యం ఇచ్చే పత్రికలలో కథా సాహిత్యాన్ని విపులంగా నిర్మాణాత్మకంగా విమర్శించే పద్ధతి వుంటే ప్రోత్సాహం ఎక్కువ లభిస్తుంది. మంచి కథలని డివోషన్‌తో రాసేవారు తరుచు కలిసే అవకాశాలు ఉండాలి.

**గొల్లపూడి మారుతీరావు**

మొదట్లో సరదాకి రాసాను. తర్వాతర్వాత వ్రాసినందువల్ల ఒక తృప్తి కలిగింది. ఇంకా తరువాత మన ఆలోచనని బలంగా చెప్పగలగడం 'పవర్' కనుక రాస్తున్నా 1954 నుంచి.

ఇప్పటి కథల్ని దాదాపు 15-18 సంవత్సరాలుగా చదువలేదు. అప్పుడప్పుడు ప్రయత్నించినా ఏ కథా నన్ను చదివించ లేదు. అది బహుశా నాలోపమేనేమో నా కర్మమయినంతవరకు Today writers are not telling Stories. But they are selling stories.

కథా ప్రాచుర్యం విషయంలో పత్రికల సహకారం నాకు తెలిసి, దరిద్రపు మార్గంలో వెళ్తున్నది. ఈ మధ్యనే బెంగుళూరు 'కథా

వేదిక' వారు పత్రికల్ని బూతు కథలు ప్రచురిస్తున్నాయని వాపోతూ పత్రికల్ని బాన్ చేయాలన్నారు. బ్రదర్స్! ఎవరు బాన్ చేస్తారు, మన సంస్కారం చెయ్యాలి.

చాలా కాలంగా మన నవలలకి, నవలా రచయితలకి, సీరియల్ రచయితలకి రచనలు అమ్ముకు బ్రతక్క తప్పలేదు. కాని కథకు, ఆ దౌర్భాగ్యం ఎందుకు? ఒక్క కథా రచనలోనే మనం ప్రపంచ సాహిత్యంతో పోటీ పడే స్థాయి ఉన్నదని పెద్దలు అనేవారు. ఇప్పుడా పెద్దలు లేరు, కథలు లేవు, ఇలా చెప్తునప్పుడు 'రోజాలు తగలడిపోయాయి అని చెప్పే ముసలాడు మారుతీరావు అని ఈ తరం సమర్థించుకోవచ్చు, శుభం.

**గోపరాజు నాగేశ్వరరావు**

1972 'విశాలాంధ్ర'లో నా మొదటి కథ అనగా అనగా ఒక రాజ్యం ప్రచురితమైంది. గతంలో నమ్మిన ఒక సిద్ధాంతపు ఉత్తేజాన్ని తట్టుకోలేక రాసే వాడ్ని. సిద్ధాంతం పట్ల భ్రమలు తొలగిపోయి జీవితాన్ని అన్ని కోణాల్లోనూ పరిశీలించడం విజ్ఞత అనుకున్న తర్వాత సిద్ధాంతానికి కాక మనసుకు ప్రాముఖ్యత యిస్తూ రచనలు సాగిస్తున్నాను.

రచయితలు వెసులుబాటుగా ఆలోచించి రాస్తే మంచి కథలు రావచ్చు. నావరకూ నేనెప్పుడూ చెడ్డ కథ రాయలేదని నా విశ్వాసం.

కథలో బలం ఉండి పాఠకులు పత్రిక మీద అభిమానం కోల్పోరన్న విశ్వాసం పత్రికాధిపతులకు కుదిర్తే ప్రచురణ అవుతాయి. కొత్తవారి కథలు కూడా వస్తున్నాయిగా ఈ మధ్య.

ఏం చెప్పినా కథలేగా!

**చిలుకూరి దేవపుత్ర**

మంచిని పెంచేందుకు, చెడును తుంచేందుకు, మనిషికి మనిషికీ మధ్య అపారమైన విశ్వాసాన్నీ, ప్రేమని కలిగించేందుకు కథలు రాస్తున్నాను. 1977వ సంవత్సరం నుంచీ కథలు రాస్తున్నాను.

యువ రచయితల్లో ఎక్కువ మంది రచయితలు ఎంతో మంచికథలు రాస్తున్నారు. ఈ దశకంలో వస్తున్న కథల్ని చూస్తుంటే 'తెలుగు కథ' కు మంచి రోజులు వచ్చేశాయని ధైర్యంగానూ, గర్వంగానూ ఉంది.

అసలు 'తెలుగు కథ' భారతదేశంలో ఇతర భారతీయ భాషలలో ఏ మాత్రం తీసిపోకుండా నిలబడ గలుగుతున్నదీ అంటే సాహిత్య విలువల్ని బలంగా నమ్ముతున్న పత్రికలు కొన్నైనా ఉండడం వల్లనే.

కథ అంటే ఒక్క సీరియస్ కథ మాత్రమే తెలుగు విమర్శకులకి, హాస్య, వ్యంగ్య కథలని అసలు పట్టించుకోవడంలేదు వాళ్ళు. వచ్చే దశాబ్దిలోనైనా హాస్యానికీ, వ్యంగ్యానికి ప్రాధాన్యత ఉన్న కథల్నీ విమర్శకులు తేడా చూడకుండా పట్టించు కుంటారని ఆశ.

**చీకోలు సుందరయ్య**

1984 నుంచి ఎప్పుడైనా ప్రేరణ కలిగినప్పుడు మాత్రమే రాస్తున్నాను. ఇప్పుడొస్తున్న కథలమీద నాకున్నది సంతృప్తే - అయితే మంచి కథల్ని ఏరుకోవాల్సిన అవసరముంది. కథా ప్రాచుర్యానికి పత్రికలే శరణ్యం. మంచి కథల్ని పత్రికలు ప్రచురిస్తూనే ఉన్నాయి. కథలు మంచివి రాలేదంటే రచయితలు రాయలేదనే నా భావం. ఈ రోజుల్లో డబ్బు కోసం గడ్డి తినే రచయితలు పెరిగారు. సెక్స్

కాదు, ఇంకేది రాయమన్నా రాయడానికి వారంతా సిద్ధం, ముందు రచయితల్లో మార్పు వస్తే కథల్లో తప్పక మార్పు వస్తుంది. ఎడిటర్ కాళ్లు పట్టుకొని వారికి కావలసిన'మసాలా'లు వండే ముఠా రచయితలున్నన్నాళ్లూ మంచికథలెలా వస్తాయి. అనేవి నా అభిప్రాయాలు.

**జీడిగుంట రామచంద్రమూర్తి**

1960 నుండి ఓ మంచి సంఘటనకానీ, సన్నివేశం కానీ ఎదురైతే మనసు స్పందిస్తుంది. ఆ స్పందనకు ప్రతిస్పందనగా ఓ కథ రాయాలని ప్రయత్నిస్తున్నాను. అది నాకు సంతృప్తినిస్తుంది. ఆ కథ చదివి అందరూ బాగుందంటే అదో తృప్తి. అంతే.

వైవిధ్యం కలిగిన కథలు ఇప్పుడు వస్తున్నాయి.

కథా ప్రాచుర్యానికి పత్రికల సహకారం సరైన మార్గంలో వెడుతున్నప్పటికీ 'కథా సంపుటాలు' రావలసిన అవసరం క్రమేపి ఎక్కువవుతోంది.

కథా సదస్సుల్లో బుక్స్ ఎగ్జిబిషన్ కూడా నిర్వహిస్తే బావుంటుంది.

**జ్వాలాముఖి**

1970 నుండి కనిపించే కన్నీరుకు కారణాన్ని, కనిపించని కన్నీటికి పరిష్కారాన్ని, మొత్తంలో కన్నీటి రద్దుకు ఉద్యమాన్ని ఆశిస్తూ రాస్తున్నాను.

ఇప్పుడొస్తున్న కథలు మధ్య తరగతి వారి దృష్ట్యా ప్రపంచం జీవితం, సమాజం వ్యాఖ్యానించ బడుతూవుంది. అందుకు భిన్నంగా సామాన్య శ్రమజీవుల కనుగుణ్యంగా విముక్తి పథంలో కథ

రాయగలిగినపుడు కథకు విముక్తి.

కథా ప్రాచుర్యానికి పత్రికల సహకారం విషయానికొస్తే పత్రికల వారికి సొంత ప్రయోజనాలున్నాయి. అయితే ప్రజాభీష్టాన్ని వారు ఎక్కువ కాలం మభ్యపెట్టజాలరు 'మధ్య పేజీకథలు' అసభ్య శృంగార కథలు నిజమైన కథల్ని అణచలేవు.

సమకాలీన జీవన సంగ్రామంతో ఏకం చెందుతూ మొత్తంగా సమాజాన్ని మార్చే మహత్తర ప్రక్రియలో సాహిత్య పూర్వ రంగం సృష్టించాలని, ఆ తరుణం ఆసన్నమైందని విజ్ఞప్తి.

**తల్లావఝ్ఝుల శివాజీ**

72 నుంచీ - రాసింది బాగా తక్కువ. బహుశా రాయగలను గనుకే రాయాలనిపిస్తేనే రాస్తున్నాను. ఇపుడొస్తున్న కథల్లో చాలా భాగం బావుండడం లేదు. బావున్నవి వస్తు రూపంలో. శైలి సన్నగిల్లింది.

కథలకు పత్రికలు చేస్తున్న సాయం బహు తక్కువ గదా, మనఃపూర్వకంగా, మనసారా కథ రాయగలిగితే దాని కున్న ప్రయోజనంవేరు. రాసే వారు విధిగా బాగా చక్కగా చదువుకోవాలి. ఎంత చదివితే అంత మంచిది.

**తురగా జానకీరాణి**

1951 నుంచి అంటే 15 సంవత్సరాల వయసు నుంచి రాస్తున్నాను. వ్రాయకపోతే నేను బ్రతికినట్లు నాకు అనిపించదు.

మంచి కథలలో వస్తువులో వైవిధ్యం వుంటున్నది. శిల్పంలో చాకచక్యం కనిపిస్తోంది. కానీ చాల వరకూ అసభ్య అశ్లీల సాహిత్యం ముద్రవేసుకుని జల్లెడ లోంచి క్రిందకు జారిపోయే కథలు ఎక్కువుంటున్నాయి.

పత్రికలు, మంచి కథలు, వ్రాయించడానికి మరి కొంత ప్రయత్నించవచ్చును. సదస్సులు పెట్టి, రచయితల చేత కవిత్వం చదివించే (అంటే కవితా సాహిత్యం,పద్యసాహిత్యం చదవనిదే భాషరాదు) వచ్చిన కథలను సవిమర్శగా నలుగురి ఎదుటా సమీక్ష చేయించి ఉత్తమమైన కథలు వ్రాయించవచ్చును.

రచన అనేది చాల వ్యక్తిగతమైన విషయం. జీవితము గురించి పరిశీలన, స్పందన, భావప్రకటన, భాషా దృష్టి ఎవరికి వారు పెంచుకోవాలి. నేను అందుకే శ్రమిస్తుంటాను. అది భావించినప్పుడు నా మనస్సు చాలా బాగుంటుంది. ఈ అనుభవం ప్రతి రచయితకూ కలగాలని నా ఉద్దేశ్యం. ఎవరు ఎలా వ్రాస్తున్నారని పరిశీలనలో కాలం వృధా చేయక, మనం ముందుకు పోవాలని అనుకోవాలి. ఆస్వార్ధంతో నైనా సాహిత్యం స్థాయి, నాణ్యత పెంచ గలుగుతాం.

**తులసి బాలకృష్ణ**

కథలు అచ్చు ముఖం చూసినది 1975 నుంచీ..

ఇప్పుడు అసలు పత్రికల సంఖ్యే తగ్గిపోయింది. వస్తున్న పత్రికలు కథలను బాగానే ప్రోత్సహిస్తున్నాయి.

వ్యాపారం ప్రధాన ధ్యేయం అయివ పత్రికల మీద రచయితలు పూర్తిగా ఆదారపడి, తమ శక్తిని నిరూపించుకొమ్మని వదిలెయ్యక, సాహితీ ప్రియులు సమిత్రులుగా, సంస్థలుగా ఏర్పడి, మంచి కథలు ప్రచురించి (ప్రత్యేక సంకలనాలుగా) యథాశక్తి తమవంతుగాను, ప్రభుత్వ దృష్టికి తీసుకెళ్లి, ప్రభుత్వం ద్వారానూ ప్రోత్సహించ వలసిన అవసరం ఎంతైనా వుంది.

**తిరుమల రామచంద్ర**

నేను పూర్వం ఒక రకం కథలు వ్రాశాను. కథలు, కవితలు చెప్పేవారు ఎక్కువ మంది ఉన్నారు గనుక, పరిశోధన ప్రధాన లక్ష్యంగా తీసుకొన్నాను. అయినా, చాపల్యం కొద్ది అప్పుడప్పుడు

వ్రాస్తున్నాను. గాధాసప్తశతి ఆధారంగా కథలు వ్రాశాను.

ఇప్పుడు మంచి కథలు వస్తున్నాయి. శైలి ముందు కన్నా సరళం, కథన విధానం సూటిగాను ఉంటున్నాయి. విషయ వైవిధ్యం ఇప్పుడు ఎక్కువ. పూర్వం కన్నా వివిధ విషయాలు వస్తువుగా ఎన్నో కథలు వస్తున్నాయి.

పత్రికా రచయితగా, సంపాదకుడుగా నేను పత్రికా పక్షపాతిని. పత్రికలు మొత్తం మీద సంఘ శ్రేయస్సు దృష్టితో సమమార్గంలోనే సహకరిస్తున్నాయని గట్టిగా చెప్పగలను. నిజానికి పత్రికలు అన్నీ వ్యాపార దృష్టితో స్థాపితమైనవే. కానీ, ఇవి కూడ, సంఘ విద్రోహకరంగా, ఘోరంగా ప్రవర్తించడం లేదు.

మరో విషయం నా దృష్టిలో మాండలిక మనేది ఏదీ లేదు. రచయిత తనకు పరిచయమైన భాషలో వ్రాస్తాడు. అతని రచనా బలాన్ని బట్టి ఇతరులు దానిని అర్థం చేసుకొంటారు. కన్యాశుల్కాన్ని, రాజారాంగారి రాతిలో తేమను విశాఖనుంచి చిత్తూరు వరకు, చిత్తూరునుంచి తాండూరు వరకు అందరూ అర్థం చేసకుంటున్నారు గదా, అర్థం కాని ప్రాంతీయ పదాలను తెలుసుకుంటారు. మన కథలు, రచనలు ఆంగ్లంలోకి అనువదించాలి. అప్పుడే వాటికి ప్రాచుర్యం కలుగుతుంది.

**దేవరాజు మహారాజు**

రాయకుండా వుండలేక 1968 నుండి రాస్తున్నాను.

ఎప్పటిలాగానే మంచి కథలు, చెడ్డ కథలు కలగలుపుగా వస్తున్నాయి. జీవితంలో ఇగిరిపోతున్న విలువల్ని కనీసం కథల్లో నైనా రచయితలు నిలపడం లేదే అని బాధేస్తుంది.

కథాప్రాచుర్యానికి చాలా వరకు పత్రికలే దోహదం చేస్తున్నాయి. కవిత్వానికి ఇతరత్రా వేదికలున్నాయి. కథలకు ముఖ్య వేదిక పత్రికే. అయితే పత్రికల సహకారం కొంత వరకే సరియైన మార్గంలో వెళుతోంది.

తెలుగు కథ ఇంకా పెరగాల్సి ఉంది. కొత్త ప్రయోగాలు రావాలి. సమకాలీన జీవితానికి సరిపడే కథలు రూపు దిద్దుకోవాల్సిన అవసరం ఎంతో ఉంది. రచయితల సంఘాలు, రాజకీయ చైతన్యాలు కథా రచనను తమవైపు తిప్పుకున్నాయి. జీవితం వీటన్నింటికీ అతీతమైంది. ఏనాటికీ జీవితాన్ని ప్రతిబింబించేదే ఉత్తమ కథ. జీవితంలో విలువల్ని నిలుపగలిగేదే గొప్ప కథ. గొప్పకథలు ఇంకా రావాలి. వచ్చినవి ఇతర భాషల్లోనికి పోవాలి.

**నాళేశ్వరం శంకరం**

ఓ ఐదు కథలు రాసి మానేశాను.

ఇప్పుడు వస్తున్న వ్యాపార కథల్ని పెంట మీద పారేస్తే, అప్పుడప్పుడు వస్తున్న మంచికథలు బియ్యపు గింజ మీద తాజ్‌మహల్‌ను చెక్కినట్లుగా ఉంటున్నాయి.

కథల ప్రచురణాధికారుల అభిరుచులు పాఠకుల అభిరుచులుగా మార్చేస్తున్నారు. సర్క్యులేషన్‌ను బట్టి మంచి చెడ్డ వాదోపవాదనల ప్రచారం జరుగుతోంది. మంచి కథల్ని వ్యాపార కథల కన్నా ఎక్కువగా వేయాలి. మంచి కథల్ని ప్రచురిస్తూనే వాటి మీద విమర్శనా వ్యాసాల్ని సమీక్షలుగా కాకుండా ప్రచురిస్తే బాగుంటుంది. మంచి కథలు సంవత్సరంలో అచ్చయినవి ఓ ప్రత్యేక సంచికగా వేస్తే బాగుంటుంది.

**ఎన్.కె. నాగేశ్వరరావు**

సామాజిక చైతన్యంతో 1984 నుంచి రాస్తున్నాను. ఇప్పుడొస్తున్న కథల్లో నూటికి ముప్పై కథలు మంచివే వస్తున్నాయి. మిగతా కథలుశృంగారపరమైనవి కావడం యువతను అవి పెడమార్గం పెడుతున్నాయనే నేను అభిప్రాయపడుతున్నాను. కొత్త కథావస్తువుతో యువకులు మంచి కథలు రాస్తున్నారు కూడా.

నా అభిప్రాయ ప్రకారం కథలకు దాదాపు అన్ని పత్రికలు మంచి ప్రోత్సాహాన్ని ఇస్తున్నాయి. అయితే మంచి కథల ప్రచురణకు ఇంకా సహకారం కావాలి. డెబ్బైశాతం పత్రికలు అశ్లీలం కథలను ప్రోత్సాహించడం గమనార్హం. అయితే అలాటివి ప్రచురించే పత్రికలూ అప్పుడప్పుడూ మంచి కథలను ప్రచురించడమే విశేషం.

కొత్తదనం నిండిన కథలకు ప్రత్యేక గుర్తింపు కలిగించాలి. ఆ కథలను పత్రికలు పాఠకులకు చేరే విధంగా ప్రయత్నించాలి. మంచి కథలకు నెలనెలా ప్రోత్సాహం అందించినట్లయితే యువకథకులు మరిన్ని మంచి కథలను వెలువరించడానికి ఆస్కారం కలుగుతుంది. విభిన్న ధోరణిలో కథలు రాసే ప్రముఖులు కథా సాహిత్యంపై విస్తృతంగా సలహాలు, సూచనలు అందించాలి. మంచి కథలకు మార్గదర్శకత్వం వహించాలి అందరూ.

**శ్రీకంఠమూర్తి**

పత్రికలు ఇరవై ఏళ్ళ క్రితం కథా ప్రాచుర్యానికీ, మంచి కథలకి ఎంతో ప్రాముఖ్యం ఇచ్చాయి. ఇప్పుడు ఇవ్వడం లేదు. కథలయితే ప్రచురింప బడుతున్నాయి గానీ వాటిలో క్వాలిటీ ఉండటం లేదు. అంతా కమర్షియాలిటీ. అది వారికి అవసరం గూడా. ప్రయోజనం అక్కర లేదు. సర్క్యులేషన్ ముఖ్యం. అందుకే కథలు వక్రమార్గం

పడ్డాయి. కథలు నాలుగు కాలాల పాటు గుర్తుండేలా రాయాలి. చదవగానే స్పందన కలగాలి. ప్రయోజనం, చదివించే గుణం ఉండాలి. శైలి, శిల్పం కథకి ముఖ్యం. కొత్తతరం రచయితలు వీటిని గుర్తుంచుకుంటే మంచిది. లేకపోతే కథలు కాలక్షేపం కథలవుతాయి పాఠకులు త్వరగా మరిచిపోతారు.

**పురాణం సుబ్రహ్మణ్యశర్మ**

నా అనుభవాలు, అనుభూతులు లోకానికి తెలపాలని అనిపించి రాశాను. బయట ప్రపంచంతో సంబంధం కళాత్మకంగా కథల ద్వారా ఏర్పాటు చేసుకోవాలని రాశాను.

ఇప్పుడు కూడా బాగా రాసే వారూ రాయనివారూ వున్నట్లే ఎప్పుడూ వున్నారు. నేనెప్పుడూ పిస్తోలునుగాని తుపాకీని గాని చూడలేదు. సెక్సు వయొలెన్స్ గాక ఇంకా చాలా ఉత్తేజకరమైన అనంతమైన విషయాలు లోకంలో వుండగా భావ దారిద్ర్యం దేనికి. అనువాదాలు, అనుసరణలుగాని చోరత్వం ఎక్కువైంది. మనవి కాని భావాలను తగల బెట్టడానికి అగ్గిపెట్టె ఎప్పుడూ దగ్గర వుంచుకొమ్మన్నాడు శ్రీ శ్రీ.

పత్రికల వల్లనే కథలు రాస్తున్నాను. పత్రికలు లేకపోతే కథలు లేవు.

**పురాణం శ్రీనివాస శాస్త్రి**

మా నాన్నగారు పురాణంగారు ఆధునిక రచయిత కాగా నా దత్తత తండ్రి లొల్ల శ్రీరాములుగారు పండితులు. ఇరువంశాలు సాహితీ వ్యవసాయం చేసేవే. అంచేత నాకు కొద్దిగా వయసు రాగానే రాయకుండా వుండలేని గుణం వచ్చింది. బయటి లోకానికి దగ్గరఅవడం కోసం కథ రాయడం ప్రారంభించాను. ఇప్పుడు

రాయడం మానలేదు గాని తగ్గించాను. బహుశా కన్విక్షన్ పెరగడం వల్లనేమో. సాధారణంగా వస్తున్న కథలు ఇప్పుడు బావుంటున్నాయి. కాలందాటని కథని, మినీకథని, పేజీకథని, శృంగార కథని వర్గీకరణల క్రింద వస్తున్న వాటిలో డెప్త్‌లేదు.

కథని పత్రికలు ఆదరించడమే కాదు పత్రికల మనుగడకి కథలు ముఖ్య ఆలంబనల్లో ఒకటిగా వున్నాయి. కథ నినాదం స్థాయికి దిగజారకూడదు. నచ్చిన రాజకీయ పార్టీల, గ్రూపుల కొమ్ముకాయడం నిబద్ధత కానే కాదు. కథ కళకే నిబద్ధమైతే ప్రయోజనం అధికంగా ఉంటుంది.

**వి. ప్రతిమ**

మనసును కదిలించి గొప్ప అనుభూతికి గురిచేసే సంఘటన ఏదైనా తారసపడినప్పుడు ఆలోచనల తాకిడికి తట్టుకోలేక, వ్రాయకుండా వుండలేనప్పుడు వ్రాస్తుంటాను... చాలా కాలంగా కాగితాల్ని నలుపు చేస్తున్నా నాలుగు వసంతాలుగా మాత్రమే వెలుగు చూస్తున్నాయి.

ఇప్పుడొస్తున్న వ్యాపార పత్రికలన్నీ దాదాపుగా చదవడం లేదు. కనుక ఇప్పటి కథల మీద అభిప్రాయం చెప్పే దుస్సాహసం చేయడం లేదు. అయితే తెలుగు కథకు గ్రహణం విడిచినట్లుగా ఇప్పుడిప్పుడే మంచి కథల కోసమే కొన్ని పత్రికలు వెలువడ్డం సాహిత్యాభిలాషుల అదృష్టం.

ఇప్పుడు చెప్పినట్లుగా తెలుగు కథకు పట్టిన గ్రహణం విడిచినట్లు మంచి కథా ప్రాచుర్యంకు సదాశయంగా మొదలైన 'రచన' ' 'ఆహ్వానం' విశ్వ కథా సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేస్తోన్న 'విపుల', సాహిత్యమే ధ్యేయంగా స్వాతి

(మాసపత్రిక) వంటి పత్రికల కృషి అభినందనీయం.

సంపాదకులు ఎంతటి వారయినా, ఎంత పని ఒత్తిడిలో వున్నా వచ్చిన కథలన్నీ ఫాలో చేయగలగాలి. లేదంటే కొన్ని మంచి కథలు మరుగున పడిపోయే ప్రమాదం వున్నది. అలాగే తిరిగొచ్చిన కథలన్నీ మంచి కథలు కావని రచయితలు భావించరాదు.

**కోనే నాగ వెంకట ఆంజనేయులు**

నా ఆలోచనలు కాగితం మీద పెట్టడానికే రాయడం మొదలు పెట్టి యిరవై ఏళ్ళు దాటిపోయినా వ్రాయడం యింకా మొదలు పెట్టలేదని అనుమానం. కొన్ని అద్భుతమైన కథలు యిప్పుడూ వస్తున్నాయి. కొన్ని పత్రికలు సక్రమ మార్గంలో వెళుతున్నాయి. మిగతా పత్రికలు కూడా ఆ బాట ననుసరించే రోజు తప్పక వస్తుందని నమ్మకం/ఆశ. పేరు పెద్దదయినా రచయితగా చిన్నవాడిని. రచన (గతంలో భారతి, యువ) లాంటి పత్రికలు యింకా రావాలి.

**ఎమ్ సుగుణరావు**

కథలు ఐదేళ్ళుగా రాస్తున్నాను. ఎందుకంటే నాకు తారసపడిన వ్యక్తుల్లోని గుణ విశేషాలను నలుగురికి చెప్పేందుకు, స్పందింపచేసే అనుభూతుల్ని అందరికీ పంచేందుకు, కదిలించే సంఘటనలను కథామూలంగా గుచ్చేందుకు, నైతిక విలువలపై సహేతుక దృష్టిని నిలిపే కనీస ప్రయత్నం చేసేందుకు, మానవ సంబంధాలు, మమతానురాగాల నేపథ్యంగా కలిగిన కథలు వస్తున్నాయనే సంతృప్తితో పాటు వాటిని కలుషితం చేసే కథనాలూ పత్రికల్లో అడపా దడపా దర్శన మిస్తున్నాయనే బాధ కూడా వుంది. మంచి కథను వెలుగులోకి తెచ్చేందుకు పత్రికల కృషి అనిర్వచనీయం. అయితే పత్రికలు తాము నిర్దేశించుకున్న పరిధికి లోబడడం వల్ల

లేదా తాము ఎంచుకున్న సాంప్రదాయం వల్ల కొన్ని ఉత్తమ కథలు వెలుగు చూడటం లేదేమో అని నా అనుమానం.

- మంచి కథల గురించి చర్చలు, విమర్శలు జరగాలి.

- ఉత్తమ కథలు అన్యభాషల్లోకి కూడా తర్జుమాకావాలి

- కథల మంచి చెడ్డలు విశ్లేషిస్తూ పత్రికలలో వ్యాసాలు విరివిగా రావాలి.

- బహుమతి పొందిన కథలు (పత్రికలలో) కూడిన కథా సంకలనాలు ప్రచురింపబడాలి.

**కాయితి అప్పారావు (అప్పాజీ)**

అచ్చులో నా పేరు, నా రచన చూసుకోవాలన్న తపన తాపత్రయంతో 18 వ సంవత్సరం వయసులోవున్నప్పటి నుంచీ రాస్తున్నాను. ప్రతీ కథ అతి సహజంగా, అభ్యుదయ భావాల కనుగుణంగా వుండాలన్నదే నా అభిప్రాయం. అదే ధోరణిలో 70 ఏళ్ల వయసు వరకు ప్రతీకథను చక్కగా మలచగలిగానని చెప్పగలుగుతున్నాను. నావి ఎన్నో మంచి కథలు పత్రికల వాళ్లు తిరిగి పంపించారు. కథలు అర్థం చేసుకోలేని సంపాదకులూవున్నారు. నావి అంగీకరించిన కథలూ ప్రచురింపబడ లేదు. తిరిగి పంపడం కూడా జరగలేదు. పత్రికల ఆఫీసులు మూతబడిపోయాయి.

బూతు కథలు, పెద్ద రచయితల నవలలు లేనిదే పత్రికలు నడవవనుకుంటున్న సంపాదకులు మంచి కథలు వెనుకంజ వేయడంచేస్తున్నా సాహిత్యాభిమానులు, పెద్దలు, విశ్వవిద్యాలయం మున్నగువారు మంచి కథలను పుస్తకరూపంలో విరివిగా

ప్రచురించగలగాలి. తదితర భాషలలో ఇవి అనువదించ బడేలా చూడాలి.

**దేవరాజు రవి**

హృదయ స్పందనకి అక్షర రూపం ఇవ్వకుండా వుండ లేని బలహీనత వల్ల 1959 నుంచీ రాస్తున్నాను. మంచి కథలు ఇప్పుడు - కూడా ఎక్కువగానే వస్తున్నాయి. అయితే చవకబారు బూతు కథలు, వాటిని కమ్మేస్తున్నాయి. కథా ప్రాచుర్యానికి పత్రికల సహకారం తప్ప మరో మార్గం లేదు. కథా సంకలనాలు వేసేవారూ తక్కువే! కొని చదివే వారూ తక్కువే! అంచేత వార, పక్ష, మాస పత్రికల వాళ్లు 'మంచి' కథలే ఎంచి వేస్తే, ఆరోగ్యవంతమైన కథలు వెలుగు చూసి, నాల్గునాళ్ళు బతికివుండే అవకాశం వుంది.

రాయగల సత్తా వున్న రచయితలు, కమర్షియల్‌గా మారక మంచికథలు రాయాలి. అలాంటి కథల్ని సంకలనాల రూపంలో వెలుగులోకి తీసుకు వచ్చే ప్రయత్నం అటు ప్రభుత్వం గాని, ఇటు ప్రచురణ కర్తలు గానీ చెయ్యాలి. లేదా, కొందరు రచయితలు ఒక యూనిట్‌గా చేరి కో-ఆపరేషన్ పద్ధతిలో సంకలనాల ప్రచురణ చేబట్టాలి. ఈ విషయమై రచయితలు చర్చించి, నిజాయితీగా నడుం కట్టాలి.

**గంటేడ గౌరు నాయుడు**

జీవిత వాస్తవాల్ని వాస్తవంగా చూపాలని నా చుట్టూ వున్న సమాజం, అక్కడి జీవితం, ఆ బాధ, భాష ప్రపంచానికి తెలియాలనీ, సుమారు ఐదేళ్ళుగా రాస్తున్నాను.

కుప్పలు తెప్పలుగా వస్తున్న వ్యాపార పత్రికల్లో కథల స్థితికి 'బాధ' కలుగుతున్నా మంచి కథలు వస్తూనే వున్నాయి. ఉపశమనం

కల్గిస్తూనే వున్నాయి. ఆరోగ్యకరమైన కథలు సంకలనాలుగా వస్తున్నాయి. తెలుగు కథకి మంచి భవిష్యత్తు వుందని యిప్పుడు వస్తున్న కథ హామీ యిస్తోందనిపిస్తోంది.

ఎక్కువ పత్రికలు కథను వ్యాపార వస్తువుగా చేస్తున్నా మంచి కథలు రాసే రచయితలు లేరని, మంచి కథలు పంపించలేదని కొందరు సంపాదకులు హాస్యాస్పద ప్రకటనలు చేస్తున్నా రచన, ఆహ్వానం వంటి పత్రికలు మంచి కథలకు వేదికలుగా వుంటున్నాయి. కథా ప్రభ శీర్షికలో ఆంధ్రప్రభ కూడా చెప్పుకోవాలి.

కథ కోసం తరచు చర్చలు జరగాలి. కథా సదస్సులు ఏర్పాటు కావాలి. కథా వేదిక, కథా సాహితి వంటివి విస్తృతంగా... అన్నీ ప్రాంతాలలోనూ ఏర్పడాలి.

వ్యాపార పత్రికలు ఆత్మ విమర్శ చేసుకుని "సొంత లాభం కొంత మానుకుని మంచి కథలను ఎంచుకోవాలి"

**ఐ.వి.యస్. అచ్యుతవల్లి**

నేను సుమారు 1960 నుంచి వ్రాస్తున్నాను 60 నుంచి 80 దాకా ఎక్కువగా కథలే వ్రాసేదాన్ని. చిన్నప్పుడు బుచ్చిబాబు, మాలతీ చందూర్ యన్నార్ చందూరు రచనలు చదివేదానిని. వాళ్ల భాష తేలికగా చదవగలిగేట్లు వ్రాయగలిగేట్లు వుండటంతో అవే ఎక్కువగా చదివే దానిని. నేను కూడా వ్రాయగలను అనే ధైర్యం వచ్చింది వ్రాయడం ప్రారంభించాను. వేయి కథలు చదివాక వ్రాయటం మంచిది అని ఒకసారి మాలతీ చందూర్‌గారు ప్రమదావనంలో జవాబు ఇచ్చారు. అప్పటికి లెక్కపెట్టుకుని వెయ్యిచదవటం అయిందని రూఢి పర్చుకుని వ్రాయటం ప్రారంభించాను. ఇప్పటి

కథలు సాంసారిక పరిధి దాటి సామాజిక ఇతివృత్తంతో అల్లబడి ఒక విధమైన మానసిక ఉన్నతికి తోడ్పడుతున్నాయి. ఇప్పటి కథల వల్ల మానసిక ఆలోచనాసరళి ఉన్నత గతిలో వుంటుందనే అనుకుంటున్నాను. కథలకి వారమాస పత్రికలు తమ వంతు సహకారాన్ని అందిస్తున్నాయనే చెప్పాలి. కొంత వరకు సెక్స్, క్రైమ్ మిళితమయిన సాహిత్యాన్ని పాఠకుల మీద బలవంతంగా రుద్దుతున్నారనే బెంగగా వుంటోంది. కొన్ని మంచి కథలు కూడా వస్తూనే వుంటాయి.

ఇప్పుడు వస్తున్న అన్ని పత్రికలూ బాగానే వున్నాయి. కాని సాహిత్య పరంగా పాఠకుల మనస్సులో చిరకాలం ముద్ర వేసుకోగలిగే కథలుకాని కవితలుకాని లేవేమో అన్పిస్తోంది. ఎప్పుడో నేను చదివిన అమరేంద్ర కథలు "వెలుగు నీడలు" చైత్ర పూర్ణిమ (భారతిలోనిది) మాలతీ చందూర్ లవ్ కార్నర్ యన్నార్ చెందూర్ మంగుళూరు మెయిల్ తర్వాత నేను చదివిన ఒక్క కథ కూడా జ్ఞాపకానికి రావటం లేదు అంటే ఏమిటి?

**ఇందూ రమణ**

1977 నుండి కథలు రాస్తున్నాను. ప్రయోజనం కంటే ప్రలోభం ప్రాముఖ్యం వహిస్తోంది. చెట్టు ముందా విత్తుముందా అన్నట్లు పాఠకుడి కోసం పత్రిక, పత్రిక కోసం పాఠకుడు. ఈ ఇద్దరి మధ్యా రచయిత ఏం రాస్తున్నాడో అతనికే తెలియని అయోమయ పరిస్థితి. కొన్నాళ్ళ క్రితం కవిత, నేడు కథానిక, రేపు నవల కాల గర్భంలో కలిసి పోతాయోమోనని పిస్తోంది. ఆదరించే పత్రిక ఉంటే ఉత్తమ సాహిత్యం ఎందుకురాదు?

**ఎల్. ఆర్ స్వామి**

జీవితంలో ఎదురైన కొన్ని అనుభవాలని, అనుభూతులనీ, నలుగురికీ అందచెయ్యాలనే ఉద్దేశ్యంతో 1988 నుంచి వ్రాస్తున్నాను. ఇప్పుడు కొన్ని మంచి కథలు వస్తున్నాయి. మంచి కథలు ప్రచురణ విషయంలో పత్రికల సహకారం ఇప్పుడు ఎప్పుడూ వుంటూనే వుంది. మిగతా సాహిత్య ప్రక్రియల లాగా, కథా రచన కూడా ఒక సాహిత్య ప్రక్రియ. కలకాలము నిలిచిపోయే కథలు వ్రాయాలంటే కథా వస్తువులోనే కాక రచనా విధానము కూడా నూతనత్వము ఉండాలి. పాఠకుని మనసుని కదలించే విధముగా, మనస్సుకు హత్తుకుపోయే విధంగా ఉండాలి రచన. నేటి కథలు చదువుతూ ఉంటే, కథా శిల్పముపై ఎక్కువ శ్రద్ధ చూపవలసిన అవసరము ఉందని అనిపిస్తోంది.

**ఎ. ఎన్. జగన్నాథ శర్మ**

సుమారుగా రెండు దశాబ్దాల నుంచి కథలు రాస్తున్నాను. ఎందుకు రాస్తున్నానంటే నన్ను నేను సంస్కరించుకునేందుకు, నా చుట్టూ ఉన్న వారిని సంస్కరించేందుకే. మంచి కథలొస్తున్నాయి. భ్రమల్లేని జీవితాన్ని యువ రచయితలు ఆవిష్కరిస్తున్నారు. సమస్యలకు స్పందిస్తున్నారు. సాహిత్య లక్ష్యాన్ని తెలుసుకున్నారు. మంచి కథను పత్రికలు ఎప్పుడూ మరిచిపోవడం లేదు. దానికి సరైన గుర్తింపును ఇస్తూ వస్తున్నారు. పోటీ కథలనో, ఫలానా ప్రసిద్ధ రచయిత ఎన్నిక చేసిన కథలనో మంచి కథలను పత్రికలే ప్రచారం చేస్తున్నాయి. సాహిత్యంలో 'కథ' చాలా గొప్పది ఆధునిక కాలానికి సరైన సాధనం ఇది. దీనిని ఆవాహన చేయడమే రచయితల

కర్తవ్యం అంటాను. జీవితంలో మూడంటే మూడు అంశాలు ఇష్టపడేటట్టు చేసుకోవాలి. అవి: కథ చదవడం, కథ వ్రాయడం. కథ కోసం కథతో కథలా జీవించడం.

**చలసాని ప్రసాదరావు**

-1956లో17 వ ఏట నుండి రాస్తున్నాను కథలు వ్రాయడం చాలా తక్కువ ఇతర రచనలు ఎక్కువ. ఇప్పుడొస్తున్న కథల్లో 25% మంచి అభిప్రాయం 75% నచ్చవు. పత్రికలు కథకు చేస్తున్న సేవ స్వల్పం హాని అధికం. బహుకొద్ది పత్రికలే బాధ్యతగా వ్యవహరిస్తున్నాయి.

కథలు మంచివి రావాలంటే వాటి ప్రచురణావకాశాలు పెరగాలి. ఆ పరిస్థితి ఉంటే తప్పక మంచి కథలు వస్తాయి.

**వి. రాజారామ మోహనరావు**

వీలున్నంత ప్రయోజనకరంగా భావనలు పంచుకునేందుకు వాటిని పెంచుకునేందుకు ముప్పై ఏళ్ళ నుంచీ రాస్తున్నా. ఇప్పుడు తక్కువగానే అయినా మంచి కథలూ వస్తున్నాయి. ఇప్పటి మెజారిటీ పత్రికలకి కథా ప్రాచుర్యం ప్రధాన విషయం కాదు. పేరుకే కథల పత్రికలు. అందువల్ల జరిగే కొంచెం మంచినేనా ప్రముఖంగా చెప్పుకోవాలి.

ఈ మధ్య కొంత కాలంగా చాలా మందిలో మంచి కథపట్ల ఆసక్తి పెరుగుతోంది. ఈ ఆసక్తి ప్రయోజనకరంగా రూపుదిద్దు కోటానికి, ఇలాంటి సమావేశాలు మంచి కథా సంకలనాలు తోడ్పడతాయి. కథని పెంచి పోషించటానికి ఇలాంటి కార్యక్రమాలకి గట్టి ఆర్థిక బలం అవసరం. అందరూ కలిసి ముందు ఆ పని

చెయ్యాలి. ఆ తర్వాత మిగిలిన పథకాలు సుగమం అవుతాయి.

**భూపాల్**

కథల ద్వారా సమాజం మారుతుందన్న నమ్మకం లేదు. కొంత కుళ్ళును ఎత్తి చూపవచ్చు. ఆ మార్గంలో నా కథలు లోకానికి ఏ మాత్రం ఉపయోగపడినా తృప్తిపడతాను. అందుకే రాస్తున్నాను. 1981 లో ఒక కథ ప్రచురించబడింది. కానీ 1989 నుండే తరుచుగా రాస్తున్నట్టు లెక్క.

ఇప్పుడు కథలు సుమారుగా వస్తున్నాయి. అయితే మంచి కథల సంఖ్య చాలా తక్కువ. కథలు ఊహాజనితంగాకూడదు. జీవితాలకి దగ్గరగా ఉండాలని నా అభిప్రాయం. ఒకటి రెండు పత్రికలు మినహా రచయితలకు సహకారం అందిస్తున్న పత్రికలు నాకు తోచలేదు. అంతా వ్యాపార ధోరణేవుంది. రచయితకి 'రచన' అమ్మకం వస్తువైపోరాదు. కొందరు రచయితలే అమ్ముడు పోతున్నారు. ఇక మంచిని ప్రోత్సహించే మార్గమేదీ? రచయిత ప్రతీ జీవన విధాన లోతుల్ని గమనించాలి. మంచి అవగాహనతో రాయాలి. రచయితలమైన మనం నిప్పులు చిమ్ముకుంటూ నింగికి ఎగిరిపోతే నిబిడాశ్చర్యంతో నీరు నెత్తురు కక్కుకుంటూ నేలకు రాలిపోతే నిర్దాక్షిణ్యంగా నీరే....'' ఇలా ఎందుకు జరుగుతోందో గమనించాలి.

**ముద్దంశెట్టి హనుమంతరావు**

నేను కథలు 1950 నుంచి రాస్తున్నాను. తెలుగు సాహిత్యానికి యితోధికమైన సేవ చెయ్యాలన్న కోరికతో కథలు రాయడం ప్రారంభించాను. నేను కథలు సమాజంలోని వ్యక్తులను కొంతయినా ప్రభావితం చేస్తాయన్న ఆశతో కూడా రాస్తున్నాను. ఇప్పుడు కొన్ని మంచి కథలే వస్తున్నాయి. అయితే ఎక్కువ శాతం కథలు సెక్సు,

హింస కథా వస్తువులుగా వస్తున్నాయి. ఈ రెండు మారాలి. సామాజిక స్పృహగల మంచి కథలు రావాలి. మంచి కథలు ప్రచురించాలన్న సత్సంకల్పం అన్ని పత్రికల వారికీ వున్నట్టు తోచదు. పాఠకులకు వుత్తేజం, వుల్లాసం కలిగించే కథలే చాలా వరకు ప్రచురింపబడుతున్నాయి. ఈ పద్ధతి సమాజానికి చేటు కల్గిస్తున్నది. మంచి కథల ప్రచురణకి పత్రికల సహకారం యెంతో అవసరం. తెలుగు కథ క్షీణ దశలో వుందంటే నేను ఒప్పుకోను. తెలుగు కథ యేయితర భాషా కథకీ తీసిపోదు. అయితే సరైన ప్రోత్సాహం అవసరం. ఆ సహకారం పత్రికల వార్నించే రావాలి. కేవలం బడుగు వర్గాల గురించి రాసినవే మంచి కథలు అనుకోవడం పొరపాటు. ప్రతివ్యక్తీ సమాజంలో జీవిస్తున్నవాడే. సమాజంలోని ఎవరి గురించి రాసినా సామాజిక స్పృహగల రచనలనే నా అభిప్రాయం.

**నిఖిలేశ్వర్**

గత 34 సం.ల నుంచి సంవత్సరానికి ఒక కథ చొప్పున రాస్తున్నాను. దాదాపు అన్ని కథలూ పత్రికల్లో వచ్చాయి. రెండు కథలు హిందీ ఇంగ్లీషులోకి అనువదించ బడ్డాయి. ఉద్యమపరంగా కవిత్వంపై, విమర్శపై నా దృష్టి ఎక్కువ సామాజికంగా వస్తున్న మార్పులపై, విప్లవ పోరాటాల నేపథ్యంలో, మనిషి జీవితాన్ని మతపరంగా, విద్యాపరంగా రాజకీయాల వెలుగునీడల్లో మానవ సంబంధాలను చిత్రించాలని నా ప్రయత్నం.

ఇప్పుడు తెలుగు కథానిక పునరుజ్జీవనం పొందుతున్నది. ప్రతిభావంతులైన యువ కథా రచయితలు 20 మందికి పైగానే వున్నారు. ఉద్యమాలపై, స్త్రీలు, దళితుల సమస్యలపై, కార్మిక రైతాంగశక్తిపై సీరియస్ కథలు రావలసిన అవసరం వుంది.

పత్రికల సహకారం ఇప్పుడిప్పుడే సరైన దారిలోకి వస్తున్న సూచనలు కనపడుతున్నాయి. మన ఎడిటర్లు సామాజిక బాధ్యతతో తమ ధర్మాన్ని నెరవేర్చ గలిగితే ఉత్తమ కథానికకు సరైన ప్రాచుర్యం లభించగలదు.

ప్రస్తుతం తెలుగు కథానికపై నిర్మాణాత్మకంగా చర్చ కొనసాగాలి. పత్రికల్లో కథానిక ప్రక్రియపై విమర్శలు అన్ని కోణాలనుంచి రావాలి. ఉత్తమ కథలను ఇంగ్లీషు, హిందీ భాషల్లో అనువదించే కార్యక్రమాన్ని ముమ్మరంగా చేపట్టాలి. ప్రతి సంవత్సరం వీలైనన్ని కథా సంకలనాలు రాగలిగితే మంచి కథలు అందరికీ అందుబాటులో వుంటాయి.

**నిమ్మలపూడి రమేష్ కుమార్**

1990 నుండి నా ఆలోచనలు నల్గురికీ పంచాలని రాస్తున్నాను. ఇప్పుడొస్తున్న కథల్లో మంచి కథలు తక్కువ. చెడ్డ కథలు అతి ఎక్కువ. మంచి కథలను, సాహిత్యపరమైన కథలను ప్రోత్సహించడం పత్రికలకే సాధ్యం. శృంగారం, బూతు, వల్గారిటీ, హింస ఇలాంటి కథలని పత్రికలు ప్రచురించడం మానేసి, సమస్యలోంచి పుట్టుకొచ్చే కథలను, ఆవేదనలోంచి వచ్చే కథలను, సాహిత్యంలోంచి గుండెలోతుల్లోంచి వచ్చే కథలను ప్రచురిస్తే తప్పకుండా మంచి సాహిత్యం వస్తుంది.

తల్లికి పిల్లలు ఎలా భారంకారో అలాగే రచన కూడా ప్రతి రచయిత భారంగా ఫీల్ అవ్వకుండా చదవాలి. ప్రతి రచయిత, రచయిత్రి రచన నుండి ఏమీ ఆస్వాదించకుండా రచనలు చెయ్యాలి. సాహిత్యాన్ని బ్రతికించాలి. తల్లి తమ పిల్లల దగ్గర్నించి ఏమి ఆశించకుండా వారి భవిష్యతు గురించి ఎలా ఆలోచిస్తుందో అలాగా ప్రతి రచయిత రచనకీ తల్లిలా ఉండాలి. అప్పుడే సాహిత్యం నిలుస్తుంది కాదంటారా?

**పట్టిసపు రాధా మహాలక్ష్మి**

నాకు కలిగిన అనుభవాలు, అనుభూతులు నలుగురితో పంచుకోవాలి అని 1959 నుండీ రాస్తున్నాను.

అభ్యుదయ భావ పరంపరతో ప్రజాక్షేమాన్ని ఆశించి కొందరు రాస్తే, ప్రజల్ని ఎంత ఏడిపిస్తే అంత మంచిది (అవార్డులు పొందవచ్చును) అని, నగ్న సత్యాలను చెప్తున్నామని మరికొందరు రాస్తున్నారు. కథ కాని, నవల కాని చదువుతున్నంతసేపూ రిలీఫ్ వుండేటట్లు వుండాలి.

పేరు తెచ్చిన రచయితల చేతే వీలైనంత వరకూ రచనలు సాగిస్తే వ్యాపారానికి భంగం రాదను కోకుండా కొత్త రచయితలకి కూడా ప్రోత్సాహమిచ్చి అన్ని విధాల సహకరించాల్సింది పత్రికలేనని నా అభిప్రాయం. కొందరికి పేటెంట్ రచయితలుంటారు..

వేరు వేరు ప్రాంతాల నుండి ఉత్పన్నమయ్యే రచనల్ని, ఆయా రచయితల్ని ప్రోత్సహిస్తే మనకి మన దేశం గురించి స్పష్టంగా తెలిసే అవకాశం వుంటుంది. రచయితలకి అచ్చుకావడమే తమ అదృష్టం. తమకు వచ్చిన పేరుని నిలబెట్టుకోడానికి తపన వుంటుందంటే అది తప్పుకాదు.

**పాలకోడేటి సత్యనారాయణరావు**

మొదట్లో కేవలం కథలు ప్రచురితం కావాలన్న కాంక్షతోనే రాసాను క్రమంగా మన చుట్టూ మనస్తత్వాల చిత్రణకు ఇది వీలైన మార్గమని తోచి కథారచన సాగించాను 1967 నుండి.

ఒక్క 'రచన' పత్రికలో తప్ప మరెక్కడా కథారచయితకు

అస్సలు గౌరవం లేదు. కథా రచన పట్ల రచయితలకు ఆసక్తి తగ్గటానికి ఇదొక కారణమూ కావచ్చు..

**పి. యస్. నారాయణ**

కాలాక్షేపానికి ఉపయోగించేలా మనస్సులకు సేద తీర్చేటందుకు 1960 నుండి వ్రాస్తున్నాను.

అప్పుడప్పుడు మంచి కథలు వస్తున్నాయి.

కథలకి పత్రికల సహకారం ఏమాత్రాం లేదు. పాఠకులకు అదృష్టం బావుంటే ఎవరైనా రాసిన మంచి కథ ప్రచురణలో కనబడుతుంది. సర్క్యులేషన్ పెరగటానికి పాఠకుల పల్సు పట్టుకు కూర్చుంటున్నట్లున్నది ప్రస్తుత పత్రికల ధోరణి.

మంచి కథలు రావాలి.

**పోలా ప్రగడ రాజ్యలక్ష్మి**

ఆనాటి నుండి ఈనాటి వరకూ సాహిత్యం సవిమర్శతో చదవడం అలవాటు. నేను కథలు ఎందుకు రాస్తున్నానంటే రచన చేయడంలో ఆసక్తి ఉంది. రచన తరువాత చదువుతే, ఒక రకమైన తృప్తి ఉంది. కళలన్నీ మనుషులకూ, మనసులకూ టానిక్కులా బలాన్ని ఇస్తాయనీ 1964 నుంచీ రచనలు చేస్తున్నాను. ఇప్పుడు వస్తున్న కథలు, సంఖ్యలో ఎక్కువగానే ఉన్నాయి. కాని కథానికా విధానం కొరవడుతోంది. కథరాయడం కత్తి మీద సామువంటిది. తక్కువ మాటల్లో ఎక్కువ అర్థాన్ని స్ఫురింపచేయాలి. అదే కొరవడుతోంది. అయినా కొంతమంది రాసేవారు ఉన్నారు ఇంకాను.

కథా ప్రాచుర్యానికి పత్రికల సహకారం ఇప్పుడు సరిగాలేదు. కథ బాగుండనప్పుడు మొహమాట పడి, వాళ్ళేమనకుంటారో అని

వేస్తున్నారు. బాగా రచనలు చేయగలిగిన వాళ్లు తక్కువ రాస్తున్నారు అని ఊరుకోకుండా అడిగి మరీ రాయించాలి.

ఈనాటి మన రచయితలు, వచ్చే తరం వారికి మార్గదర్శకంగా ఉండాలి. సాహిత్యంతో, సంసారాన్ని, సంఘాన్ని సరిదిద్దేటట్లు చేయాలి, రచనల్లో నవరసాలుండాలి. మనసుని అలరించగలగాలి. మంచి స్నేహితులంటే ఏమిటి? మంచి రచనలే కదా! అటువంటి వారి కథలను సంపుటిగా తీసుకురావడం, జన బాహుళ్యానికి పంచడం ఎకాడమీవారు చేయవలసిన పని సరిగా నిర్వహించడములేదు. ఏడాదికో రైటర్ పుస్తకం పూర్తి ఖర్చుతో ప్రచురించి లైబ్రరీలకి అమ్మి ఆ డబ్బు రైటరుకి ఇవ్వాలి. పుస్తకం ప్రచురించిన లగాయతూ బెంగతో ఉన్న రైటరు కథ రాయడానికి తీరికేది?

**ప్రోలాప్రగడ సత్యనారాయణమూర్తి**

నా ఆలోచనలనీ, ఆనంద విషాదాల్నీ పదిమందితో పంచుకుందాం అనీ 1971 నుంచి రాస్తున్నాను.

ఇతివృత్తాల్లో వైవిధ్యం కథనంలో కొత్తదనం కనిపిస్తున్నాయి. అయితే, చిత్తశుద్ధీ, తెలుగుతనం, భాషా పాటవం లోపిస్తున్నాయి. మేధోజనితమైనవే కాని, హృదయోద్గతమైనవి రావడం లేదు. కథల్లో స్పందన, భారతీయత లోపిస్తున్నాయి.

కథా రచన సహస్ర మార్గాల్లో సాగుతుందని విస్మరించి, మూసలో పోసినట్లు ఒకే మార్గంలో సాగిన కథలే ప్రచురిస్తున్నారు. కథలతో బాటు, కథా వేదికలు, కథా చర్చలు ప్రవేశపెట్టాలి.

నిండైన కథ, గుండెని పండించే కథ, రాయాలని తపన వచ్చినప్పుడే రాయడం మంచిది. ఇతివృత్తంతో బాటు శిల్పం మీద కూడా దృష్టి నిల్పాలి. ఇది రచయితలకి నేను

చెప్పదలచుకొన్నది. రచయితలోని సమస్త భావ సంగ్రహం. ఆయన కథా సంపుటి. అందువలన అలాంటి కథా సంపుటిలు. ప్రజా బాహుళ్యానికి పంపిణీ అయ్యే మార్గాలు ఆలోచించాలి. ఇది ఇతరులకు చెప్పదలచుకొన్నది.

**ప్రతాప రవిశంకర్**

మనసులోని భావాలను వ్యక్తీకరించు కోవడం కోసం.. అనుభవాలను కథల ద్వారా పదిమందికీ పంచి, మంచి అనుభూతులను వారి మనసులో వుంచటానికి 1971 నుంచి కథలు రాస్తున్నాను.

ఇప్పుడొస్తున్న కథల్లో వస్తువుకు ప్రాధాన్యం లేదు. కేవలం చిన్న చిన్న అనుభవాలతో కథలను తయారు చేసి పత్రికల మీదకు వదలడం చేస్తున్నారు. ఎనభై శాతం వరకూ వేగంగా చదివించి వేగంగా మరిచి పోగలిగే కథలే వస్తున్నాయి. అంటే ఆలోచింపజేసే గుణం, ఓ అనుభూతిని మనసులో వుంచే లక్షణం ఇప్పుడొస్తున్న ఎక్కువ కథల్లో వుండడం లేదు. ఆంధ్రప్రభ, రచన లాంటి ఒకటి రెండు పత్రికలు తప్పించి కథలను ప్రోత్సహించడంలో పత్రికల సహకారం అంతగా లేదు, కొన్నాళ్లలో పత్రికల్లో కథలు పూర్తిగా మాయమయ్యే లక్షణాలు కనబడుతున్నాయి. ఇవి ఆరోగ్య పత్రికలుగా కొన్ని, చిట్కాల పత్రికలుగా కొన్ని మారిపోయే సూచనలు బాగా కనపడుతున్నాయి. మంచి కథయినా, మంచిది కాని కథయినా రచయితను వదిలి పత్రికల్లో అచ్చయితేనే పాఠకులను చేరుకునేది. అలా చేరుకోకుండా పత్రికలు వాటిని అడ్డుకుంటే నిరాశపడిన గొప్ప కథా రచయిత కూడా కథ రాయకూడదనే నిర్ణయించుకుంటాడు అంటే కథలను ప్రోత్సహించడం అనేది పాఠకుల కంటే కూడా పత్రికా సంపాదకుడి బాధ్యత.

**ప్రభాకర్ మందార**

మొదట్లో నలుగురి దృష్టిలో పడాలని రాశాను. ఇప్పుడు నలుగురూ మెచ్చాలని రాస్తున్నాను. నాలుగు డబ్బులు వస్తాయని రాస్తున్నా- 1980 నుంచి.

గొప్ప కథలు, మంచి కథలు, మామూలు కథలు, చెత్త కథలు ఇవి ఇప్పుడే కాదు, ఎప్పుడూ వుండేవే! అయితే ఇప్పుడు గొప్ప కథలు, నాలుగు కాలాలు నిలబడే కథలు రావడం లేదేమో అనిపిస్తోంది.

పత్రికలు సీరియల్ నవలలకు ఇస్తున్న ప్రాచుర్యంలో పదో వంతు కథలకు ఇవ్వడం లేదిప్పుడు. స్పేస్ ఫిల్లర్స్, వెరైటీ ఐటమ్స్ స్థాయికి కథను దిగజారుస్తున్నాయి.

ఎవరు ఎన్ని విధాల ప్రయత్నించినా నవలల మాదిరిగా కథలు కమర్షియలైజ్ కాలేదు. ఇంక ముందు కూడా అవవనే నా అభిప్రాయం. మంచి కథ ఇంకా బతికి బట్ట కడ్తున్నందుకు ఇదో కారణం అనుకుంటాను. మంచి కథల్ని అభిమానించే వాళ్ళ సంఖ్య కూడా ఎక్కువగానే వుంది. వాళ్ళకి కథా సంకలనాల రూపంలో మంచి కథల్ని అందించాలి. మంచి కథల కోసం ప్రత్యేకంగా ఓ పత్రిక నడపగలిగితే (ఎవరన్నా) బాగుంటుంది.

**బలివాడ కాంతారావు**

ఊహాలు మనసులో దాచుకోలేక 1947 నుంచి రాస్తున్నాను. బొగ్గు కుప్పల మధ్య అక్కడక్కడా మాణిక్యాలు మెరుస్తున్నట్లు మంచి కథలు అప్పుడప్పుడు మెరుస్తున్నాయి ఇప్పుడొచ్చే కథల్లో.

పత్రికల సహకారం లేకపోతే కథకి ప్రాచుర్యం లేదు. కథకులే

సంపాదకులైనా - ఇతర కారణాల వలన ప్రచురించరాని కథలను ప్రచురిస్తున్నారు కొందరు. కథల గురించి ఎందరో విమర్శకులు చెప్పారు. నేను చెప్పేది ఒక్కటే ఇన్ని ఏళ్ళ శ్రమలో ఒక గొప్ప కథనైనా ముందు తరాలు గుర్తిస్తే అంతేచాలు.

**బీనాదేవి (భాగవతుల త్రిపుర సుందరమ్మ, భాగవతుల నరసింగరావు)**

బుద్ధి లేక అన్నది నిజానికి దగ్గరగా ఉంటుంది. అసలు నిజం ఏవిటంటే నేనొక్కర్తెనూ రాయలేదు. నేను, మావారు బి. నరసింగరావు కలిసి రాసే వాళ్ళం. మాంచి వయసులో వున్న రోజుల్లో "డికెన్స్" "షా" లని పిచ్చిగా చదివే రోజుల్లో ఏదో రాసెయ్యాలన్న తపన, మన రచనలతో దేశాన్ని, తద్వారా ప్రజలనీ ఉద్ధరించేద్దామన్న దురాశ, ఆ రోజుల్లోనే శాస్త్రి గారి రచనలు చదవడం ఆ దురాశని ఇంకా ఎక్కువ చేసింది. డికెన్స్ నవలల్లో రాసిన చైల్డ్ లేబరు వగైరాలు ఆ గవర్నమెంటులో కొన్ని మార్పులు తేగలిగాయి. కొన్ని కొత్త చట్టాలు ప్రవేశపెట్టేయి. అలాగే మేము కూడా మన సంఘంలో జరుగుతున్న ఘోరాలు, దారుణాలు ప్రజల ముందుంచితే ఏమైనా మార్పు వస్తుందేమోనని ఆశపడ్డాం. ఆ ఆశ ఆశగానే మిగిలిపోయింది. అది నిరాశగా మారకుండానే రాయడం ఆపేశాం.

1965 నుండి రాస్తున్నాం. అప్పుడు మాకు కథలు రాయడానికి సరిపోయే మెంటల్ మెచూరిటీ వచ్చిందని భ్రమపడ్డాం. అంతే.

"మంచి కథ చచ్చిపోయింది" అని కొందరి అభిప్రాయం. ఇంకా పూర్తిగా చచ్చిపోలేదు. ఆక్సిజన్‌తో లాగిస్తున్నారు. కథలో ఎక్కడో తప్ప హ్యూమర్ ఎలిమెంట్ పోయి కేవలం సెక్స్, క్రైమ్ లే కనిపిస్తున్నాయి. కారణాలు చెప్పాలంటే ఓ గ్రంథం ఔతుందేమో. అయితే ఒక్కటి మాత్రం నిజం. మా చిన్నప్పుడు, మా పిల్లల చిన్నప్పుడు అన్ని కథలూ చదివేవాళ్ళం. అసభ్యత కథలోగాని,

మాటలో గాని ఎక్కడా ఉండేది కాదు. పిల్లలకు సరిగ్గా తెలుగు రావటంలేదని నేను కొన్నాళ్లు తెగ బాధపడ్డాను. నా ఇంట్లో పిల్లలకి తెలుగు రాకపోవటం సిగ్గు పడవలసిన విషయం అయితే ఈ మధ్య వస్తున్న కథలు, మధ్య పేజీ కథలు చూసిం తర్వాత వాళ్ళకి తెలుగు రానందుకు నేను సంతోషించేను. ఈ పరిస్థితి బావుండదని నా కోరిక. పోవాలన్న ఆశ. పోగొట్టడం మన ధర్మం.

మేము కథలు రాసే రోజుల్లో పత్రికలు రచయితల్ని కథ లిమ్మని అడిగేవి ఇప్పుడు కథ రాస్తే వేసుకునే దాత లేడు. అందరూ ఒకటే డైలాగు "సీరియల్ రాయండి" అని, ఎబ్బే ఇప్పుడు కథలకి అంత డిమాండు లేదండీ అని స్పష్టంగా చెప్తున్నారు. సాహిత్యం బిజినెస్ అయిపోయి డిమేండు, సప్లైల గ్రాఫుల మీద ఆధారపడింది. పాఠకుల్ని సీరియల్స్‌కి నెమ్మదిగా అలవాటు చేసింది పత్రికల వారే. ఒక సీరియల్ ఉండే పత్రికల్లో ఇప్పుడు నాలుగైదు సీరియల్స్. ప్రతి వారం చివర్లో సస్పెన్స్ ఉండాల్సిందేనట. సాదా సీదా జీవితాల్లో సస్పెన్స్ ఏం వుంటుంది? మరింత క్రైమ్, సెక్స్ వగైరాలు గుప్పించాల్సిందే. టార్చర్ పోలీసుల్ని చూసి రచయితలు నేర్చుకుంటున్నారా లేక రచయితలే పోలీసులకి నేర్పుతున్నారా అన్నది తెలీదు. కేవలం తమ పత్రిక సర్క్యులేషన్‌కోసం ఇంత బీభత్సం ప్రజలకి అందించడం ఎంతవరకూ సబబు? ఇవేవీ లేనప్పుడు పత్రికలు అమ్ముడు పోలేదా? పత్రికల ప్రోత్సాహం లేకపోతే ఇన్ని సెక్స్ సీరియల్స్ ఎలా వస్తాయి.

ఏ పత్రికలో ఎన్ని కథలు వేస్తున్నారో ఒక్కసారి చూస్తే కథల ప్రాచుర్యానికి పత్రికలు ఎంత వరకు సహకరిస్తున్నాయో అర్థమౌతుంది. సాహిత్యం బిజినెస్ అయిపోయినప్పుడు కరప్షన్ తప్పకుండా ఉంటుంది. ఇందిరాగాంధీ చెప్పినట్లు "కరప్షన్ హేజ్

బికమ్ వరల్డ్ ఫెనోమెన" అని సరిపెట్టుకోవాలి మరి.

ప్రతి మనిషికీ అన్నిటితోపాటు సాంఘిక బాధ్యతలు ఉంటాయి. ఆ మనిషి డాక్టరైతే ఒక రకం, రచయిత అయితే మరొక రకం, రాజకీయ నాయకుడైతే యింకో రకం. ఇలా రకరకాలు ఉంటాయి. ఆ బాధ్యతలు గాని వాళ్లు నిర్లక్ష్యంచేస్తే అది సాంఘిక ద్రోహం ఔతుంది. చెడుని గ్రహించి నంత వేగంగా మంచిని గ్రహించక పోవడం మానవ నైజం. ఈ మధ్య అన్ని పత్రికల్లోనూ ప్రశ్నలు - జవాబులు శీర్షికలు ఎక్కువైపోయాయి. సెక్సు సమస్యలు, మానసిక సమస్యలు ఒకటేమిటి అన్ని సమస్యల్ని పాపం పత్రికలే తీరుస్తున్నాయి. మన సమస్యల్ని పత్రికా ముఖంగా పరిష్కరించు కోవడం ఏమిటి ? నాకు ఎంత బుర్ర బద్దలు కొట్టకున్నా అర్థం కావడం లేదు. నా ఆరోగ్యం బాగు లేకపోతే దగ్గర్లో ఉన్న డాక్టరు దగ్గరికి వెళ్తాను కాని పత్రిక్కి రాసి వాళ్లు జవాబు చెప్పేవరకూ జబ్బుతో కూర్చోను. నా మొగుడు తాగివచ్చి తంతూ ఉంటే అది నేను పరిష్కరించుకోవాలే తప్ప పత్రికల ద్వారా కాదు. మనిషి పుట్టిన దగ్గర్నుంచి సెక్సు ఉంది. మనసూ ఉంది. ఆ రెంటికీ సమస్యలూ ఉంటాయి. మరి ఈ పత్రికల్లో జవాబులు శీర్షికలు రాక ముందు వాళ్లంతా ఆ సమస్యలతో చచ్చిపోయారా? లేదే, అసలు ఏ సమస్య అయినా, జబ్బు అయినా డాక్టరుతో స్వయంగా చెప్పాలే కాని ఉత్తరాల ద్వారాను, ఫోను ద్వారాను కాదు. డాక్టర్లందరికి నాదో చిన్న మనవి. పేషెంటుని చూస్తే కాని ట్రీట్ చెయ్యకండి. పేరు సంపాదించడానికి మీరు మీ స్వంత శక్తితో కష్టపడి పేరు సంపాదించడానికి ప్రయత్నించండి. అంతేగాని ఈ గాలిలో వైద్యం చేసి, పత్రికల ద్వారా పాపులారిటీ కోసం పాకులాడ్డం అంత

ఆరోగ్యకరం కాదు. ఏ పత్రికా ప్రజల విజ్ఞానం కోసం, వినోదం కోసం పెట్టబడింది కాదు. కేవలం వ్యాపారం కోసమే. అంచేత వాళ్లని నష్ట పొమ్మని అనడం లేదు. కాని మీ లాభాల కోసం ప్రజల్ని మోసం చెయ్యకండి. "తమ కార్యంబు ఘటింపుచున్ పర హితార్థ ప్రాపకుల్" అని భర్తృహరి చెప్పినట్లు మీ లాభంతో పాటు ప్రజల క్కూడా లాభం ఉండేటట్లు చూడండి. ఈ ట్రెండ్ యిలాగే కొనసాగితే వచ్చే తరాలు నిర్వీర్యం అయిపోతాయి. సందేహం లేదు.

అందుకే అంటున్నాను ఇప్పటి పిల్లలకి తెలుగు రాపోవడం ఒక రకంగా అవమానకరం అయినా, వారి భవిషత్తు దృష్ట్యా మంచిదేనేమో! ఆలోచించండి.

**బాలం వెంకట్రావు**

సమాజంలోని, ఏ సంఘటన గాని లేదా మరో ఏదయినా 'విషయం' మనసులో తొలిచేస్తూ తదేకంగా ఒత్తిడి తెచ్చినపుడు దాన్ని అక్షరం రూపంలో పెట్టాలనిపించి కథగా వ్రాస్తున్నాను. మొట్టమొదటిగా 1972 లో తొలి కథ అచ్చయింది.

రెండు పత్రికలలో వస్తున్న కథల సంగతి అటుంచితే మితిమీరిన సెక్స్, వయోలెన్స్ ఇవి పాఠకులను పెడదారిలో నడిపెటట్లే వున్నవి. ఇదంతా పూర్తిగా మారి నైతిక విలువలకు ప్రాధాన్యత వుండాలి.

చాలా తక్కువ వార పత్రికలు మాత్రమే కథలకు ప్రాధాన్యత ఇస్తున్నాయి. చాలా పత్రికలు కథలకు సరైన స్థానం ఇవ్వటం లేదు. కథలు గాని నవలలు గాని దిగజారుడుతనాన్ని వదిలిపెట్టి -

మంచి చెప్పకపోయినా చెడుని మాత్రం పాఠకులకు అందివ్వకుండా కాస్తో కూస్తో సమాజానికి మేలు చేసే రచనలను అందిస్తేనే ఉత్తమమని నా అభిప్రాయం.

**డా. బి. బాలస్వామి**

సామాజిక స్పృహను కలుగజేయడానికి, వాస్తవికతను ప్రతిబింబించడానికి 1974 నుంచి కథలు రాస్తున్నాను.

కథల రాసి పెరిగినా, మంచి కథల వాశి పెరగడంలేదు. ప్రస్తుతం మంచి కథలకు సరియైన ప్రాచుర్యం, సహకారం లభించడం లేదు. పత్రికలు మంచి ప్రోత్సాహాన్ని రచయితలకు కలుగజేస్తే, మంచి కథలు తప్పకుండా వస్తాయనే ఆశ.

**భమిడిపాటి రామగోపాలం**

సరదాకి సరదా చెయ్యడానికి - 1949 నుండి రాస్తున్నాను.

వేగం పెరిగింది. కవిత్వపు సింబల్సు కొత్త ఆకారాల్లో వస్తున్నాయి. వివరణకి చోటులేక; వివరంగా తప్ప రాయలేనివాళ్లు వెనక్కి తప్పుకు(ంటు)న్నారు. "కాలం "దాటని కథల "కాలం" దాటడం లేదు. కొత్తతరం రచయితలు సమర్పిస్తున్న ఇతివృత్తాలూ, అవలంబిస్తున్న శిల్పం ."కథా భవిష్యత్తు" కు ఆశలు కల్పిస్తున్నాయి.

ప్రస్తుతం ఏడాదికి 200 కథలకన్నా రావడం లేదు, పత్రికల ద్వారా ఇంకొంచెం ఎక్కువ వస్తే బావుణ్ణు.

**భమిడిపాటి కృష్ణమూర్తి**

ఒక సంఘటన, ఒక సన్నివేశం కదిలించినప్పుడు కలిగిన భావ వ్యక్తీకరణ నా కథా రచనకాధారం. 1952 నుండి రాస్తున్నాను.

కథలలో వైవిధ్యం బాగా పెరిగింది. పత్రికలు కథలకి ఇప్పుడిస్తున్న ప్రోత్సాహం ఇంకా విస్తృతం కావాలి. తెలుగు కథలు ఇతర భాషల్లోకి అనువదింపబడాలి.

**భార్గవి రావు**

పాపులర్ లిటరేచర్ లో సాహిత్య విలువలు చెప్పాలని చాలా ఏళ్లుగా రాస్తున్నా ఈ మధ్యనే ఓ నాలుగేళ్లుగా సీరియస్‌గా రాస్తున్నాను. రెండు కథా సంపుటాలు వచ్చాయి.

ఓ పది కథలు చదివితే ఓ మంచి కథ దొరుకుతోంది. ఈ రేషియో చాలా ఏళ్లుగా ఉన్నట్టుంది. సీరియల్స్ తగ్గించి మరో నాలుగు మంచి కథలు వేస్తే ఇంకొంచెం ఎంకరేజ్‌మెంట్ వుంటుంది కథలకి దినపత్రికలు కూడా సాహిత్య పేజీలో వేసి ప్రోత్సహించడం బాగుంది.

చిన్న కథలకు మంచి భవిష్యత్తు వుంది. ఉరుకులూ,పరుగులూ ఉరకలు పరుగులు పెట్టె ఈ సమాజంలో నవలలు చదివే ఓపిక తగ్గిపోతోంది. నవలలో చెప్ప దలిచే మెస్సేజ్‌ని సూటిగా అందంగా ఎంపికైనదిగా చెప్పవచ్చు. నిరుత్సాహపడకుండా రాస్తూ పోవడమే.

**బోయ జంగయ్య**

సామాజిక మార్పు కోసం 1970 నుంచి కథలు రాస్తున్నాను. ఇప్పుడు ఎక్కువగా మసాలా కథలు వస్తున్నాయి. మసాలా దినుసులు మనిషి ఆరోగ్యాన్ని పాడు చేసినట్లు, మసాలా కథలు మనసుని పాడు చేస్తాయి. మనసు పాడైతే ఇంకేముంది ? వెర్రి ఆలోచనలు, విపరీత చేష్టలు. అందుకని మనం ఇంకా మంచి కథల సంఖ్యను పెంచుకోవలసిన అవసరమువున్నది. ఏది మంచి కథో, ఏది మసాలా కథో గుర్తిస్తూనే వున్నాం కదా.

నేటి పత్రికల వ్యాపార పోటీలో ఏది సరయిన మార్గమో కనిపెట్టే వ్యవధి లేని ఆ వేగంలో లేపుతున్న ధూళి నానా ఇబ్బంది పెడుతున్నది. ఏది ఏమైనా కథా ప్రయాణానికి పత్రికలు ఆధునిక వాహనాలు సుమా! అవి అదుపు తప్పకుండా చూసుకోవడం అందరి బాధ్యత.

మంచి కథ కంట పడితే అటు పాఠకులు పత్రికాముఖంగా తెలియపరిచితే మంచి కథలు వ్రాసే వాళ్ల సంఖ్య పెరుగుతుందని నా నమ్మకం.

**మధురాంతకం రాజారాం**

1951 నుంచి కథలు రాస్తున్నాను. సలహాగానో, హెచ్చరికగానో ఏదైనా చెప్పవలసి వచ్చినపుడు ఆ విషయం ఓ కథ రూపంలో వెల్లడిస్తున్నాను. కథలు మనిషిలోని మంచితనాన్ని పెంచాలన్నది నా అభిలాష. అర్థంలేని త్యాగాలు, అరాచకమైన చిత్రవృత్తి, అనవసర రక్తపాతాలు, హింసాప్రవృత్తి మొదలైన అవాంఛనీయ ధోరణుల్ని అరికట్టడానికి కథను ఒక సాధనంగా వాడుకోవచ్చన్నది ఆంతర్యం.

సర్క్యులేషన్ పట్ల తప్పితే సాహిత్యం పట్ల అక్కరలేని పత్రికల్లో (సెక్స్, క్రైమ్,సస్పెన్స్) సీరియల్ నవలల మధ్య కథకు స్థలభావం సమస్య ఎదురైంది. కొన్ని పత్రికలు 1, 2 కథలైనా మొక్కుబడి వ్యవహారంగా అది కూడా ఒకటీ లేక ఒకటిన్నర పేజీలకి పరిమితంగా ప్రచురిస్తున్నాయి. అలాంటి సంపాదకుల పబ్బం గడపడం కోసం చాలామంది రచయితలు కథల నడుమును విరిచి ఈ ప్రక్రియకు గ్రహణం పట్టిస్తున్నారు. ఐతే రాష్ట్రం మొత్తంపైన ఓ పాతికమంది యువ రచయతలైనా పై వ్యాపార విలువలకు మాటొడ్డి కథా రచన కోసం కృషి చేస్తున్నారు. అయితే వారి

రచనలు ప్రచురితమయ్యే అవకాశాలు సన్నగిల్లుతున్నాయి. ఏమైనా ఉత్తమ సాహిత్య ప్రభావం కోసం నడుము కట్టుకున్న పత్రికలు కూడా కొన్ని లేకపోలేదు.

ఈపరిస్థితిలో కొందరు నిష్పాక్షిక సహృదయ విమర్శకులు పని గట్టుకుని ఈ రంగంలో వ్యవస్థను నెలకొల్పడానికి పూనుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

ఇటీవల రాష్ట్రంలో పలుచోట్ల స్థానికమైన 'కథా వేదికలు', హైదరాబాదులో నెలకొల్పబడిన 'కథాసమితి'-సాధన సాహితీ స్రవంతి లాంటి సంస్థలు అప్రమత్తంగా ఉంటూ అవాంఛనీయ ధోరణుల్ని ఎప్పటికప్పుడు అరికడుతూవుండాలి. అర్థంలేని త్యాగాలను, అనవసర రక్తపాతాలను, హింసా, విధ్వంసక ప్రవృత్తులను రచయితలు బలపరచరాదు. ప్రత్యేక సంచికలు, సమీక్షా గ్రంధాలు వెలువరించే ప్రయత్నం చాలా మంచిది. వీలైతే సంవత్సరానికి మూడో నాలుగో బులెటిన్లు కూడా వెలువరించవచ్చు. - ఇటీవల హైదరాబాదులో జరిగిన కథా సదస్సులాంటిది ప్రతి సంవత్సరమూ జరుగుతూ రావాలి. ప్రశ్నల జాబితాను ముందుగానే తయారుచేసి కథకులకు అందిస్తే -చర్చ మరింత ప్రయోజనాత్మకంగా వుంటుంది.

**మధురాంతకం నరేంద్ర**

వ్యక్తపరచవలసిన విషయాల్ని వ్యక్తపరచదలచుకున్న విషయాల్ని వ్యక్తపరచడానికి 'కథానిక' (ప్రక్రియ) సహకరించడం చేత.... 1974 నుంచి రాస్తున్నాను.

యిప్పుడైనా, ఎప్పుడైనా మంచీ చెడూ రెండూ వుండనే వుంటాయి. కానీ గడచిన రెండు మూడేళ్లుగా మంచి కథలు రాయాలని కుతూహలపడే రచయితల సంఖ్య మాత్రం కొంచెం

పెరిగింది.

ఆంధ్రప్రభ వార పత్రిక, ఇండియా టుడే, ఆహ్వానం, కొంత వరకూ రచన - తప్ప మిగిలిన పత్రికలన్నీ పెడదారి పట్టి చాలా రోజులైపోయింది. ఆంధ్ర ప్రభలో మంచి కథలతో బాటు పనికి మాలిన కథలు కూడా ప్రామినెంట్‌గా ప్రచురించబడుతున్నాయి. ఇండియా టుడేకి కచ్చితమైన అభిప్రాయాలు లేవు. ఆహ్వానం యింకా తప్పటడుగుల్లోనే వుంది. రచనలో గజిబిజి యెక్కువ.

కథానికా విమర్శ చాలా తక్కువగా వస్తోంది. వస్తున్న విమర్శలు సైతం ప్రిమిటివ్‌గా వున్నాయి. నిష్పాక్షికమైన విమర్శలు లేని కథానికా ప్రపంచం వొయాసిస్సుల్లేని యెడారిలావుంది.

**మల్లాది సూరిబాబు**

ఏదైనా సంఘటనగాని, విషయంగాని, భావంగాని నన్ను స్పందింపచేస్తే - దానికి శాశ్వత రూపకల్పనే నేను రాసే కథలు. ... ఆ కథా రచనలోనే ఎంతో ఆనందం, తృప్తి గత 44 సంవత్సరాలుగా రచనలు చేస్తున్నా.

మంచి కథలు, కవితలు, రచనలు చేసేవారు చాలామంది - అన్ని తరాలు వారు, వర్గాలవారు ఈనాడు వున్నారు. కథకు, కథకుడుకు ఈనాడు మంచి అవకాశం వుంది. డబ్బు కోసం, పేరు కోసం కళని భ్రష్టు పట్టించే వారు అన్ని కాలాలలో వున్నారు. ఈ కాలంలో కూడా వున్నారు.

ఆంధ్ర ప్రభ వారపత్రిక, రచన మాస పత్రికలకు కథకుల కథలు అంటే ఎంతో గౌరవం. మిగతా పత్రికలు తమ ఆర్థిక లాభం గోసం రచనలు వాడుకుంటే కొందరు అశ్లీల, అసభ్య రచనల ద్వారా ఎక్కువ డబ్బు, ఎక్కువ అపకీర్తి మూట కట్టుకుంటున్నారు.

రచనలలో శృంగారం గోప్యంగా వుండాలి. హాస్యం హుందాగా వుండాలి. అశ్లీలతకు, బూతుకు, శృంగారానికి, ప్రేమకుగల వ్యత్యాసాన్ని సంపాదకులు గుర్తించాలి. మాదకద్రవ్యాలు ప్రోత్సహించబడడం ఎంత నేరమో అసభ్యసాహిత్యాన్ని ప్రోత్సహించడం అంతకన్నా ఘోరమైన నేరమని గ్రహించి, సరిదిద్దు కుంటే చాలు.

**మునిపల్లె బి. రాజా**

బాల్యంలో పుస్తక ప్రియులైన మా వుమ్మడి కుటుంబ సభ్యుల సంస్కార ప్రియత్వం, దేశ రాజకీయాల అవగాహన, మా తెలుగు మాష్టారి ప్రేరణ, తర్వాతి దశలో ఒంటరితనాన్ని అధిగమించటానికి రచనా వ్యాసాంగం అలవడింది. 1939-40 విద్యార్థి దశ నుండి ఈ వ్యాసాంగం కొనసాగుతున్నది.

నూటికి నూరు పాళ్లు కాకపోయినా దాదాపు ముప్పై పాళ్ళు ఆలోచనాత్మకమైన కథలే వస్తున్నాయ్. ఇతివృత్తాలు ఆధునికమైన, మానవతా ధోరణి వున్నా శిల్పం కొరవడి మరికొన్ని హృదయం మీద ముద్ర వేయటం లేదు అని నా అభిప్రాయం.

కొన్ని పత్రికలు కథలకి సహకరిస్తున్నాయి. దుష్ట సినిమా వాతావరణం అవకాశవాదకుల తత్వ రాజకీయ ధోరణులు సమాజాన్ని పెడదారిని పట్టిస్తున్నాయి, ముఖ్యంగా యువతను. వ్యాపార పత్రికలు ఆ సంస్కృతికి పరోక్షంగా దోహదం చేస్తున్నాయి కదా...

ఈ అంధ యుగాన్ని తరింప జేయటం సమాజ హితాన్ని కోరే రచయితల తక్షణ బాధ్యత. మంచి సాహిత్యాన్ని, మేళాత్మక విలువలున్న సినిమాలను, టి.వి. చిత్రాలను చౌకగా ప్రచురించే, నిర్మించే వివిధోపాయాలను మనం అన్వేషించి ఆచరణలో పెట్టాలి. ఆ దిశలో ఎంత చిన్న ప్రయత్నాన్నైనా అరమరికలు లేక మన

మందరం ప్రోత్సహించాలి. ఉడత గూడా రాముడి సేతు నిర్మాణానికి తోడ్పడలేదా? మంచి పుస్తకాలను ప్రతి గ్రంథాలయం ఎప్పటి కప్పుడు కొనుగోలు చేసే పద్ధతి గ్రంథాలయ చట్టంలో జరూరుగా రావలసిన మార్పు. ఇప్పటి పైరవీ పద్ధతి సాహిత్యానికెంతో హాని.

తక్షణం అన్ని జిల్లా ముఖ్య పట్నాల్లోనూ, కేంద్రాలుగా వున్న యితర పట్నాల్లోనూ - రచయితల సహకార సంఘ పుస్తక విక్రయ శాలల్ని కొద్ది శ్రమతో ఏర్పరచుకోవచ్చు. ఇది అసాధ్యం గాదు. కేరళలో విజయవంతంగా నడుస్తున్నది. నాకు ప్రత్యక్షంగా తెలిసిన విషయం ఇది.

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి విశ్వవిద్యాలయమూ, ఇంటర్మీడియేట్ బోర్డ్ వంటి సంస్థలూ - చిన్న నవలలనూ, కథా సంపుటాలను డిటైల్డ్/నాన్-డిటైల్డ్ టెక్స్ట్సు గా చేస్తే విద్యార్థుల అభిరుచి లో మంచి మార్పులు తప్పక రాగలవు. రచయితలు - విద్యా మంత్రితోనూ, ముఖ్యమంత్రితోనూ చర్చించవచ్చు. గ్రంథాలయ సంస్థల చట్టంలో రావలసిన మార్పులను గురించిన వివరాలు విజయవాడ ప్రచురణ కర్తల సంఘాధ్యక్షులు రామమోహనరావు గారు సేకరించారు. వారికి దోహదంగా రచయితలు ప్రభుత్వంతో చర్చిస్తే మంచి ఫలితాలు వుండగలవు. సినిమాల ధోరణిని, ఆత్మ వినాశక చర్యల్ని, అశ్లీలాన్ని, హింసా ప్రోద్బలాన్నీ అరికట్టాలంటే ప్రతి పెద్ద పట్టణంలోనూ - ఒక థియేటర్ - కేవలం ఉత్తమ చిత్రాలు (ఆర్టు చిత్రాలతో సహా) ప్రదర్శించేది వుండాలికదా. ఒక చట్టంతో పబ్లిక్ ఇంట్రస్ట్ కింద ఒక హాలును ఎక్వైర్ చెయ్యటమో, రిక్విజిషన్ చెయ్యటమో ప్రభుత్వం చేయవచ్చు. మనమంతా కలిసి శాసన సభ్యులతో పార్లమెంటు సభ్యుల్తో, ఎందుకు చర్చించటం లేదు. వెంటనే ఈ ఉద్యమం చేపట్టాలి. మనం రాయటమే కాదు, మన సంస్కృతిని రక్షించుకోవాలనే పట్టుదల గూడా వుండాలి గదా. ఇవేవీ కలలు కావు, సాధ్యాలు.

**మారెళ్ళ మల్లికార్జున రావు (ఛాయామల్లిక్)**

నేటి సమాజంలో వస్తున్న మార్పులు, వాటి పర్యవసానాలకు ప్రతి స్పందనలే నా కథలు.

ఒకనాటి తులసి వనంలో ప్రస్తుతం గంజాయి (కలుపు) బాగా పెరిగిపోయింది. రచయితలు, సంపాదకులు ఒకరి కొరకు సహకరించు కుంటూ ప్రజలను మరచిపోతున్నారు. ఇప్పుడిప్పుడే వాస్తవ దృక్పధంగల కథలకు ప్రాచుర్యం లభిస్తోంది.

నా ఉద్దేశంలో కథా రచన ఒక ప్రయోగం. ఒక కథ ప్రచురింప బడిందంటే రచయిత భాధ్యత మొదలయినట్లే! పాఠకుల దృక్పధంలో తానాశించిన మార్పు కనబడినప్పుడే రచయిత కృతకృత్యుడౌతాడు. ఆ మార్పు మంచికైనా, చెడుకైనా రచయితే బాధ్యుడు.

**ఆర్.ఎస్.కె. మూర్తి**

1967 నుంచి - పాఠకునిలో మంచిని పెంచటానికి మన దైన జీవన దృక్పధాన్ని సృజనాత్మక రచనల్లో ప్రతిబింబింప జేయటానికి రాస్తున్నాను.

ఇప్పుడొస్తున్న వాటిలో కొన్ని మాత్రమే మంచి కథలుగా నాకు తృప్తినిస్తున్నాయి. అన్నీ ఇట్లాగే ఉంటే బాగుండు ననిపిస్తున్నాయి.

కాలం సీరియల్సుది కదా! అయినప్పటికీ కొన్ని పత్రికల నుండి కథలకి పూర్తి సహకారం లభిస్తున్నది. చాలా పత్రికల నుండి రావటం లేదు.

రచయితలు చెట్టు కొకరు పుట్టకొకరుగా ఉంటారు. పాఠకుల మూస ఉత్తరాలు తప్ప వారికి ఫీడ్ - బేక్ సౌకర్యం లేదు. సదస్సులు, సమావేశాలు బాగా జరగాలి. రచయితల మధ్య స్నేహభావం పెంపొందాలి. పాఠకులకో, పత్రికాధిపతులకో నచ్చిందే నేను వ్రాస్తాననకూడదు. మేము వ్రాసింది పాఠకులు చదవాలి. చదువుతారు. ఎందుకంటే, నా కమిట్‌మెంట్ పాఠకునికీ, పాఠకునిలో మంచిని పెంచటానికీ' -అన్న ధైర్యం రచయితలలో పెరగాలి. పెరిగేటంత వరకు మనందరం విశ్రమించకూడదు.

•

**కె.కె. మీనన్**

చుట్టూ వున్న సామాజిక పరిస్థితులకు స్పందించి 1962 నుంచి రాస్తున్నాను.

ఇప్పుడొస్తున్న కథలు చాల వరకూ బావుంటున్నాయి. ఇంతకు ముందు రచయితల కంటే యువరచయితలు బాధ్యతాయుతంగా కథలు రాస్తున్నారు.

కథలకి పత్రికల ఆదరణ సరిగా లేదు. వ్యాపార సరుకుగాని కథని పత్రికలు చిన్నచూపు చూస్తూనే ఉన్నాయి.

**చొక్కాపు వెంకట రమణ**

సమాజంలో, జీవితంలో ఏదైనా సంఘటన నన్ను స్పందింప జేసినప్పుడు నాలో ఆవేదనను, ఆవేశాన్ని నలుగురితో పంచుకొనేందుకు కథలు 1969 నుండి రాస్తున్నాను.

కథలు వ్యక్తి సంస్కరణకు తోడ్పడాలి. ఆలోచింప జేయాలి. మానవతా విలువల్ని నిలబెట్టాలి. ఆ తరువాతే సామాజిక సంస్కరణ. ఇప్పుడొస్తున్న కథల్లో ఒక వైపు ఉద్యమ సాహిత్యం మరోవైపు

విశృంఖల శృంగారం నిండి పోయింది. రెండు ధోరణులూ ఆరోగ్యకరమైనవి కావు.

పత్రికల్లో వ్యాపార ధోరణి పెరిగి పోయింది. పాఠకుల్లోని బలహీనతను పసిగట్టి అలాంటి కథలు ప్రచురిస్తూ, వాళ్ళ అభిరుచిని దిగజారుస్తున్నాయి. మంచి కథల్ని పాఠకులు ఎప్పుడూ ఆదరిస్తారు. కొన్ని పత్రికలు అందుకు కృషి చేస్తున్నాయి.

కాలానుగుణంగా రచయిత దృక్పథంలో మార్పు రావాలి. ఒకప్పుడు మంచి కథలు రాసిన రచయితలు అస్త్రసన్యాసం చేసిన సీనియర్ రచయితలు మళ్ళీ పూనుకొని కథలు రాయాలి. అవగాహన లోపం ఉన్నప్పటికీ మంచి కథలు రాయగల యువతరం రచయితలకు స్ఫూర్తినివ్వాలి. మార్గదర్శకత్వం వహించాలి. అందుకు పత్రికలు, పబ్లిషర్లు కూడా సహకరించాలి. ఈ మధ్య జరిగిన కథాస దస్సు' కథా రచయితలకు మంచి ఊపు నిచ్చింది. 'కథ'కు ముందు మంచి రోజులు రాబోతున్నాయనే ఆశ కలుగుతోంది.

**బి. బి. జగన్మోహన్రావ్**

'మంచి రచయిత' అనిపించు కోవాలని సుమారు పదేళ్లుగా రాస్తున్నాను. ఇప్పుడొస్తున్న కథల్లో నిడివి తగ్గింది. తక్కువ పేజీల్లోనే ఎక్కువ కథను చెప్పగల్గుతున్నారు. మరో విషయం ప్రస్తుతం పత్రికల్లో కథల సంఖ్య తగ్గిపోయింది. పెరగాల్సిన అవసరం వుంది అని నా అభిప్రాయం.

**యామినీ సరస్వతి**

కథ రాయాలనే తపన, ఏదో చెప్పాలనే కోరికతో 1962 నుంచీ రాస్తున్నాను.

ఒకప్పుడు మంచి కథ రాస్తే అచ్చవుతుందనే అభిప్రాయంతో పత్రికల స్టాండర్డు గుర్తించి రాసేవాళ్లు. ఈ రోజుల్లో కథల్లో స్పార్క్ వుంది స్పీడ్ వుంది. కానీ చాలా మంది కొత్త రచయితలు 'కొన్నిపత్రికల' శైలికి తగ్గట్లు సెక్స్ కథలు రాస్తున్నారు. ఇది మంచి లక్షణం కాదు. శృంగార ప్రబంధాల్లాగే పుట్టుకొస్తున్న ఈ కథలు అలాగే అంతరిస్తాయి.

ప్రభ, రచన, ఆహ్వానం, మొదలయిన పత్రికల్లో మంచి కథలు వస్తున్నాయి. మాసపత్రికల్లో రచనదో శైలి, స్వాతి, భూమి, మొదలయినవి అదే బాటలో వున్నాయి. వారపత్రికలే తగినంత ఇవ్వడం లేదు కథలకి స్థానం.

'కథ ఎప్పటికి భావవాహికగా గొప్పగా నిలుస్తుంది. కవితలో చెప్పగలిగినదికథలోనూ చెప్పవచ్చు. నవల కంటే కథల్లో సూటిగా నేరుగా సందేశాన్ని యివ్వవచ్చు. ఎవరి అండదండల్లేకున్నా కథ ఎప్పటికి చిరంజీవే. కథ కోసం కథకుల చేత ఒక 'కథ' పత్రిక వస్తే బావుంటుంది.

**బి. రమణి ప్రభాకర్**

అభిలాష వలన ఈ మధ్యనే మొదలు పెట్టాను రాయడం.

ఇప్పుడు మంచి కథలు కూడా అడపా దడపా వస్తూనే వున్నాయి. బహుశా కథల సంఖ్య ఎక్కువగా వున్నందువల్ల మంచి కథల ఎంపిక విషయంలో పత్రికల వాళ్లకే ఇబ్బంది ఎదురవుతున్నట్లు భావిస్తున్నాను. కథలు చదవకుండా కూడా వెనక్కి పంపుతున్నట్లు అభిప్రాయపడ్తున్నాను.

**రసరాజు**

కథా ప్రక్రియ పాఠకునికి చేరువగా వుంటుంది. ప్రయోజనాత్మక దిశగా -పాఠకుణ్ణి - ఈ ప్రక్రియ ద్వారా ముందుకు నడిపించాలన్నదే నా ఉద్దేశం. కథా రచన చేయటానికి కూడ అదేకారణం 1972నుండి రాస్తున్నాను.

వస్తు వైవిధ్యంలోను - నడకలోను - ఎంతో మార్పు వచ్చింది. అయినా సందేశాత్మకంగా వుండే కథారాశి తక్కువగా వుంటోంది.

ఇటీవల సీరియల్స్‌కే ఎక్కువ ప్రాధాన్యత కనిపిస్తోంది. కథల సంఖ్యా బలాన్ని కూడా పత్రికలు రానురాను తగ్గించేస్తున్నాయేమో అనిపిస్తోంది. దానికి తోడు-కొన్ని కొన్ని పత్రికలు అశ్లీలతకు పట్టం కడుతున్నాయి. పేరా కథలు, పేజీ కథలు, కాలమ్ కథలు - ఇలా ప్రవేశించి - అసలు కథా రూపాన్నే కుంచించి వేస్తున్నాయి. (కారణాలేమైనా). అలాగే సందేశాత్మకత లోపించటంలో కథా విలువలు తరిగిపోతున్నాయి. ఈ కారణంగా కథాప్రాచుర్యం కుంటు పడుతున్నదనే చెప్పాలి.

కేవలం కాలక్షేపం కోసమే కథల్ని అందించగూడదు. సమాజాన్ని కూడ దృష్టిలో పెట్టుకోవలసిన బాధ్యత అటు రచయితకు, ఇటు పత్రికా ప్రపంచానికి ఎంతోవుంది. రెండోది - పాఠకుణ్ణి తన వెంట తీసుకొని వెళ్లగలిగే గమనం కథలో వుండాలి. అలా వున్నప్పుడు వస్తుముద్ర పాఠకునిలో వుంటుంది రచయిత ఏం చెబుతున్నాడో - కథకున్న గమ్యమేమిటో బోధపడుతుంది. లేకపోతే కథ మధ్యలో పాఠకుడు ఆగిపోయే ప్రమాదముంది. ఆ పరిస్థితిలో కథకున్న ఆశయమే దెబ్బతింటుంది.

**రాంపా**

చదివినప్పుడు ఆనందాన్నే గాక నే నాశించిన మంచి గురించి ఆలోచించేవిగా వుండాలని - నిత్య జీవితంలో వేసే ప్రతి అడుగును గుణ విశ్లేషణ చేయడానికి కొంతైనా సహకరించాలనే ఆశయంతో -రాయగలనన్న ఆత్మ స్థయిర్యం వచ్చినప్పటి నుండీ రాస్తున్నాను.

ఓ మంచి కథను గులాబి పువ్వనుకుంటే - కోసుకుందామంటే ముళ్ళే ఎక్కువ గుచ్చుకుంటున్నాయి. పువ్వు దొరికినా రెక్కలు విరిగి ఎండిపోయి వుంటోంది. అయితే పూలు దొరకడం లేదని చెప్పలేను. సురభిళం లేదని చెప్పలేను.

పత్రికలు బతకడానికి మంచి కథలే ప్రాణవాయువు వంటివనే నమ్మకం చాలా పత్రికల్లో సడలింది. పాఠకుల్లో విభజనను పెంచుతున్నాయి

తెలుగు కథలు అన్ని భాషల్లోకి అనువదించబడి ప్రపంచ పాఠకుడి హృదయాన్ని గెలుచుకోవాలి. గెలుచుకునేవిగా వుండడానికి ప్రతి రచయితా ప్రయత్నించాలి.

**రావూరి భరద్వాజ**

1943 - 44 నుండీ రాస్తున్నాను. ఒక వ్యవస్థమీది కోపం కొద్దీ, ఒక పదం మీది మోజు కొద్దీ, కొన్ని సన్నివేశాలు నన్ను కదిలించిన కారణంగానూ రాశాను. కొన్ని కథలు వృత్తిలో భాగంగా రాశాను. కొన్ని కథలు డబ్బు కోసం రాశాను. ఇంకొన్ని కథలు గత్యంతరం లేక రాశాను.

ఎప్పుడో తప్ప, ఇటీవల వస్తున్న కథలను శ్రద్ధగా చదవడం లేదు. నా అరకొర పరిశీలనతో, ఆధునిక కథల మీద నా

అభిప్రాయం చెప్పడం సాహసమవుతుంది. గడచిన దశాబ్ద కాలంగానూ వస్తున్న పత్రికలలోని కథలను - ఎప్పుడో తప్ప - మనసు పట్టి చదవడం నాకు సాధ్యం కావడం లేదు. కాబట్టి నా అభిప్రాయం సరైనది కాకపోవచ్చు.

ఇంకే సాహిత్య ప్రక్రియ కన్నా పనికి రాని అంశాలుంటాయేమో నాకు తెలీదు గానీ, కథకు పనికిరాని అంశమంటూ ఉంటుందని ఇప్పటికీ నేననుకోలేక పోతున్నాను. 'అంశం' చాలా మామూలుదేకావచ్చు, అందులో 'కథ' ను చూడగలగాలి. ఆ చూసిందాన్ని అందంగా చెప్పగలగాలి.

**కె.కె. రఘునందన**

నా మనసులో అభిప్రాయాలు నలుగురికి చెప్పుకునే అవకాశం కథా రచన ద్వారా ఉన్నది కాబట్టి1981 వ సంవత్సరం నుండీ వ్రాస్తున్నాను.

ఈ మధ్య కాలంలో వస్తున్న కథలలో వైవిధ్యం, సామాజిక స్పృహ, రమణీయత లోపించాయనే చెప్పాలి (నేను చదివిన కథల పరిధి మాత్రమే ) కథా ప్రాచుర్యానికి పత్రికల సహకారం ఎంతమాత్రం లేదనే చెప్పవచ్చు. ఒకటో రెండో కథలు తప్పదన్నట్లు ప్రచురిస్తు వ్యాపార ధోరణిలో కొనసాగుతున్న పత్రికా ప్రపంచం - కథకు ఏ మాత్రం గౌరవం యిస్తున్నదీ తెలుస్తుంది. విదేశ నవలా సాహిత్యం తెలుగులోకి కాపీ కొట్టే రచయితలకి పట్టం గడుతున్న పత్రికలు ఎవరు నిజమైన రచయితలో గ్రహిస్తే కథకి ప్రాచుర్యం తప్పకుండా వస్తుంది.

ఏళ్ల తరబడి పంపిన రచనలను తమ వద్ద అట్టేపెట్టుకున్న పత్రికలు సత్వరం పరిశీలన జరపటానికి తగిన నిబంధనలు సూచించుటకు రచయితలతో కమిటీ వేయాలి. పైకి తాటికాయలంత అక్షరాలతో వేల రూపాయలు పారితోషికం ప్రకటించటం తీరా బహుమతి వచ్చినా ఎగవేయటం చేస్తున్న వారికి తగిన గుణపాఠం చెప్పాలి. కథ ప్రచురించాక పారితోషికాలు ఎగవేసే పత్రికాధిపతులను నిలదీయాలి. పై సమస్యలు అందరివిగా భావించి రాష్ట్రస్థాయిలో రచయితల శ్రేయస్సుతోను కమిటీ రూపొందించటాన్కి వెంటనే ఏర్పాటు చెయ్యయ్యటం శ్రేయోదాయకం.

**రావులపాటి సీతారాంరావు**

మొదటి పేరు అచ్చులో చూసేందుకోసం తర్వాత జీవితాన్ని అచ్చులో చూపించాలనే తాపత్రయంతో 1961 నుంచి రాస్తున్నాను.

వైవిధ్యం - శిల్పం మస్తుగా కనపడుతున్నాయి. వస్తు స్వీకారంలో కొత్తదనం కొట్టొచ్చినట్లు కనపడుతున్నది. నాసిరకం కథలు నా చిన్నపుడూ వచ్చేవి. ఇప్పుడూ వస్తున్నాయి.

రచన ప్రాచుర్యానికి పత్రికలు ఎంత ముఖ్యమో - కథకులూ అంతే ముఖ్యం -పాఠకులకు నచ్చేది యివ్వాలనే వ్యాపార దృక్పథం బాగా కనపడుతున్నా - మంచి కథలను ప్రచురించగూడదనే పత్రికలు నా దృష్టిలోకి రాలేదు.

కథకులను ఒకే వేదిక మీద కలపటం. సమగ్రంగా కాకపోయినా కొంతవరకూ ఈ ప్రక్రియ మీద చర్చించటం మంచి కథలు వ్రాయాలనే కుతూహలన్ని రచయితల్లో పెద్ద ఎత్తున రేకెత్తించటం లాంటి ఆశయాల సదస్సులు జరుగుతుండాలి.

**ఎ. లక్ష్మీ రమణ**

రచనలో చక్కని, చిక్కని ప్రక్రియ కనుక 45 సంవత్సరాల నుండి కథల్ని రాస్తున్నాను. చాలా దిగువ స్థాయి కథలు వస్తున్నవి. వైలెన్సు అతిగా వచ్చే అశ్లీలతలను అరికట్టడం పత్రికల సంపాదకులపై వుందని నా అభిప్రాయం. సమాజానికి మేలు చేసే విధంగా వచ్చే కథలను ప్రోత్సహించాలి. శిల్పానికి, వస్తువుకు ప్రాధాన్యత ఇవ్వాలి. పేలవంగా, జుగుప్సాకరంగా వచ్చే కథలను అరికట్టాలి. సమాజానికి చెడు జరిగే ప్రమాదం కనిపిస్తుంది చెడ్డ కథలవల్ల.

**వెంకట్రామయ్య డి.**

సమాజంలో అందరికీ కనీసావసరాలు తీరాయనీ అందరికీ న్యాయం జరగాలన్న ఆకాంక్షతో రాస్తున్నాను - సుమారు పాతికేళ్ల నుంచి.

ఇవ్వాల్టి కథల్లో చాలా మటుకు కేవలం కాలక్షేపానికి పనికొచ్చేవే తప్ప ప్రయోజనం శూన్యం. ఒకటి, అరా తప్ప పత్రిక లేవీ కూడా మంచి కథలు రావడానికి అనువైన ప్రోత్సాహం ఇవ్వటం లేదు. కథయినా, కవిత్వమైనా నవలయినా మరోటయినా రాసేవాడిలో కనీస నిజాయితీ వుండాలి. నిజాలే రాయాలన్న నిబద్ధత వుండాలి.

**వివేకానంద ఎస్.**

1963 నుంచి వ్రాయటం మొదలైంది. ఎందుకు రచనా వ్యాసంగం చేపట్టాను? అనే ప్రశ్న వుత్పన్నమైనప్పుడు... నా చుట్టూవున్న సమాజాన్ని నిశితంగా పరిశీలించటం మొదలైనప్పుడు.

సమాజపరమైన మార్పుని గమనిస్తున్నప్పుడు... మనం ఎటు పయనిస్తున్నదీ అర్థం కాని అయోమయ స్థితిలో పడ్డప్పుడు... మంచికోసం... మార్పుకోసం... మానవతా విలువలను పెంపొందించటం కోసం రాస్తున్నాననిపిస్తోంది. అంతే.

ఈ మధ్య అప్పుడప్పుడు మంచి కథలు చదివే అవకాశం కల్గుతోంది. - మంచి కథలకు తగినంత ప్రోత్సాహం కూడా కరువవుతోందనిపిస్తోంది.

ఓ మంచి కథ అని అన్పించాక అది ఎన్ని పత్రికల నుండి తిరిగొచ్చినా అచ్చుకు నోచుకోకపోయినా రచయిత నిరుత్సాహ పడనవసరం లేదు - పత్రికాధిపతుల అభిరుచి మేరకు కథా రచన చేయనవసరం లేదని నా అభిప్రాయం.

కథా సంపుటాలు ప్రకాశకులు అచ్చువేయటం లేదు - రచయిత యే సాహసించి స్వంత ఖర్చుతో ముద్రించినప్పుడు వాటిని మార్కెట్ చెయ్యటం ఓ సమస్య! పోతే గ్రంథాలయ సంస్థలు రైటర్ పబ్లిషర్‌ని ప్రోత్సహించాలని నా కోరిక! - ఇది కోరికగానే మిగిలిపోతోంది - ఇందుకు రైటర్ పబ్లిషర్స్ అంతా ఏకమై పోరాటం సాగించి సాధించాలనేది నా ప్రగాఢ వాంఛ!! అంతే.

**విహారి (జె.ఎస్. మూర్తి)**

1962 నుంచి రాస్తున్నా జీవితంలోని వైవిధ్యాన్ని అనుభవించి, నా అనుభవాన్ని నలుగురితో పంచుకోవాలని, సమాజపు రొదని విని, ఇతరులకు వినిపించాలని, వ్యక్తి అంతరాంతర జ్యోతిస్సీమలో ఒక చైతన్య దీప శిఖని నేనూ నిలపాలని.....

వస్తువులో వైవిధ్యం వుంటోంది. ఇప్పటి - జీవితానికీ, సమాజానికీ సన్నిహితమైన ఇతివృత్తాలు కథల్లో కనిపిస్తున్నాయి. అయితే కథా సంవిధానానికి కల ప్రాధాన్యతని కథకులు ఆల్మోస్ట్ విస్మరిస్తున్నారు. శిల్పం, శైలి - వీటి పరంగా క్వాలిటీ పలచబడింది.

'వస్తున్న కథల్లో మంచివి వున్నై కదా' అనే వితండ వాదనని ప్రోత్సహించుకుంటున్నై పత్రికలు. మంచి కథలు రావడానికి తాము చేయవలసిన కర్తవ్యం తాము చేయడం లేదు. శక్తిగలవాళ్లని ప్రోత్సంచకుండా, ఆసక్తిగల వాళ్లు చాల్లే మాకు అనే తత్వం ప్రచారం చేస్తున్నారు. వాళ్ల పబ్బం వాళ్లు గడుపుకుంటున్నారు.

మంచి కథలు రాకపోవడానికి నేను కేవలం పత్రికా లోకాన్నే తప్పు పడుతున్నాను. అన్ని విధాలా అది కూడా కమ్మర్షియలైజ్ అయిపోయింది. ఇది మింగ లేని నిజం. ఈ అవాంఛనీయ పరిస్థితులు మారనిదే - కథ - మంచి కథా; గొప్ప కథా కాలేదు. మీ కృషి, పూనికా, ప్రయత్నం సాగించండి. సత్ఫలితాన్ని ఆశిద్దాం.

**విజయ్**

ఏదో దేవుడిచ్చిన వరం కనుక - 1971 నుండీ రాస్తున్నాను కథలకి పత్రికలిచ్చే ప్రోత్సాహం అంత సరైన మార్గంలో లేదు ఇప్పుడు.

**వీరభద్రరావ్ పమ్మి**

అభిమానం కొద్దీ -1974 నుండి రాస్తున్నాను. పత్రికలు కథలకి రెమ్యూనరేషన్స్ పెంచాలి. కథల విషయంలో మనం 'మదన గోపాలుడు' అయిపోవాల్సిన పనిలేదు. తెలుగు కథకి మంచి భవిష్యత్తు ఉంది.

**పి.వి.ఆర్. శివకుమార్**

కథల్రాయటం మొదలై పాతికేళ్లు దాటింది. మొదటి కథ విశాలాంధ్ర వారి 'ప్రతిభ' వార పత్రికలో 1968లో ప్రచురించబడింది. మన చుట్టూ సమాజాన్ని పరిశీలిస్తుంటే చెలరేగే ఆలోచనల్నీ, ఆవేశాన్నీ నలుగురితో పంచు కోవాలన్న ప్రయత్నంలో కథల్రాయటం ప్రారంభమయింది. కథలకి ఓ నిర్దిష్ట లౌక్యం అంటూ వుండాలన్నది నా నిశ్చితాభిప్రాయం.

అప్పుడొస్తున్నట్టే యిప్పుడూ వస్తున్నాయి మంచి కథలు. కానీ, చాలా తక్కువ సంఖ్యలో పాపులర్ రచనలకీ, చౌకబారు సాహిత్యానికీ లభిస్తున్న ప్రోత్సాహం మంచి కథలకి లభించక పోవటం ముఖ్య కారణం కావొచ్చు.

నూటికి తొంబై పత్రికలు చవకబారు శృంగార కథల కోసం వెంపర్లాడటం జుగుప్సాకరమైన నూతన పరిణామం. 60లో అయితే వీటినే శృంగార పత్రికలు అంటూ దూరంగా వుంచే వాళ్లం. ఇవాళ యివే సంసార పత్రికల ముసుగులో సమాజంలో భాగమైపోయాయి. కారణాలకి పాఠకులూ, పత్రికలూ ఒకరి నొకరు ఎత్తిచూపుతున్నా, నా అభిప్రాయం యిందుకు అధిక బాధ్యత ఆయా పత్రికల సంపాదకులది, రచయితలదీనూ. నాలుగు కాలాలపాటు నిలబడే కథ వీళ్లకి అక్కర్లేదనిపిస్తోంది. నాలుగు రూపాయలు సర్క్యులేషన్ పెంచే చెత్త కోసమే వీళ్ల ప్రయత్నమంతా! సమాజం పట్ల సాహితీ పరులుగా ఏమాత్రమైనా బాధ్యతవుందని భావించే రచయితలూ, సంపాదకులూ చౌకబారు శృంగార సాహిత్య సృష్టినీ మానుకుని, సాహిత్యాన్ని వ్యాపార స్థాయినించి కాసింతైనా పైకి తీసుకు వచ్చి, మంచి కథకి, విశ్వసాహిత్యంలో స్థానం కోసం ప్రయత్నించగల మంచి కథ కోసం కృషిచేయటం అత్యవసరం.

**శ్రీ సుభా**

నేను కథలు 1959 నుంచీ వ్రాస్తున్నాను. మనసుతోటీ, మనుషులతోటీ సంతోషంగానీ, బాధగానీ ఎక్కువగా పంచుకున్నప్పుడు - ఆ తర్వాత ఓ చక్కని అవస్థలోకి జారుకున్నప్పుడు - అదీ అందరితో పంచుకుందామని వ్రాస్తున్నాను.

ఇప్పటి కథల్లో సెక్సు మోతాదు మించింది. వైలన్స్ ఉధృతం అయ్యింది. పత్రికలు చాలా మటుకు ఈ ఎలిమెంట్స్ మీద వచ్చేకథలను ఆహ్వానిస్తున్నాయి, ఆదరిస్తున్నాయి. సాహిత్యం స్టార్ టీ.వీ., జీ.టీ.వీ.ల మధ్య వక్కలా నలిగిపోతూంటే ఈ దశ తప్పదేమో !రోజులుచాలా ఫాస్ట్‌గా మారుతున్నాయి. నిజానికి ఈనాటి యువతకు తెలుగు భాషమీద, సాహిత్యం మీద పెద్ద అవగాహనలేదు. వారికి తెలుగు సాహిత్యం మీద మమకారం పెరగాలంటే - వారు తెలుగు నేర్వాలి!

**శేషం పురుషోత్తమాచార్య**

నాలో కదలాడే బావావేశానికి రూప కల్పన చేయాలన్న ప్రయత్నంతో రాస్తున్నా. 1970లో నా మొదటి కథ 'కల్యాణి'ని ఆంధ్రప్రభ వీక్లి ప్రచురించింది.

"ఎయిర్ హోస్టస్" అన్న నవలికనూ ఆంధ్రప్రభ వీక్లి యే వేసింది. ఇపుడు 'పడగ నీడ' అన్న తొలి నవలని కూడా ప్రభే ప్రచురిస్తోంది. ఇప్పటికి వంద కథలకి పైగా వివిధ పత్రికలు ప్రచురించాయి.

కేవలం కొన్ని సంఘటనల పైనే రచన కేంద్రీకరిస్తున్నారు. కథలో వేగం ఎక్కువయింది. సైజు చిన్నదయి పోవటం వల్ల

రచయిత చెప్పదలుచుకున్నది పూర్తిగా చెప్పలేక పోతున్నాడు.

కొంత మంది ఎన్నుకున్న రచయితలనే పత్రికలు ప్రోత్సహిస్తున్నాయి. యిది మంచి పద్ధతి కాదు. వివిధ రచయితల్లోని విశిష్టతని ప్రతి పత్రికా గుర్తించాలి. రచయితల సదస్సులు అపుడపుడు నిర్వహించబడాలి. కథా సంపుటాల్ని విరివిగా వెలువరించాలి. కేవలం కథల పత్రికలనే కొందరు ఆరంభించాలి.

**పి.పి. శేషారత్నం**

కేవలం ఆత్మ సంతృప్తి కోసమే 1981 నుంచి రాస్తున్నాను. సమయం లేకపోయినా మనస్సులో కట్టలు తెంచుకునే భావాలను కాగితం మీద పెట్టకుండా ఉండలేక రాస్తున్నాను. సమాజంలో పాతుకు పోయిన కొన్ని అపరిష్కృత సమస్యలకు మనసు వికలితమైపోయి - నిస్సహాయతలో - నాకు తోచిన పరిష్కారం సూచిస్తూ ఆవేదనతో రాస్తున్నాను.

రచయితలు కాలానుగుణంగా తమను తాము మలుచుకుంటున్నారు (ట్యూన్ చేసుకుంటున్నారు) 50 శాతం మాత్రమే - కాలయాపన వల్ల కొన్ని కథలు స్టేల్ అయిపోతున్నాయి. పత్రికలు కథలకి - సీరియల్స్‌కి ఇచ్చినంత ప్రాముఖ్యం ఇవ్వడం లేదు.

సమూలంగా కాకపోయినా పాఠకుడిని రవ్వంతైనా కదిలించగల కథలు వచ్చినా చాలనుకునే అల్ప సంతోషిని - ఎందుకంటే గడ్డి పోచలన్నీ కలిస్తే ఏనుగును బందించగలవన్న ప్రగాఢ నమ్మకం నాది. - నైతిక విలువలనే లక్ష్మణ రేఖను రచయిత ఏ ప్రలోభానికి లొంగి దాటనినాడే భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలను ముందు తరాలకు అందించే తోటమాలి కాగలడు.

**శీలా వీర్రాజు**

నా అనుభవాల్ని యితరులతో పంచుకోవాలని భావించడం వల్ల 1953 నుంచీ రాస్తున్నా.

మంచి కథలు వస్తున్నాయి. అయితే అవి చాలా తక్కువ. అత్యధిక శాతం కథలు గుర్తుంచుకో తగ్గవికావు, ఏ ప్రత్యేకతా లేనివి. సాధారణ పాఠకుడికి మానసిక ఆనందాన్ని కలిగించడమే లక్ష్యంగా, సర్క్యులేషన్ పెంచు కోవడం కోసం పడే తాపత్రయమే అధికంగా పత్రికల అధిపతులు, సంపాదకులు ప్రవర్తిస్తున్నారు. పత్రికలు, యిప్పుడు వ్యాపార సంస్కృతిని ప్రదర్శించడం వల్ల చెల్లుబాటయ్యే వస్తువుగల కథల్నే అచ్చువేస్తున్నాయి.

కథా ప్రాచుర్యానికి పత్రికలు బాగా తోడ్పడుతున్నాయి. మంచివో చెడ్డవో కథలు ప్రచురిస్తూనే వున్నారు. అయితే మంచి కథలనే వేయాలనే విషయానికి పత్రికాధిపతులు కట్టుబడి వుండక పోవడం వల్ల అపమార్గం పడుతోంది.

ఏ పత్రికను తీసుకున్నా ఆ పత్రిక ప్రచురణకు అంటే ముద్రణ, నిర్వహణ సిబ్బంది ఖర్చు మొదలైన వాటికి పెట్టే ఖర్చులో ఆ వారం, లేదా ఆ నెల పత్రికా రచయితలకు యిచ్చే ప్రతిఫలం చాల చాల నెగ్లిజిబుల్ శాతం. ఇటువంటి పరిస్థితుల్లో ఒక మంచి కథని రాసివ్వమని అడుగుతే మంచి రచయితయివ్వగలడా/ ఇవ్వలేడు. ఇది పత్రికాధిపతులు జరుపుతున్న దోపిడీ. వ్యాపార పత్రికలు చేస్తున్న యీ దోపిడీనీ ఏ రచయితా ఆర్థిక రాజకీయ దోపిడీనీ వ్యతిరేకించే అభ్యుదయ రచయితలు కూడా ప్రతి ఘటించక పోవడం బాధాకరమైన విషయం.

**శీలా సుభద్రాదేవి**

సుమారు పాతికేళ్ల నుండీ నా సాహితీ వ్యాసాంగం కొనసాగుతోంది. నేను సంఖ్యలో తక్కువగానే రాసాను. నా పరిసరాలలో స్పందన కలిగించే సంఘటనలు సాధారణంగా కథలలో చోటు చేసుకుంటాయి. కథ చదివిన తర్వాత కూడా పాఠకుడిని ఆ కథ గురించి ఆలోచింపజేసే కథలు రాయాలని నా ఉద్దేశ్యం.

చాలా కొద్ది పత్రికలలో మాత్రమే మంచి కథలు వస్తున్నాయి. ఎక్కువగా వ్యాపార పత్రికలు పెరిగిపోవటం వలన సర్క్యులేషను దృష్టిలో పెట్టుకొని సెన్సేషనల్ సీరియల్సుకి ప్రాధాన్యత యిచ్చి కథలు చాలా తక్కువగా వేస్తున్నారు. వ్యాపార దృష్టితో కాకుండా సాహిత్య విలువలకు ప్రాధాన్యతనిస్తూ కొందరు యువతరం వాళ్లు కూడా మంచి కథలు కొన్ని రాస్తున్నారు. కథా వస్తువులను, శిల్పంలోని కొత్తదనం కల కథలు చాలానే వస్తున్నాయి.

మూడు నాలుగు సీరియల్సు వేస్తున్నపత్రికలు అదే సంఖ్యలో కథలు వేయటం లేదు. ఆఖరికి రచనలో కూడా కథల సంఖ్య తక్కువగానే ఉందని నా అభిప్రాయం. కథల సంఖ్య పెంచినపుడు మంచి కథలు ఇంకా ఎక్కువ రాయగలగటానికి అవకాశం ఏర్పడుతుంది.

పాఠకులను కొంతైనా ప్రభావితం చేయగల రచయితలు కవులు, ప్రాంతీయత, కులం పేరిట గ్రూపులుగా విభజింప బడకుండా బాధ్యతతో ప్రవర్తించ వలసి వుంది. ఏడాది కొకసారైనా ప్రత్యేక కథల పత్రికలుగా అభిరుచివున్న పత్రికల వాళ్ళైనా వేస్తుంటే కథల పట్ల పాఠకులకీ రచయితలకీ ఆసక్తి పెంచిన వాళ్లవుతారు. అయితే

ఏది ఏమైనా మంచి కథలు రాయాలనే సాహిత్యాభిలాష ఉన్నవాళ్లు మంచి కథలు రాయటానికి ప్రయత్నిస్తూనే ఉంటారు.

**సదానంద శారద**

సమాజంలో మార్పు కోసం. - 1977 నుండీ రాస్తున్నాను. ఇప్పుడు మంచి కథలు ఎక్కువగానే వస్తున్నాయి.

పత్రికల నుంచి కథలకు తగినంత సహకారం లేదు. పత్రికల్లో కథల సంఖ్య పెరగాలి. ప్రజల భాషలో వచ్చే కథలను ఇంకా ప్రోత్సహించాలి.

**సింహప్రసాద్**

నాలో చెలరేగిన ప్రతిస్పందనకి, భావన అక్షర రూపం ఇవ్వాలన్న తపనతో, ఆర్తితో ఆరాటంతో సుమారు 16,17 సంవత్సరాలనుంచి రాస్తున్నాను.

ఇప్పుడు చక్కని కథలూవస్తున్నాయి, చెత్తకథలూ వస్తున్నాయి. కానీ రాశిలో రెండో రకానిది పైచేయిగావుంది. డిక్టేట్ చేసే స్థితిలో వుంది. నగ్న, అర్థనగ్న చిత్రాల్లాంటి శృంగార కథలద్వారా సర్క్యులేషన్‌ని పెంచుకోవడానికి పోటీపడుతున్న పత్రికలు, ఆలోచింప చేసే కథలకి సరైన పీటను వెయ్యలేక పోతున్నాయి. మత్తుకథలకు అలవాటు పడ్డ పాఠకులు కూడా అడపా దడపా వస్తున్న మంచి కథలకు సరిగ్గా స్పందించ లేకపోతున్నారేమోననిపిస్తోంది.

చీప్ టేస్ట్, చీప్ గిమ్మిక్స్ గుమ్మరించయినా అమ్మకాల్ని పెంచుకోవాలన్న తాపత్రయంతో విలువల వలువల్ని విప్పేసాయి పత్రికలు. సినిమాలు, స్టార్‌టీవీల లాగానే పత్రికల్ని కూడా సరదా

కాల క్షేపాలుగా భావిస్తున్నారు సగటు పాఠకులు. పత్రికలూ, పాఠకులూ ఆశిస్తున్నాదాన్ని పుష్కలంగా అందించటానికి పోటీపడుతున్నారు చాలా మంది రచయితలు. బలహీనతల్ని క్యాష్ చేసుకునే వ్యాపార సంస్కృతిని త్రోసి రాజంటూ అప్పుడప్పుడూ చక్కని, చిక్కని కథలూ వస్తున్నాయి. ఇండియాటుడే, రచన లాంటి పత్రికలు ప్రోత్సహిస్తూనేవున్నాయి. ఈ ధోరణి మరింత ప్రబలాలని ఆశ, ఆకాంక్ష.

**సాధనాల వేంకటస్వామి నాయుడు**

1981 - నుంచీ రాస్తున్నా - మొదటి కథ 'వేటగాడు' ఆంధ్రజ్యోతి వారపత్రికలో వచ్చింది

ప్రస్తుతం వస్తున్న కథలు జీవితానికి దగరగా వస్తున్నాయి. మాండలీకాల్లో వెలువడుతున్న కథలు సీరియస్‌గా వస్తూండడం అభినందనీయం.

కథా ప్రచురణ పత్రికల్లో తగినంతగా జరుగుతోందని నా అభిప్రాయం. అయితే కథా విలువల్లో లైటర్ వీన్‌లో కథలకి లభిస్తున్న ఆదరణ సీరియస్ కథలకి లభించడంలేదు ఆహ్వానం, రచన పత్రికలు, స్వాతి మాసపత్రిక సీరియస్ కథలకి స్థానం ఇవ్వడం హర్షణీయం.

అనువాదకుల కొరత వల్ల తెలుగు సాహిత్యం అంతర్జతీయ ప్రాముఖ్యాన్ని పొందడం లేదనేది నిర్వివాదాంశం. అయితే మనలో చాలా మంది అనువాదకులు అజ్ఞాతంగా ఉన్నారు. వారిని గుర్తించి ప్రాచుర్యం కల్పించడం అవసరం. ఇతర భారతీయ భాషల్లోకి కూడా ఈ పని జరగాలి.

**సుదర్శనం ఆర్.ఎస్.**

1958 నుంచి వ్రాస్తున్నాను. జీవిత వైచిత్రి పట్ల ఆసక్తితో, వ్యక్తుల మనస్తత్వాలను చిత్రించే లక్ష్యంతో, దృక్పథాలను విశ్లేషిస్తూ ఆలోచనను ప్రేరేపించే ధ్యేయంతో వ్రాశాను. జీవిత రహస్యాన్ని వ్యాఖ్యానించే దృష్టితో వ్రాసిన చివరి కథ 'సాగర సంగమం', భారతి. మొగలి పువ్వు, నీరు పల్ల మెరుగు, పాప జాతి 'వ్యక్తుల మనస్తత్వాలకు, మధుర మీనాక్షి, అమృతుడు, ప్రతిబింబాలు, ఏకాంతం, జీవితరహస్యాలకు, ఉదాహరణలైన కథలు, సంపుటాలుః, 'కాలంతెచ్చిన మార్పు మధురమీనాక్షి.

కాలం పునరావృత్తమౌతున్న లక్షణం వుంది 50 ఏళ్ల క్రితం ముని మాణిక్యం, చలం, భరద్వాజ, కొవ్వలి, ధనికొండ శృంగార పరంగా ఓనమాలు నేర్పితే, ఆ బాణీని అందుకోలేని నేటి 'సరసమైన' సెక్సు పరమైన కథలు పేలవంగా వుంటున్నాయి. ఆ రోజుల్లో వచ్చిన అపరాధ పరిశోధక, థ్రిల్లర్ కథలు కూడా అద్భుతంగా వుండేవి. ఆ కోవకు చెందిన నేటి కథల్లో, హింస, దౌర్జన్యం, నైచ్యం పెచ్చరిల్లి అసహ్యంగా వున్నాయి. నేటి సామాజిక పరిస్థితుల్లో కొన్ని సన్నివేశాలను, వ్యక్తిత్వాలను, కుటుంబ జీవితాన్ని, ముఖ్యంగా వృద్ధాప్యం వంటి స్థితిగతుల్ని. మానవ హృదయ స్పందనను చిత్రించే మంచి కథలు కూడా వస్తునే వున్నాయి.

పత్రికల్లో కొన్ని - మంచి కథల్ని ప్రోత్సహిస్తువున్నాయి. నీచమైన అభిరుచులు, మొరటుదనం, బూతు మాటలు, చేష్టలు- రచనా స్వేచ్ఛ పేరుతో సామాన్య ప్రజానీకం పేరుతో, సత్యాన్నీ ప్రకటించే సమర్థనతో కొన్ని పత్రికలు సైన్సు పేరుతో, కూడా పనిగట్టుకుని

ప్రోత్సహించి అక్షరాస్యుల్ని కుర్రకారుని ఆకట్టుకొంటూ, సాహిత్యాభిరుచి యువతరంలో సంస్కారం, ఏర్పడే అవకాశం లేకుండా అవరోధంగా కూడా ఉంటున్నవి.

సంఘంలో సంస్కారం, మానవత్యపు విలువల మీద గౌరవం, దయా దాక్షిణ్యాలు, వ్యక్తుల పట్ల ప్రేమ గౌరవాలు ప్రోత్సహించేందుకు సాధనం సాహిత్యం. అటువైన విశిష్టమైన ఆలోచనలకు, అనుభూతులకు, దృక్పధాలకు, గాఢమైన పరిశీలనకు, సునిశితమైన స్పందనలకు, అనుభూతులకు, దృక్పతాలకు, గాఢమైన పరిశీలనకు, సునిసితమైన స్పందనలకు సాహిత్యమే కాణాచి. ఇటీవలి కాలంలో (1945-80) రాజకీయాల భారం, విప్లవ బాధ్యత అంటూ ప్రజల్ని తనే ఉద్ధరించే పోజులో సాహిత్యం పక్కదారి పట్టింది. ఆ స్థితి దాటిన తర్వాత సినిమాతో పాటు దిగజారి, వ్యాపార సంస్కృతి ఊబిలో చిక్కుకుంది. ఇప్పుడిప్పుడే కథ, వచన కవిత్వం మళ్లీ సాహిత్య పరమైన ధ్యేయాన్ని గుర్తుకు తెచ్చుకున్నట్లు తోస్తున్నది. ఇది నా ఆశా భావం.

**సులోచన సింహా డ్రి. పి.**

సంఘంలో వ్యక్తులు ఎదుర్కొంటున్న సమస్యలను, నలుగురుకి నామనసులో భావాలను వ్యక్తపరచడానికి 1980 నుండి రాస్తున్నాను.

అశ్లీలత, క్రైమ్ మొదలైనవి ఎక్కువగా ఉన్నాయి కథల్లో పత్రికలు ఎక్కువగా విక్రయం అవ్వాలని ఉద్దేశంతో ప్రచురిస్తున్నారని అనిపిస్తోంది. వాటివల్ల భావిపౌరుల మీద (యువతి యువకుల) ప్రభావముంటుందని నా అభిప్రాయం.

మంచి కథలను ప్రచురించడానికి పత్రికల సహకారం ఎంతో

కావాలి. కాని అది సరైన మార్గంలో జరగడం లేదు అనిపిస్తోంది. మంచి కథలను ప్రచురించి పత్రికల ద్వారా రచయిత (తు)లను ప్రోత్సహించాలని ఆశపడుతున్నాను.

**హితశ్రీ**

నాకు తెలిసిన **జీవితాన్నీ**, జీవితానుభవాల్ని, జీవిత సత్యాన్ని అభివ్యక్తం చెయ్యాలనే ప్రేరణతో రాస్తున్నాను 1950 నుంచి. ఇప్పుడూ మంచి కథలు విరివిగా కాకపోయినా వస్తూనే ఉన్నాయి. కథలకి పత్రికల నుంచి తగినంత ప్రోత్సాహం లేదు. కథా రచన ఒక తపస్సుగా కొనసాగాలి. పత్రికలు సామాజిక శ్రేయస్సుకి అనుగుణమైన మంచి కథలకి విశేష ప్రాముఖ్యం ఇవ్వాలి.

**చంద్రశేఖర్ ఆజాద్**

ప్రధానంగా నన్ను నేను తెలుసుకోవటం కోసం ఏ ప్రజల నుండి నేర్చుకున్నానో వారికి నాకు తెలిసిన విషయాలు చెప్పి ఆలోచింప చేయటం కోసం 1983 నుండి సీరియస్‌గా రాస్తున్నాను. చాలా మంచి కథలు వస్తున్నాయి. అదే సమయంలో అతి మామూలు కథలూ, సెక్స్ కథలూ వస్తున్నాయి. మంచి కథలు రాయాలని ఎందరో ప్రయత్నం చేస్తున్నారు. వస్తున్నవి కొంత వరకు మాత్రమే అయితే గత కొన్ని సంవత్సరాలతో పోలిస్తే ఇప్పుడు కొంత మార్పు వచ్చింది. కథను ఆదరించే పత్రికలు పెరుగుతున్నాయి. ఇది మంచి పరిణామం.

కథకున్న కాన్వాస్ జీవితమంత విస్తృతమైనది. ఓ సమస్యగా ఎలాంటి విషయాన్ని అయినా చెప్పవచ్చు. చెప్పాలి. అది కేవలం వ్యాపారం కోసం అయితే దానికి తగిన విధంగానే 'క్వాలిటీ ఎంత

ముఖ్యమో క్వాంటిటీ కూడా అంత ముఖ్యం. అవసరమైన ప్రతి సందర్భంలో కథా రచయిత స్పందించటం ప్రధానం. అది గొప్పదా కాదా, నిలబడుతుందా లేదా అనేది అనవసరం. ఏరచన అయినా కొన్ని పరిస్థితుల్లో దాని పని అది చేస్తుంది.

## హైమా భార్గవ్

మనసు స్పందించి, రాయాలని అనిపించడం వల్ల 1978 నుండి ఒకటీ, అర ఎప్పుడైనా పబ్లిష్ అయినా, 1991 నుండి తరచుగా రాస్తున్నాను. ఇప్పుడు వస్తున్న కథలు బాగానే వుంటున్నాయి. కాని మనసులో చెరగని ముద్రవేసేంత గొప్పగా లేవు. శ్రీ రమణగారు ఈ మధ్య రాసిన 'బంగారు ముురుగు' లాంటి ఆణిముత్యాలు అరుదుగా వస్తున్నాయి.

మంచి కథలను పత్రికలు తప్పక ఆదరిస్తాయి. ప్రచురింప బడడంలో ఆలస్యం కావచ్చేమో కానీ, మంచి కథలను ఎవ్వరూ తిరస్కరించరు. కథా ప్రాచుర్యానికి పత్రికలు ఇస్తున్న సహకారం ఇంకా ఎక్కువగా ఉండాలి.

జనం అంటే మనం అటు హ్యూమనిజాన్ని ఇటు హ్యూమరసాన్ని కూడా మరిచిపోయే స్థితికి రాకూడదు. హాయిగా ఆనందంగా నవ్వుకో గలిగే ఉత్తమ హాస్యాన్ని రచయితలు సృష్టించాలి. పత్రికలు ఆదరించాలి.

## శారదా అశోకవర్ధన్

నా మొట్ట మొదటి కథ 1956 జనవరి 6వ తేది సంక్రాంతి ప్రత్యేక సంచిక బెంగుళూరు నుంచి వచ్చే 'ప్రజామాత' అనేవారపత్రికలో పడింది. పేరు వరపరీక్ష ఇందులో పెళ్లి చూపుల్లో

మగ పెళ్లివారు ఆడపెళ్లి వారిని పెళ్లి కూతుర్నీ నానా ప్రశ్నలు వేసి ఎలా హింసిస్తారో చెబుతూ అటువంటి ప్రశ్నలు పెళ్లి కూతురే పెళ్లి కొడుకుని వేస్తే ఎలా ఫీలవుతాడు! అనే అంశంతో రాయడం జరిగింది. ఆ కథ ఆరోజుల్లో ఒక విధంగా సంచలనాన్ని రేకెత్తించిందనే చెప్పాలి. పొగుడుతూ వచ్చిన ఉత్తరాలు, నాలో నాకే కొత్త స్ఫూర్తినిచ్చాయి. మనసులోని భావాలను వ్యక్తం చెయ్యడానికి, తాను చెప్పదలచుకొన్న విషయాలను విపులంగా వివరిస్తూ పాత్రల ద్వారా చెప్పడానికి కథ ఒక చక్కని వేదిక. అందుకే భావ ప్రకటనకు కథని వేదికగా మలచుకొని, సమాజంలోని పీడిత ప్రజల గురించీ, నికృష్టపు, నిరాశా, నీరస, నిస్తేజితమైన జీవితాల గురించి, దౌర్భాగ్యపు చర్యల గురించీ చెప్పడానికి గానీ, అలాగే, సమానత్వం, సౌభ్రాతృత్వం, ప్రేమ, అభిమానం, ఆదరణ, ఆప్యాయత మొదలగు మధురానుభూతుల గురించి, చక్కగా చెప్పాలనే తపన మనస్సును వేధిస్తుంటే, కథా రచన చక్కటి వేదికగా పని కొస్తుందని నాఅభిప్రాయం. అందుకే నాటి నుంచి నేటి వరకూ, నాకు స్ఫూర్తినిచ్చేవి, స్పందన కలుగ జేసేవీ అనేక విషయాలను ఎంపిక చేసుకుని కథలు రాస్తున్నాను

కథల మీద కూడా నవలా ప్రభావం బాగా పడిందేమో ననిపిస్తుంది. చెప్పదలచుకున్న విషయం మీద స్పష్టత లోపిస్తోందేమో ననిపిస్తుంది. కథలో స్పష్టత చాలా అవసరం. విషయం కూడా చాలా ముఖ్యం. పెడదారి పట్టించే కథలు అనవసరం. క్షణికోద్రేకాన్ని కలిగించే సెక్సు కథలు, జుగుప్స కలిగించే, ద్వేషాన్ని కక్షల్ని పెంచే క్రైం కథలూ, శృంగారం పేరు మీద కథలు ఎక్కువయి పోయాయని నా అభిప్రాయం.

నేటి పత్రికలకు, సర్క్యులేషన్‌ని పెంచడం వగైరాలు ముఖ్యమైన

విషయాలుగా తయారయ్యాయి. ఒక పత్రిక కన్నా మరో పత్రికకి సర్క్యులేషన్ ఎక్కువుంటే పోటీని తట్టుకోవడానికి ఏం చెయ్యాలో ఆలోచించడం వారికి తప్పడంలేదు. అంటే పత్రికలు కేవలం వ్యాపార సరళిలోనే నడుస్తున్నాయి. కానీ రచయిత గొప్పదనం లేదా రచనలోని విషయంకి ప్రాముఖ్యం తగ్గిపోయింది. బహుశా సినిమాల ప్రభావం, వారిలాగా, వ్యాపార ధోరణి వీరికి పెరిగిపోయింది. అలాకాక 'సొంత లాభం కొంతమాని' కాస్త సమాజాన్ని దృష్టిలో పెట్టుకుని ప్రయోజనకరమైన కథలను ప్రోత్సహిస్తే, వ్యాపారంతో పాటు సమాజ సేవా చేసినట్టవుతుంది. ఎందరో వేలాదిమంది చదివే పత్రికల ప్రభావం పాఠకుల మీద పడుతున్నప్పుడు అది వారి నైతిక బాధ్యత కాదంటారా? కొన్ని మంచి పత్రికలు మంచి సాహిత్యాన్ని ప్రోత్సహించడానికి ప్రయత్నంచేస్తూనే వున్నా అవి ఈనాటి పోటీ ధాటికి నిలవలేకపోతున్నాయి. అది చాలా విచారకరం. అందుకు అన్ని పత్రికలు బాధ్యత వహించి మంచిని పెంచే మార్గం అవలంబిస్తే బాగుంటుందేమో! క్షుద్ర సాహిత్యం, బూతు సాహిత్యం, క్రైం కథలు ఎక్కువగా ప్రోత్సహించడం వల్ల, ఆ ప్రభావం పాఠకుల పైబడి లాభంకన్న నష్టం సమాజానికి ఎక్కువగా కలుగుతుందని నా అభిప్రాయం. 'సినిమాలు చూసి చెడిపోవడం, బాగుపడడం జరగదని నా నమ్మకం' అన్నాడో పెద్ద హీరో. అలాగే 'నవలలు చదివి చెడిపోవడం, బాగుపడడం జరగదని తన అభిప్రాయాన్ని వ్యక్త పరిచాడో గొప్ప రచయిత' - వారితో నేను పూర్తిగా ఏకీ భవించ లేకపోతున్నాను. ఎందుకంటే అందరి మనస్సూ ఒకేలా వుండదు కదా ? ఒకే సంఘటనకి ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్కలా స్పందిస్తాడు. ఎందుకని ? అది వాళ్ల మనస్తత్వం మీద ఆధార పడుంటుందని నా అభిప్రాయం. సున్నిత స్వభావం కలవారూ, మెత్తని మనస్తత్వం కలవారు వేరుగా స్పందించొచ్చు!

ఏది ఏమైనా పిసరంత మంచిని వివరించడానికి కొండంత దౌర్భాగ్యాన్ని వివరిస్తే, కొండంతలో ఆ పిసరంతా, గంగలో కలిపిన ఇంగువలా ఆచూకి వుంటుందా?

మంచి సాహిత్యం, రసానుభూతిని కలిగించేదీ మంచిని పెంచేదీ, హృదయాన్ని కదిలించేదీ పది కాలాలు నిలుస్తుంది కానీ, క్షణి కానుభూతుల్ని కలిగించేది తాత్కాలికంగా నిలిచి శాశ్వతమైన హాని కలిగిస్తుందని నా అభిప్రాయం.

**ఘండికోట బ్రహ్మాజీరావు** .

కథానికలు 1940 నుండి వ్రాస్తున్నాను - తొలి దశలో పత్రికలలో పేరు పడడానికి వ్రాశాను. కొన్ని కథానికలు అచ్చయిన తరువాత 'భారతి' మాసపత్రికలో కధానికను వేసుకునే స్థాయికి ఎదగాలని తలచాను - (కాని ఆ భాగ్యం కలుగ లేదు-వాళ్లు నా నవలలు వేసుకున్నారు.) . - ఇప్పుడు నిర్భయంగా నా మనస్సులోవున్నది చెప్పాలని వ్రాస్తున్నాను.

వేల సంఖ్యల మీద కథానికలు వస్తున్నాయి. - జాతీయ స్థాయిలోను, అంతర్జాతీయ స్థాయిలోను ఏవీ నిలబడకుండా ఉన్నాయి - తెలుగు కథానికలు ఇతర భాషలలోకి వచ్చే పోటీకి తట్టుకోవాలి - ఆంగ్లంలోకి అనువాదం కావాలి. పత్రికలలో వచ్చే ప్రతి కథానిక కాలానికి నిలువదు.

కథానికల రాసి పెరిగింది - పత్రికలు సహకరించడం బట్టే ఇవి వెలుగు చూస్తున్నాయి - సంపాదకులు తమ ఉచ్చులు బిగిస్తున్నారు - షరతులు విధిస్తున్నారు - కథానికను రెక్కలు కత్తిరించిన చిలుకలా మనఎదుటనే తిడుతున్నారు.

భాష విషయంలో కొంత శ్రద్ధ తీసుకోవాలి - రాయలసీమా,

తెలంగాణా, సర్కారు జిల్లాల భాషలను పాత్రల భాషల మేరకు పరిమితం చేయాలి. కథానిక అంతా ఈ మాండలికాలలో నడిస్తే, అది ఎంత బాగున్నా సన్న బియ్యపుటన్నంలో రాళ్లు కలిపినట్లే ఉంటుంది.

సిద్ధాంతాల నిర్బంధాల నుండి, ఆదర్శవాదం యొక్క ఆలింగనం నుండి కథానిక వేరవాలి - మానవతా వాదానికి చెందిన కథానికలే అందరికీ నచ్చుతాయి - నిలుస్తాయి.

కథ వేరు కథానిక వేరు. కథకు శిల్పం అవసరం లేదు. కాని కథానికకు రచనా శిల్పం అవసరం. కథానికా సదస్సులు రాజధానికే పరిమితం చేయక ఇతర నగరాలలో కూడా నిర్వహించాలి.

**ఉపద్రష్ట సాయి**

రచయితకు సామాజిక బాధ్యత వుంది. సమాజ శ్రేయస్సు కోసం తన వంతు కర్తవ్య నిర్వహణ తన రచనల మూలంగా చెయ్యాలనే విశ్వాసం రచయితకు వుండాలనే భావం నాది. రచనల ద్వారా (ఎంతో కొంత) సమాజాన్ని చైతన్యవంతం చెయ్యాలనీ, వ్యక్తి వికాసానికి తోడ్పడాలని నా ధ్యేయం. అంతరించిపోతున్న మానవత్వపు విలువలకు పునరుజ్జీవనం కల్పించాలని నా కోరిక. అందుకే 1970 నుంచీ రచనలు చేస్తున్నాను. రాశి ఎక్కువైనప్పుడు వాసి తక్కువ కావడం సహజమే. మంచి కథలు వస్తూనే వున్నాయి కానీ కథలు ప్రాంతాల వారీ కథలుగా, ఆయా ప్రాంతాల ప్రజల జీవితాలకు మాత్రమే పరిమితం కాకుండా మొత్తం జాతీయ, అంతర్జాతీయ మానవ సమాజానికి వర్తించే ఇతి వృత్తాలతో వచ్చే కథలు అవసరం. అటువంటి కథలు ఎక్కువగా రావడం లేదు. హాస్య రచనలు కావాలి. అవి తక్కువగా వస్తున్నాయి. కథ ఆశాజనకంగానే వుంది.

వారి వారి పరిధుల్లో పత్రికలు సహకరిస్తున్నాయి. పత్రికల్లో రకరకాల శీర్షికలతో బాటు కథలు కూడా రావడం మూలాన కథల ఎన్నిక పట్ల శ్రద్ధ, తీరిక సంపాదకులకు వుండకపోవచ్చు. ప్రతి పత్రిక సీనియర్ రైటర్స్ panel ఒకటి తయారు చేసి వారి ద్వారా కథలను ఎన్నిక చేసి ప్రచురిస్తే గానీ మంచి కథలు ఎక్కువగా రావేమో

మంచి కథలు ప్రజల దగ్గరికి వెళ్ళడానికి పత్రికలను మాత్రమే ఆశ్రయించ కుండా, రచయితలు కూడ బల్బుక్కుని అప్పుడప్పుడు సంకలనాల రూపంలో కథలను ప్రజలకు అందించ గలగాలి, కారణం ఒక్కటే. పత్రికల్లో కథలు ఒక భాగమే. కాని సంకలనాలలో కథలు మాత్రమే వుంటాయి, కనుక అవి ప్రజలను ఆకట్టుకో గలవు. కథా రచయితల సమావేశాలు కథకు కొత్త ఊపిరి పోస్తాయి. ఈ విషయంలో రచన శాయిగారు, శ్రీ వాకాటి గారు తీసుకుంటున్న శ్రద్ధ హర్షించదగ్గది. ఈ సమావేశాలు కేవలం పబ్లిసిటి సమావేశాలుగా కాకుండా పత్రికల కన్‌స్ట్రక్టివ్ సమావేశాలుగా వుంటేనే ధ్యేయం నెరవేరుతుంది.

**వసుంధర**

మానసిక వికాసానికీ, ఆనందానికీ 1963 నుంచి రాస్తున్నాను. కథలు చాల ఎక్కువగా వస్తున్నాయి. ఎక్కువశాతం బాగుండడం లేదు. అద్భుత మనిపించే కథలు ఇప్పుడు సంతృప్తికరమైన సంఖ్యలోనే వస్తున్నాయి.

పత్రికల సహకారం వల్లనే మంచి కథలు వస్తున్నాయి నిస్సందేహంగా! పత్రికలు సర్క్యులేషన్ పై ఎక్కువ దృష్టిని కలిగి ఉంటున్నా కథను నిర్లక్ష్యం చేయక పోవడం ముదావహం.

శ్రీ కొడవటి గంటి కుటుంబరావు మాటల్లో చెప్పాలంటే మంచి కథలను ఆ కథా రచయిత నిలబెట్టలేడు కధారాధకులైన పాఠకులే

వాటిని నిలబెట్టుకోవాలి. కొన్నిదశాబ్దాల క్రితానికిలా నవలల కంటె కథా సంపుటాలకే పాఠకుల ఆదరణ లభించే రోజు రావాలి. అందుకు కృషి జరగాలి.

**తురగా జయశ్యామల**

కథలు ఎందుకు రాస్తున్నానంటే నన్ను ప్రభావితం చేసిన సంఘటనల గురించో, మనుష్యుల గురించో, నాలోని భావాలు నల్గురితోను చెప్పాలని, పంచుకోవాలని కథలు రాయడం జర్గుతోంది. 1970 నుంచి రాస్తున్నాను.

గత రెండు, మూడు సంవత్సరాలుగా సాహిత్యంలో, ముఖ్యంగా కథా రచనలో చాలా మంచి మార్పు వస్తోంది. ఎందరో కొత్త రచయితలు కొత్త ఇతివృత్తాలతో ఎంతో మంచి రచనలు చేస్తున్నారు. ఆనందించ తగ్గ విషయం.

ఏవో ఒకటి రెండు పత్రికలు తప్ప, మంచి కథలకు ఎప్పుడూ పత్రికల సహకారం లభిస్తోంది. ఉదా. రచన, స్వాతి మాస పత్రికలు, ఆంధ్రప్రభ మొదలయిన పత్రికలు చక్కని కథలకు సరియైన అవకాశం యిస్తున్నాయి.

ప్రత్యేకంగా చెప్పదలచుకున్న విషయాలంటూ ఏమిలేవు. మార్పు అనేది ప్రతి రంగంలోనూ వచ్చినట్లే సాహిత్య రంగంలోను వచ్చింది. చెడు అనేది ఎక్కడయినా ఎంత వేగంగా పాకుతుందో, అంత వేగంగానూ మాయమవుతుంది.

**ప్రఫుల్ల చంద్ర**

కాలక్షేపానికే 1976 నుంచి రాస్తున్నా కడివెడు కథల్లో గంటెడైనా ఉన్నాయ్ మంచి కథలు.

కథలకి పత్రికల సహకారం. అంతంత మాత్రమే. సరియైన మార్గంలో వెళుతున్న పత్రికలు రెండో, మూడో.

ప్రచురణకు ఏళ్ళూ పూళ్ళూ పడుతోంది. నా స్నేహితుడు 91లో పంపిన కథ ఈ మధ్యనే ప్రచురించబడింది. 2,3 నెలలలోగా ప్రచురణార్థం అయిందీ, కానిదీ తెలియజేస్తే ప్రచురణ కాస్త ఆలస్యం అయినా రచయితకు కాస్త ఊరట, నేనొక వార పత్రికకు కథ పంపితే దిన పత్రికలో ప్రచురించారు. కాంప్లిమెంటరీ కాపీ అంద లేదు. పారితోషికం అందుకున్నప్పుడు తెలిసింది ఆ కథ ప్రచురించబడినట్లు! ఒక కాపీ పంపమని రాస్తే జవాబే లేదు. రాసిన ఉత్తరాన్కి జవాబు రాయవలసిన బాధ్యత తీసుకోవాలి అంతేగాని ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు'' అని ముసుగు వేసుకోకూడదు.

**కే.వి.రావు , (స్వామి చిత్రానంద)**

నిజ జీవితంలో నాకు స్ఫూర్తినిచ్చిన సంఘటన, పాత్ర తారస పడినపుడే నేను కథలు రాయగలుగుతున్నాను. ఉహించి రాయడం లేదు.

నా మొట్టమొదటి కథ మావూరి వారి అల్లుడు.

43 వ సంవత్సరంలో చిత్రగుప్తలో ప్రచురించారు. నేను కథలు చాలా తక్కువగానే చదువుతాను. ఈ మధ్య నేను చదివిన 'బంగారు మురుగు' (ఆంధ్రజ్యోతి వార పత్రిక) ఇండియా టుడేలో సాహిత్య సంచికలోని కథలూ, 'రచన' పత్రికలో వస్తున్న కథలూ నాకు బాగా నచ్చినవి. పత్రికలు తమ సంచికల్లో కథలను ప్రచురించి ఆగిపోకుండా, సంవత్సరానికి ఒక్కసారైనా మంచి కథలు ఎన్నికచేసి

(పాఠకులు, ప్రముఖుల అభిప్రాయాలు) పుస్తకంగా వెలువరిస్తే ఆ కథలకు శాశ్వతత్వం లభిస్తుంది.

కథా రచయితలకు పారితోషికం నగదుగా కాకుండా, చందా కూపన్‌లుగాయిస్తే ఆ కథా రచయిత మరింత మంది పాఠకులను తయారుజేసే అవకాశం వుంటుంది.

పాఠకులకు, రచయిత చిరునామా కూడా తెలిస్తే పాఠకుడూ, రచయిత మంచి స్నేహితులు అవుతారు. విమర్శను స్వీకరించే సహృదయం రచయితకూ, నిర్మాణాత్మకమైన విమర్శ చేసే నేర్పు పాఠకుడికి కావాలి.

**వై. రాంబాబు**

మంచి కథలు చదివిన ప్రభావంతో మంచి కథ రాయడం ఎలాగో తెలుసుకోవడం కోసం ముప్పై నాలుగేళ్లనించి రాస్తున్నాను. కొందరు మంచి కథలు రాస్తున్నారు. చాలా మంది అసలు తామెందుకు రాస్తున్నారో, పాఠకుల పై వాటి ప్రభావం ఏమిటో తెలీని స్థితిలో వున్నారు. కాలక్షేపం, వినోదం కథకు ప్రయోజనాలు కావు. సెక్స్‌పాలు తగ్గాలి. మంచిని పెంచాలి.

పత్రికలకు కవిత్వం మీద వ్యామోహం ఎక్కువ. కథలో ఇంకా ప్రయోగాలు జరగాలి అందుకు పత్రికలు, వేదికలు కావాలి. కొత్త కథకులకు ప్రోత్సాహం కలిగించాలి. కొత్తవారు చాలమంది కథ రాయాలని ఉత్సాహం చూపుతున్నారు. వాళ్లకు పాపులర్ రచయితలు మాత్రమే తెలుసు. పాతతరం రచయితల కథలపై విశ్లేషణలు విస్తృతంగా రావాలి. కథా రచనలో మెళుకువలు తెలియ చెప్పేందుకు పత్రికలు కృషి చేయాలి.

## పెద్దిభొట్ల సుబ్బరామయ్య

నా చుట్టూ వున్న సమాజంలోని వ్యక్తుల జీవితాలు, వారి బాగోగులు కష్టాలు నాలో రేకెత్తించిన స్పందనను ఆ జీవితాలను వారితో పంచుకోవాలని, 1959 నుంచీ వ్రాస్తున్నాను. ఇంకా వ్రాస్తున్నాను.

రాయలసీమ, తెలంగాణాలోని కొందరి రచనలు, కథా రచనను సీరియస్‌గా తీసుకుని సామాన్య మానవుడి జీవితం ఇతివృత్తంగా చక్కని కథలు వ్రాస్తున్నారు. కోస్తాలో పనికిమాలిన సినిమాలపట్ల ఉన్న మోజు యువతరంలో కథా రచన పట్ల లేదు. వేళ్ల మీద లెక్కించ దగినంత మంది మాత్రమే శ్రద్ధ చూపుతున్నారు. కథలు చదవడం మీద, వ్రాయడం మీదను కొత్తకథలు అప్పుడు యిప్పుడూ పత్రికలలోనే వస్తున్నాయి. సంఖ్యలో కొద్ది అయినా అయితే పత్రికలలో ఇతరేతర విషయాల మధ్య, కూడా అనాగరక జోకుల మధ్య, నాలుగైదు ధారావాహిక నవలల మధ్య నలిగి గుర్తింపు పొందకుండా పోతున్నాయి. కథలకు ప్రత్యేక గుర్తింపు నిచ్చే పత్రికలు ఉండాలి.

కొత్త కథల అధ్యయనం జరగాలి. కళాశాలల్లో కథను పాఠ్యాంశం చేయడం ఒక పద్ధతి, ఒక్కొక్క గుర్తింపు పొందిన రచయిత Contribution మీద సవివరమైన చర్చ జరగాలి. కథా సాహిత్యంలో ఏ రచయిత స్థానమేదో నిర్ణయించే విధంగా చర్చ జరగాలి. ఉత్తమ రచనలను Identify చేసి వాటిని పుస్తక రూపంగా తెచ్చే ప్రయత్నం జరగాలి. మంచి కథలను ఇతర భారతీయ భాషల్లోకీ, ఇంగ్లీషులోకీ అనువదింప జేసి ముద్రించే ప్రయత్నం మరింత ఎక్కువగా జరగాలి.

**ఎం.వి.వి. సత్యన్నారాయణ**

ఎందుకు రాస్తున్నానో కొంతకాలం పాటు రాశాక గాని లక్ష్యం అర్థం కాలేదు. నాలాంటి మధ్య తరగతి జీవులకు అర్థం పట్టాలన్న లక్ష్యంఅది. నా పదహారో ఏట మొదటి కథ అచ్చయింది. కొత్త రచయితకు అప్పటిలో మాలాగా పునాది లేదు. భాష, ఒరవడి లేవు. ప్రాచీన సాహిత్యం చదివే అలవాటు లేదు. కాని భావ ప్రకటన పదునుగా వుంటోంది. కాస్తంత ఒరవడి దిద్దుకుంటే చాలు గోపిచంద్, కా.రా లు ఇప్పుడు రాయని లోటు తీరవచ్చు.

ఒకటి, రెండు పత్రికలు తప్ప అన్ని పత్రికలూ కలిసి కథను చంపేశాయి. పైరవీలు, ఆశ్రితపక్షపాతం ఈ చక్కటి విలువైన సాహిత్య ప్రక్రియకు చెదలు పట్టించాయి. నిజాయితీ నిండుసున్న. ఎడిటర్లకు ఓపిక లేదు.

కథను బతికించుకోవాలి. పిప్పరమెంట్ సాహిత్యంలా తయారైన నవలా సాహిత్యంలో పెద్ద పీట వేసి వారం వారం విపరీతంగా ఉవ్విళ్లూరించడం వల్ల పత్రికలు ఆత్మహత్య చేసుకుంటున్నాయి. తెలుగు జాతీయతను దూరం చేస్తున్నాయి.

**వాచస్పతి (ఎం. పద్మావతి)**

1961 నుండి కథలు రాస్తున్నాను. ఎవరికైనా అన్యాయం జరిగినప్పుడు, లేదా అవహేళనకు గురైనప్పుడు మనసు విపరీతంగా బాధపడడం, ఆ వ్యధ బహిర్గతమైతే కాని, మనశ్శాంతి లభించకపోవడం ఒక కారణమైతే, ఇలా జరుగుతున్నదని నలుగురికీ చెప్పాలనే ఆరాటం, గాఢమైన కోరికా మరో కారణం. అనేక రకాల సమస్యలతో సతమతమౌతూ, దారి తెలీని ఈ జనారణ్యంలో ఒక్కోసారి

మార్గం తప్పిపోతూ, కొన్ని సార్లు జీవితాన్ని కూడా అంతం చేసుకోవాలనుకునే నిరాశాపరులకు నాకు తెలిసిన పరిష్కారాన్ని (దురాశ కావొచ్చునేమో!) చూపాలనే ప్రబలమైన కాంక్ష మరో కారణం. పై కారణాలన్నీ నా చేత కలం పట్టించాయి. ఇప్పుడొస్తున్న చాలా కథలు కేవలం కాలక్షేపానికే. సత్కాలక్షేపానికైతే నన్నా బావుణ్ను! కొన్ని కథలు అర్థం పర్థంలేనివి (సెక్స్ ప్రధానంగా గలవి) సరికొత్త ఇతివృత్తాలతో కథలు రాస్తున్నారు. ఆ కథల్లో చిత్తశుద్ధి, నిబద్ధతా ఉండడం లేదు. అలాగని, అసలు మంచి కథలే రావడం లేదని చెప్పేందుకు వీల్లేదు. గంజాయి వనంలో తులసి మొక్కల్లా, మంచి కథలూ వెతుక్కుంటే దొరుకుతున్నాయి. మంచి కథలు ప్రచురించాలన్న ధ్యేయంకన్నా, పాపులర్ కథలు (సెక్స్, వైలెన్స్, అతి చమత్కారం మొ.) ప్రచురించి, సర్క్యులేషన్ పెంచుకోవాలన్న దృక్పథము చాలా పత్రికల కున్నట్లనిపిస్తుంది. కారణాలేవైనా, మంచి కథలు ప్రాచుర్యానికి చాలా పత్రికల సహకారం లభించడం లేదు. విలువలు తరిగిపోతున్న ఈ రోజుల్లో మంచి కథల అవసరం ఎంతైనా ఉంది. గతంలో మంచి కథలు రాసిన రచయిత(త్రు) లు గాని, వాటిని ప్రచురించిన పత్రికలు గాని, పాఠకులు కోరినట్లు రాయలేదు, ప్రచురించలేదు. సమాజంలోంచి మంచి చెడులను, ఎత్తి చూపి, చెడును నిర్మూలించి, మంచిని పెంచమని హితవు చెప్పారు. రోగి రోగాన్ని పోగొట్టేందుకు వైద్యుడు సరైన మందునివ్వాలి గాని రోగి కిష్టమైన తియ్యని మందులిచ్చి రోగిని చంపకూడదు. ఇక్కడా అంతే! రెండోది కథా సంపుటాలు ప్రచురించడం, వాటిని కొని చదవడం గగన కుసుమంలా ఉన్న ఈ రోజుల్లో పత్రికలే మంచి కథల ప్రచురణకు పూనుకోవాలి.

**ఎ. అప్పల్నాయుడు**

జీవితం స్పష్టం చేయలేని దానిని సాహిత్యం స్పష్టం చేస్తుందని పెద్దల ద్వారా గ్రహించి జీవితాన్ని స్పష్టం చేయదల్చి జీవితం గూర్చి చెప్పాల్సిన విషయాన్ని రాస్తున్నాను.

ఇప్పటి కథలు వైవిధ్యభరితంగా వస్తున్నవనే భావిస్తాను. కాకపోతే స్పష్టీకరణ కొచ్చే సరికి Fail అవుతున్నవన్న బాధవుంది. ఇందుకు కారణం సామాజిక అవగాహన నిర్దిష్టంగా లేక పోవడమే. (ఈ అభిప్రాయం సాహిత్య పత్రికల్లో రచన లాంటి వచ్చే కథల మీదనే తప్పా-రూపంలో సాహిత్యం సారంలో వ్యాపార పత్రికలో వచ్చే కథలపై కాదు. వ్యాపార పత్రికల కథల పట్ల ఏమీ చెప్పనక్కర లేదు. సాహిత్య విలువలకు, సాహిత్య ప్రయోజనానికి కట్టుబడే కొన్ని పత్రికలే(వేళ్లమీద లెక్కించే) కథా ప్రాచుర్యానికి కృషి చేస్తున్నవి.

రచన, ఆహ్వానం, ప్రభ, జ్యోతి, అరుణతార, ప్రజాసాహితి లాంటివి) అయితే కథల పట్ల సమీక్ష ఎప్పటికప్పుడు చేయిస్తే కథా ప్రాచుర్యానికి మరింత ఉపకరిస్తుంది.

తెలుగులో ఆధునిక కథ - సామాజిక జీవితంలోంచి పుట్టింది. సామాజిక ప్రయోజనం కోసం పుట్టింది. ఆ అడుగుజాడలో నడవాల్సిన కథకు నేడు అనేకానేక అవాంతరాలేర్పడి జీవితానికి దూరమయ్యే స్థితి దాపురించింది తిరిగి కథను జీవన మార్గంలోకి నడవాల్సిన బాధ్యతను కథకులందరూ తీసుకోవాలని, అందుకు కృషి చేయాలని అది రచయితల సామాజిక బాధ్యతని చెప్పదలచాను.

**కె.వి.యస్. వర్మ**

మొదటి కథ 1968 మే లో 'సుహాసిని' మాస పత్రికలో అచ్చయింది.

ఈ ప్రపంచంలోని వివిధ విషయాల మీద నా అభిప్రాయాలు చెప్పడానికి రాస్తున్నాను. నాకు నచ్చని విషయాల్ని ఖండించడానికి రాస్తున్నాను. దిగజారుతున్న మానవతా విలువల్ని చూసి చలించి రాస్తున్నాను. సమాజంలోని అసమానతలు తొలగాలనే కాంక్షతోనూ రాస్తున్నాను.

మంచి కథలు వస్తున్నాయి. గ్రామీణ నేపథ్యంలో కొందరు కొత్త రచయితలు చక్కని కథలు రాస్తున్నారు. వైవిధ్యం కూడా వుంటోంది. లక్ష్యమూ వుంటోంది.

కథా ప్రాచుర్యానికి పత్రికల సహకారం తప్పకుండా వుండాలి. మంచి కథల్ని ప్రచురించే పత్రికలు కొన్ని వున్నాయి. ఓ పక్క కమర్షియల్‌గా తమకు పని కొచ్చే రచనలు వేస్తూనే మంచి కథల్ని కూడా కొన్ని పత్రికలు వేస్తున్నాయి. రచన, ఆహ్వానం మాస పత్రికలు మంచి రచనలు వేస్తున్నాయి.

కథలను విశ్లేషించే విమర్శకులు మనకు అంతగా లేరు. కథల సంపుటిల్ని ఎక్కువగా కొందరు రచయితలే వేస్తున్నారు తప్ప విమర్శకులంటూ ప్రత్యేకంగా లేరు. కథా విమర్శకుల అవసరం వుంది. పత్రికలు కూడా అందుకు తగిన స్థలం కేటాయించాలి, ఇటీవల 'రచన' ఆ పని చేస్తోంది. ఇతర పత్రికలు కూడా ఆపని చేస్తే బావుంటుంది. కథా వేదిక మంచి కథల్ని పుస్తకాలుగా తేవడం తద్వారా కథకి మేలు చేస్తోంది. ఇలాంటివి మరిన్ని రావాలి.

**వియోగి (కోపల్లి విజయప్రసాదు)**

జీవితంలో నా దృష్టిలోకి వచ్చిన సత్యాలను కళాత్మకంగా పదిమందితో పంచడం కోసం నేను కథలు రాస్తున్నాను. నేను రాసిన కథలు సమాజాన్ని ఉద్ధరించక పోయినా పరవాలేదు కాని రాసి సమాజాన్ని దిశ మార్చకుండా వుంచాలన్నది నా అభిప్రాయం కావడంతో కలంపైన ఆంక్షలు విధించున్నాను. చిన్నప్పటి నుండి అన్ని ప్రక్రియలు రాసే అలవాటు ఉన్నా 1987 విహారి గారితో పరిచయం ఏర్పడిన నాటి నుండి కథలు రాయడం సీరియస్‌గా మొదలెట్టాను.

ఆధునిక సమాజంలో విలువలు క్రమంగా పడిపోతున్నాయి. మానవత్వం మృగ్యమైపోయి - డబ్బు ప్రాబల్యం అధికమైపోతున్నది. ఈ ప్రభావం కథకుల పైన, పాఠకుల పైన, విమర్శకుల పైన, ఈనాటి ఎడిటర్లపైన కూడా వుంది. అప్పుడప్పుడు మంచి కథలు వెలువడుతున్నాయి. కథలు వెర్రితలలు వేస్తూ సెక్సు, శృంగార కథ,, పేజీ కథ వగైరాలు పుట్టుకొచ్చాయి. ఒక వర్గం కథలనే ఆ వర్గంవారు ఆకాశానికి ఎత్తేస్తున్నారు. కొన్ని మంచి కథల్ని ఎవరు పట్టించుకోవడం లేదు.

కొన్ని పత్రికలు ఆంధ్రప్రభ, ఇండియా టుడే లాంటివి మంచి కథల్ని ప్రోత్సహిస్తున్నాయి. కాని కొన్ని పత్రికలు సీరియల్సుకే అత్యధిక ప్రాధాన్యత యిస్తున్నాయి. ఒకటి రెండు సీరియల్సు ఆపి కథలు ప్రచురిస్తే బాగుంటుంది. ప్రతి కథలో ఒక్కో గొప్ప కథ రచయితలా గాని విమర్శకుడిలా గాని ఆ కథ యొక్క గొప్పదనం మీద చిన్న వ్యాసం ప్రచురిస్తే బాగుంటుంది.

ప్రతి ఎడిటరు ప్రతి కథ ప్రచురించే ముందు ఈ కథ తన తల్లి చెల్లి, భార్య, కూతురు, తండ్రి, తమ్ముడు మొదలైనవారు చదివితే ఎలా స్పందిస్తారు వారి మీద దీని ప్రభావం ఏమైనా ఉంటుందా అని ఆలోచించాలి. సంఘాన్ని కూలదోసే రచనలు వేయకూడదు మంచి సంస్కరణలు ప్రవేశపెట్టే కథలు వేయవచ్చు. సమాజానికి ఎడిటర్లు ఫిల్టర్లులాగా పని చెయ్యాలి. చెడును అడ్డగించి మంచిని ప్రోత్సహించాలి కథల బొమ్మలలో కూడా బూతు ఎక్కువగా కనిపిస్తున్నది దీన్ని నివారించాలి. పేరు పడ్డ రచయితల కథలే కాకుండా పేరు లేని వారి కథలు కూడా బాగుంటే వెయ్యాలి. ఒక్క వర్గానికే కట్టుబడి ఉండకూడదు. అందరినీ ప్రోత్సహించాలి.

**బి.వి. రమణారావు**

1952 నుంచీ రాస్తున్నాను. రాసినవి తక్కువ. ముప్పయి నాలుగు రాశాను. అందులో హాస్యరస ప్రధానమైన కథలెక్కువ. నాకూ, చదివే వాళ్ళకి సరదాగా వుంటుందని రాస్తున్నాను. నో హాబీ.

ఇప్పుడూ చాలా మంచి కథలు వొస్తూనే వున్నాయి. అయితే శిల్పానికి వినోదానికి ప్రాధాన్యత యివ్వకుండా, దారుణంగా దిగజారుతున్న నేటి సాంఘిక వాతావరణం లోంచి ఉద్భవించిన కథా వస్తువులతో సందేశం యివ్వాలన్న ప్రయత్నంలో రాస్తున్న కొన్ని కథలు చదవడానికి చేదుగా వుంటాయి.

సినిమాల ప్రభావం వల్ల అవినీతి, హింస, సెక్స్, డ్రగ్స్, అత్యాచారాలు, హత్యలు వున్న రచనల పట్ల ప్రజల అభిరుచి పెరిగింది. అంచేత వాటికి ప్రాముఖ్యం యిచ్చే సీరియల్స్ సంఖ్య పత్రికల్లో పెరిగింది. సహజంగా కథలకు ప్రాచుర్యం తరిగింది.

సినిమాల్లాగే పత్రికలు కూడా వ్యాపార సంస్థలు కనక ఈ ధోరణి మారే అవకాశం లేదు.

నేను ఏ వార పత్రికకి చందాదారుణ్ణి కాను. ఏ పత్రికలోనైనా మంచి కథ పడిందని తెలిస్తే ఆ పత్రిక కాపీ కొంటాను. ప్రతీ నెల విపుల కొంటాను. ఈ మధ్యనే రచన కొంటున్నాను. నాకు పత్రికలు నడిపే వ్యాపారంలో అనుభవం లేదు. కథలకు ప్రాధాన్యత యిస్తూ పత్రిక నడపడం లాభసాటి అయితే అతకు మించిన సాహిత్య సేవ వుండదు. సాహిత్యంలో అభిరుచి వున్న విద్యావంతులు తప్పకుండా కొని చదివి దాచుకుంటారు..

**'సీతాసత్య'**

మనసులోని భావాలను అక్షరరూపంలో నలుగురితోనూ పంచుకొనడం ద్వారా లభించే తృప్తి కోసం రాస్తున్నాము కె.వి.వి. సత్యన్నారాయణ రాజుగా 1984 నుంచీ, 'సీతా సత్యగా' 1989 నుంచీ. కథా వస్తువుల్లోనూ, కథనంలోనూ వైవిధ్యం కొరవడడం నేటి కథల్లోని ప్రధాన లోపమనిపిస్తోంది. మంచి కథలు నిజంగా రచయితల నుంచి రావడం లేదో లేక పత్రికలు మంచి కథల్ని ఎంపిక చేసుకోలేక పోతున్నాయో అర్థం కాని స్థితి. లబ్ద ప్రతిష్టులుగా పేరు పొందిన చాలా మంది పాత రచయితల కథల్లో పసతక్కువా, నస ఎక్కువగా ఉంటోంది. అందరూ మెచ్చుకుంటున్నారు కదా, తాము మెచ్చుకోకపోతే బావుండదనే నిర్లిప్త ధోరణి సమకాలీన రచయితల దృక్పథంలో ద్యోతకమౌతోంది. కథల్ని పూర్తిగా విస్మరించి, కేవలం సీరియల్స్ ఆసరాతోనే పత్రికల్ని నడిపే పంథాలో ఇంచుమించుగా అన్ని పత్రికలూ పయనిస్తున్న తరుణంలో 'రచన' పత్రిక ఆవిర్భావం కథల ప్రాచుర్యాన్ని గురించి పునరాలోచించుకునే అవకాశాన్ని ఇతర పత్రికలకు కలుగజేసింది. త్వరలోనే ఇతర

పత్రికలు కూడా కథా ప్రాచుర్యానికి తగిన సహకారం అందిస్తాయనే ఆశ కలుగుతోంది.

కథ ప్రచురించి చేతులు దులుపు కోవడమనే బద్ధకపు ప్రక్రియకు స్వస్తి చెప్పి ఆ కథ మీద వచ్చిన అభిప్రాయాలను సంబంధిత రచయితలకు అందజేసే విధానానికి పత్రికలు రూపకల్పన చేస్తే తద్వారా మున్ముందు మంచి రచనలు చేసే మేరకు ఆత్మ పరిశీలన చేసుకునే వీలు రచయితలకు కలుగుతుంది.

వెయ్యి మంచి కథలు రాసిన రచయిత వెయ్యిన్నొకటో కథ చెత్తగా రాస్తే, అదే విషయాన్ని నిర్మొహమాటంగా వ్యక్తం చేసే విమర్శకుల అభిప్రాయాలకు తగిన ప్రాచుర్యం కల్పించాలి.

ఆకలి కథనో, బాధ కథనో, పల్లెటూరి వాతావరణం నుంచి వచ్చిన కథనో, లేదా ఏదో ఒక మాండలికంలో వచ్చిన కథనో 'మంచి కథ' గా భ్రమించే విధానానికి సాధ్యమైనంత త్వరలో స్వస్తి చెప్పడం వాంఛనీయం.

ఒకటి రెండు పత్రికలు మినహా, గతంలో రచయితతో ఎంతో ప్రాంప్ట్‌గా వ్యవహరించే ఇతర పత్రికలు కూడా కాంప్లిమెంటరీలు, పారితోషికాల మాట దేవుడెరుగు, కథను ప్రచురణకు స్వీకరించిన విషయాన్ని ముందుగా ఓ కార్డు ముక్క ద్వారా తెలియజేసే కనీస సంప్రదాయాన్ని కూడా పాటించని పత్రికల సరసన నానాటికి ఏ కారణం చేత చేరిపోతున్నాయో మాకు ఊహ కందని విషయం.

దురదృష్టవశాత్తూ ఇటీవలి కాలంలో సాహిత్యంలో తరచూ తలెత్తుతున్న ప్రాంతీయ తత్వమనే ప్రమాదకరమైన ధోరణిని మొగ్గ దశలోనే త్రుంచి వేయడానికి, రచయితలూ, పత్రికా సమిష్టిగా కృషి చేయాలి.

**కాళీపట్నం రామారావు**

కొందరు ముందుతరం రచయితల్లానే జీవితావగాహనను ఇతరులతో పంచుకో డానికి 1943 నుంచీ -అడపాదడపా రాస్తున్నా మధ్య మధ్య ఏళ్ళ తరబడి మానేస్తూ.

వెనకాటికన్నా సామాజిక జీవితాన్ని విస్తృతంగానూ, లోతుగానూ స్పృశిస్తున్నాయి నేటికథలు.

లాభాలకు అడ్డురానంతవరకూ, సంపాదకుల స్వేచ్ఛకున్న పరిమితులకు లోబడి పత్రికలు కథా ప్రాచుర్యానికి సహకరిస్తున్నాయి. వెల్లువలా వస్తున్న కథా సంపుటాలు సంకలనాల మార్కెటింగ్ గురించి సకాలంలో తగిన ఏర్పాట్లు జరగకపోతే కథకి ఇప్పుడున్న ఊపు పడిపోతుంది. తెలుగులో మంచి కథల్ని ఇతర భాషల్లోకి అనువదించగలవారికోసం వెతికే సంస్థ ఒకటి ఏర్పడాలి.

**గుడిసేవ సుందరరామయ్య**

నేను 1970 నుంచి కథలు రాస్తున్నాను. మొదటి కథ 'ఏప్రిల్ ఫూల్' ఆంధ్ర ప్రభ వీక్లీలో ప్రచురించబడింది. నా తృప్తి కోసం, సాంఘిక ప్రయోజనం కొరకు కథలు రాస్తున్నాను. గతంలో వచ్చిన కథల కంటే గొప్ప కథలు ప్రస్తుతం రావటం లేదు. పత్రికల సహకారం ఆశించినంత లేదు. అనవసర శీర్షికలను తగ్గించి కథల సంఖ్యను పెంచినట్లయితే పత్రికలు సహకరించినట్లే.

**జయంతి వెంకట రమణ**

1964 నుండి కథలు రాస్తున్నాను. మొదట్లో నాకు ఆసక్తి కలిగించిన అంశాల మీద కథలు రాశాను. ముఖ్యంగా కథనంలో ప్రత్యేకత తేవాలని ప్రయత్నిస్తూ రాశాను. కథ ముగింపుపైనే కథాభారం అంతా ఉంచి రాసాను. నన్ను కదిలించిన విషయాలను కథా వస్తువులుగా తీసుకుని రాసాను. ఆద్యంతాలు చదువరుల

నాకర్షించాలనే రాసాను. కథ వాతావరణం, పాత్ర చిత్రణ చాలా ముఖ్య పాత్ర వహిస్తాయని చెప్పాలనే రాసాను. రాయాలనుకున్నప్పుడల్లా వ్రాసాను.

నిడివిగా వుండే కథలు రావటం లేదు. పాత్రల చిత్రణకి ఎక్కువ అవకాశం కలగటం లేదు. కథను గజిబిజిగా చెప్పాలని అనుకుంటున్నా రెందుకో ! వో చిన్న జోక్‌ని కథని చెసి కథ వ్రాసామను కుంటున్నారు. కథకు పేజీల నియమం ఉండాలన్నది నాకు నచ్చదు. ఎప్పుడో కాదు ఇప్పుడు కూడా మంచి కథలు వస్తున్నాయి. కథలలో కల్పన ఉంటుంది. కాని కథ జీవితం నుండి వేరు కాదు. బాగా తెలిసిన విషయాల మీదే కథలు వ్రాయాలి. కథలపై పత్రికలకు చిన్నచూపు పడింది. ముఖం తుడుపుకి ఒకటి రెండు కథలు వేస్తున్నాయి పత్రికలు. సీరియల్స్‌కు ఇచ్చింనంత ఆదరణ ప్రోత్సాహం కథలకు లేదు. డాక్యుమెంటరీలను కూడా కథలనేసి వేసుకుంటున్నాయి పత్రికలు. కథనేవరు రాశారో చూస్తున్నాయి. పత్రికలు, కాని కథను చూడటం లేదు. పరిశీలనకు పంపిన కథలు పరిశీలింప బడకుండానే తిప్పేస్తున్నారు. మీ కథ ప్రచురిస్తామని చెప్పి సారీ ఎక్కడో పడిపోయింది అంటున్నారు. ఇలా కథలను వర్గీకరించడం నాకు నచ్చదు. పాఠకులకు మంచి కథ నందిద్దామన్న దృష్టి రచయితకు, పత్రికకు ఉండాలి. కథలు కాలక్షేపం కోసం మాత్రమే కాదని అందరూ గ్రహించాలి మంచి కథను పత్రికలు ప్రోత్సహించాలి. నా కథలలో మంచి వాటిని ఎంచి ప్రచురించి నన్ను ప్రోత్సహించిన భారతీ, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, స్వాతి, (మాస, వార) జయశ్రీ, జ్యోతి, ప్రజామాత, విపుల, ఆదివారం ఈనాడు, యువ పత్రికలకు రచనకు నా ధన్యవాదాలు. పత్రికలే మంచి కథకుని, పాఠకులను తయారు చేయాలి.

**శ్రీకంఠస్ఫూర్తి**

కాలక్షేపం కోసం మాత్రం కాదు కథలు వ్రాయడం. రాయాలనే

తపన, స్పందన, బాగా కలిగినప్పుడు సీరియస్‌గా రాస్తున్నాను. ఒక సంఘటన ఒక వ్యక్తి, ఒక జీవితాంశం గురించి నేను స్పందించినప్పుడు, అది పది మందితో పంచుకోవాలనుకున్నప్పుడు కథలు రాస్తున్నాను. 1978 నంచి నా కథా రచన ప్రారంభమయింది. మంచి కథలు వస్తున్నాయి. ప్రవాహంలో చెత్త కూడా కొట్టుకు వచ్చినట్టుగా చెత్త కథలు వస్తున్నాయి. అవి ఒక వైపుకు కొట్టుకుపోతాయి. మంచి కథలు నిలుస్తాయి. మనస్సుల్ని వెలిగిస్తాయి. అశ్లీలం ముసుగు వేసుకున్న కథలు త్వరలోనే అంతరించిపోతాయి.

కథా ప్రాచుర్యానికి ఆంధ్రప్రభ, రచన, ఆహ్వానం, విపుల పత్రికలు తమ యథాశక్తి తోడ్పడుతున్నాయి. పైనుదహరించిన పత్రికలు మాత్రమే మంచి కథలు సంఖ్యా పరంగా ప్రచురించి సరియైన మార్గంలో వెళ్తున్నాయి.

కథలకు ప్రోత్సాహం లేదు. కథా రచయితలకు సరియైన విలువ సాహిత్య పరంగా ఇవ్వడం లేదు. కథపై విమర్శ రావడం లేదు. మంచి కథలను గుర్తించడం లేదు. కవితా సంపుటాలు వచ్చినంతగా కథా సంపుటాలు రావడం లేదు. నేను వంద కథల వరకూ రాసినా ఒక్క కథా సంపుటం కూడా తీసుకు రాలేకపోయాను. తెలుగు యూనివర్సిటీ కొంత మందికి మాత్రమే ఆర్థిక సహాయం అందచేస్తోంది. కథా సంపుటాల ప్రచురణకు ప్రణాళికలు పెద్దలు ఆలోచిస్తే మంచిది.

**కేతు విశ్వనాథ రెడ్డి.**

మొదటి కథ 1958 లో -కథ లాంటిది మాత్రమే, స్కెచ్ కావచ్చు. 1962 నుంచి అడపా దడపా రాస్తున్నా. చాలా స్లోరైటర్ని, కుదుపు వచ్చినప్పుడు మాత్రమే రాసే మనస్తత్వం ఉన్నవాణ్ణి కాబట్టి, గతంలో వెలుగుచూడని వివిధ సమస్యలూ, జీవిత వాస్తవాలు ఈనాటి కథల్లో చిత్రితమవుతున్నాయి. ముఖ్యంగా ఈతరం కథా

రచయితలు జీవితాన్ని బలంగా పట్టుకోటానికి ప్రయత్నిస్తున్నారు. శిల్ప విషయంలో గాఢమైన సంవేదన విషయంలో మన కథకులు నేర్చుకోవలసింది ఇంకా ఉంది.

భారీ పెట్టుబడి పత్రికల సహకారం కొంత లేకపోలేదు. కానీ ఆ సహకారం ఏ ప్రక్రియకు సంపూర్ణంగా ఉండ జాలదు. వ్యాపారం కాబట్టి, ప్రత్యామ్నాయంగా చిన్న పత్రికలు అంటే తక్కువ సర్క్యులేషన్ పత్రికలు ఈనాడు కథా ప్రాచుర్యానికి చేస్తున్న దోహదం తక్కువేమీ కాదు. వాటిని పాఠకులు కాపాడుకుంటూ పోతే అవి, మంచి కథా బతికి బట్టకడతాయి.

మంచి జీవితం, ఇంత ఉన్నత సంస్కారం కోరే మంచి కథలు చేతనైనంత వరకూ ఎవరైనా రాస్తూ పోవడం మేలు. ఆర్తితో చిత్త శుద్ధితో, సిద్ధాంతాల నుంచీ, కాక జీవితం నుంచి రాయాలనే తపనతో మంచి రచనలు మంచి పాఠకుల్ని పెంచుతాయి. మంచి పాఠకులు సమాజ ఆరోగ్యానికి దోహదం చేస్తారు. అయితే కథలే సొంతంగా సమాజ జీవనాన్నీ సాహిత్యాన్నీ సంపూర్ణంగా మర్చలేవు. అది మార్పుకు ఒక సాధనం. సాధనాలన్నీ బలపడినప్పుడు సమాజము జీవితము సాహిత్యము గుణాత్మకంగా మార్పు చెందుతాయి.

**వాడ్రేవు వీరలక్ష్మీదేవి**

అస్పష్టంగా ఉన్న జీవితాన్ని ఏదో ఒక మూల నుంచి అర్థం చేసుకోడానికి కథలు వ్రాసే ప్రయత్నం 1979 నుండి వ్రాస్తున్నాను. వేల రచయితల్లో రచయిత్రుల్లో సంగం మందికైనా కథ ద్వారా ఒక జీవితం వివరించాలన్న తపన కనిపిస్తోంది. మంచి కథ వ్రాస్తే వేసుకోగల మంచి పత్రికలు లేకపోలేదు. కానీ స్థూలంగా చూస్తే పత్రికల నుంచి మంచి రచయితలకు ప్రోత్సాహం లేదు. ఒకే విషయాన్ని పది కథలుగా చెప్పడం వల్ల పెద్దగా ఉపయోగం

